# నాలుగు నవలలు

(మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## క్లూ ఇచ్చిన కాకిపిల్ల

రచన : సికిందర్

## సంసారంలో సరిగమలు

రచన: వసుంధర

## అల్పాయుష్కుడు

రచన: వాణిశ్రీ

## కోటీశ్వరుని హత్య

రచన: టెంపోరావ్

పొగమంచు—పదకొండవ భాగం

**అపరాధ పరిశోధన సప్లిమెంట్ – 83**
నవంబర్, 1980
వెల: రు. 4-50
ఏడాది చందా 55 రూపాయలు
జీవిత చందా 325 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
**శ్యామదామోదర్ రెడ్డి**

సంపాదక వర్గం:
**టెంపోరావ్**
**శ్యాంబాబు**
**రమణశ్రీ**
**ఏ. పి. మోహన్రావ్**
**సుజనశ్రీ**
**వసుంధర**
**విద్వాన్ షీలాదేవి**

కార్యాలయం:
**అపరాధ పరిశోధన కార్యాలయం**
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
**క్రాంతి ప్రెస్,**
2, ఫ్రానిస్స్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# క్లూ ఇచ్చిన కాకిపిల్ల!

సికిందర్

జాన్ కారు వేగం తగ్గించి, వరుసగా ఎడమవైపు వున్న ఇళ్ళ కేసి చూస్తూ, కావల్సిన ఇంటిని వీధి దీపాల ఫ్లోర్ సెంట్ కాంతిలో గాలిస్తూ, చివరికి ఒకచోట బ్రేకు వేసి ఆపేశాడు.

ఆ వీధిలో ఇళ్ళన్నీ డైనింగ్ రూంలో స్పూను పడితే విన్పించేంత నిశ్శబ్దంగా వున్నాయి. అప్పుడు సమయం 11 దాటింది గనుక, స్పూన్ల చప్పుడూ వుండదు. బహుశ ఏ మార్వాడీ సేఠ్ ఇంట్లోనైనా ఒకటీ అరా గురక విన్పించవచ్చు....

అలాంటి సమయంలో జాన్ కావల్సిన ఇంటిని కను క్కొని కారు దిగాడు. పూర్తికావచ్చిన సిగరెట్‌ని బూటుకాలికింద నలిపేసి, గేటుదగ్గరి కెళ్ళాడు. విశాల మైన తోట వెనుక ఇల్లు చీకటిగా వుంది. క్రింద ఒక గదిలో మాత్రం లైటు కన్పిస్తోంది.

గేటుకి తాళం వేసి వుంది—జాన్ దానిమీద చప్పుడు

చేశాడు. కానీ ఇంట్లో కదలిక లేదు. మరో రెండుసార్లు తట్టి, కారు దగ్గరకొచ్చి హారన్ ప్రయోగించాడు. దాని శబ్దానికి పరిసరాలు వింతగా ప్రతిధ్వనించాయి. కొన్ని క్షణాల్లో రెండు మూడు ఇళ్ళలో చక-చక లైట్లు వెల గడం గమనించాడు జాన్.

తలుపు తెరిచి ఒక ఆకారం బయటికొచ్చింది. అది పరుగు పరుగున వచ్చి ఆయాసంతో రొప్పుతూ జాన్ని చూసి, "మీరా!" అంది.

"అవును. రమ్మని చెప్పి మీరు మర్చిపోయారను కుంటాను."

"లేదు! మీ కోసమే ఎదురు చూస్తున్నాను!" అతను తాళం తీసి గేటు తెరిచాడు. "ఏమని చెప్పను, జాన్! జీవితంలో నేనెప్పుడూ భయమన్నది ఎరుగను. ఇప్పుడు-ఇప్పుడు తలచుకుంటే—"

"మీరేమీ తలచుకోకండి, మిస్టర్ ధరమ్‌చంద్" జాన్ అన్నాడు ఆ వ్యక్తిని పరికించి చూస్తూ. అతనికి 50 ఏళ్ళుంటాయి. ప్యాంటు, షర్టులో వున్నాడు. వెంట్రుకలు దట్టంగా వుండి చాలావరకు నెరిసిపోయాయి. అతని విశాలమైన తెల్లటి ముఖంలో చెప్పలేనంత ఆందో ళన వుంది.

"ఐ—ఐయామ్ సో సారీ!" అన్నాడతను తేరు కుంటూ, "ముందు లోనికి రండి. వివరంగా చెప్తాను. మీ ఫ్రెండ్—లాల్ ఏడి?"

"ఫ్రెండ్ కాదు పార్ట్‌నర్."

"పార్ట్‌నర్ ఫ్రెండ్ కాదా?"

"బిజినెస్ ఈజ్ బిజినెస్, మిస్టర్ ధరమ్‌చంద్."

"ఓహ్, మరి అతనేడి?"

"అతను రాత్రిపూట తిరగడు."

"కానీ, మీ డిటెక్టివ్‌లకు రాత్రి పగలనేవి వుండవని—"

"ఎవరన్నారు? రాత్రింబవళ్ళు మాకూ వున్నాయి. పగులు పనిచేస్తాం; రాత్రి పడుకుంటాం-అది మా హక్కు. మీకేదో గండం ఏర్పడిగుండె పనిచేయడం మానుకుంటే, మా విశ్రాంతి నెందుకు త్యాగం చెయ్యాలి? అది మా ఇష్టం, అవునా? పోలీసు సేవలు మీ కెప్పుడైనా లభిస్తాయి. అది వాళ్ళ విధి. మేం ఎవరికీ కట్టుబడి వుండనవసరం లేదు!"

"ఉంది మిస్టర్ జాన్, వుంది" అన్నాడు ధరమ్‌చంద్. "మీరు మీ పార్టనర్ ఆజ్ఞలకి కట్టుబడి వుండకపోతే నిద్రలేచి ఇలా వచ్చేవారు కాదు. ఐయాం ష్యూర్!"

జాన్ కంగుతిన్నాడు. "వెల్, ఇంకా ఇక్కడ వుంటే నా పరువుతీసేలా వున్నారు, పదండి!"

ధరమ్‌చంద్ ఫకాలన నవ్వేసి నడిచాడు.

ఇంట్లో విశాలమైన హాల్లో, మెత్తటి సోఫాలో జాన్‌ని కూర్చోబెట్టి ధరమ్‌చంద్, లోనికెళ్ళి డ్రింక్స్‌తో తిరిగివచ్చాడు.

జాన్ తటపటాయించాడు.

"ఏమిటీ?"

"విస్కీ....ఇప్పుడు తీసుకుంటే లాల్ పసిగడ్తాడు."

ధరమ్‌చంద్ ఫక్కుమన్నాడు.

"అతనంటే మీకు చాలా భయం కదూ?"

"ప్లీజ్ మిస్టర్ ధరమ్‌చంద్, నాతో అలా మాట్లాడవద్దు!"

"అయితే సోడా ఇవ్వనా, వాసనకొట్టదు?"

"ఆ పని చెయ్యండి."

పది నిమిషాల తర్వాత అన్నాడు జాన్.

"మనమిలా ఫ్రీగా కూర్చుని తాగుతున్నాం, ఇంట్లో ఎవరూ లేరా?"

"మాధురి వూరికెళ్ళింది."

"మాధురి?"

"నా భార్య."

"ఓహ్, మీ భార్య!" నిస్పృహగా అన్నాడు జాన్.

"చాలా మంచిది. ఆమె నా భార్యగా దొరకడం అదృష్టం."

జాన్ అసహనంగా అన్నాడు, "మీ దురదృష్టం గురించి చెప్పండిక! తారుమారైన బ్రీఫ్ కేసు ఏది? ఆ యువతి ఎవరు?"

ధరమ్చంద్ లేచి టేబిల్ మీద బ్రీఫ్ కేసు తెచ్చాడు. జాన్ దాన్ని తెరిచి చూశాడు: ఒక చీర, జాకెట్, లోదుస్తులు కొన్ని టాయిలెట్ వస్తువులు వగైరా వున్నాయి.

"వెల్, ఏం జరిగిందో ఇప్పుడు వివరంగా చెప్పండి!" అన్నాడు జాన్.

ధరమ్చంద్ కొన్ని క్షణాలు నిశ్శబ్దంగా వుండి అన్నాడు:

"పది గంటలకి నేను ఆఫీసు మూసి కార్లో యింటికొస్తున్నాను. బృందావన్ హోటల్ ప్రక్కన నాకు ఫైనాన్సింగ్ కంపెనీ వుంది....పదేళ్ళ కృషి ఫలితంగా నేనిప్పుడు బిజినెస్లో బాగా స్థిరపడ్డాను. ఈ బిజినెస్లో ఎంత రిస్క్ వుందో మీకు తెలుసు: డబ్బుతో

వ్యవహారం. చాలా చాకచక్యం అవసరం. నేనెప్పుడూ నష్టపోలేదు,ఢోకా తినలేదు. నేనెంతో అదృష్టవంతుడనని నా నమ్మకం. కానీ ఇప్పుడు జరిగింది తెలుసుకుంటే—"

"అలా బెంగపడకండి. మీరింతవరకూ చాలా సరదాగా మాట్లాడారు."

"జాన్, నిజానికి నేను చాలా సరదా మనిషిని. కానీ జీవితం ఎప్పుడూ సరదాగా వుండదు- అందులో కష్టాల్ని చవిచూడక తప్పదు!"

జాన్ అసహనంగా అన్నాడు, "కాసేపు మీరు కోల్పోయిందేమిటో మర్చిపోయి, జరిగిందేమిటో విపులంగా చెప్తారా?"

"సరే—వినండి. నేను కార్లో యింటికి వస్తున్నాను. ఏవైనా ముఖ్యపత్రాలుంటే ఏరోజు కారోజు ఇంటికి తెస్తాను. నా గదిలో సేఫ్ వుంది. మరీ ముఖ్యమైన పత్రాలుంటే మర్నాడు బ్యాంక్ లాకర్లో భద్రపరుస్తాను. నేనిపుడు ఇంటికొస్తున్నప్పుడు నా బ్రీఫ్ కేసులో చాలా పత్రాలున్నాయి. మామూలు ప్రామిసరీ నోట్లనుంచి సెక్యూరిటీ డీడ్స్ వరకూ.

ఆఫీసునుంచి నేను నాంపల్లి స్టేషన్ వైపుకెళ్ళి పబ్లిక్ గార్డెన్స్ గుండా ఇక్కడికి చేరుకోవాలి. నా కారు స్టేషన్ రోడ్డు చేరుకున్నాక కాస్త ఎదురుగా ఈ యువతిని చూశాను. ఆమె చేతిలో ఈ బ్రీఫ్ కేస్ వుంది. ఒంటరిగా నిలబడి బస్సుకోసమో, ఆటోకోసమో ఎదురుచూస్తోంది. ఆమె అప్పుడే రైలు దిగివచ్చిందనుకుంటాను—ఇంటికెళ్ళే ఆతృతలో వుంది.

ఆ సమయంలో ఏ బ్రైను వచ్చిందో నాకు తెలియదు. స్టేషన్ ముందు ఆటోలూ, టాక్సీలూ వున్నా ఆమె రోడ్డు

మీద నిలబడి ఎదురుచూసే శ్రమ ఎందుకు తీసుకుందో అసలు తెలియదు. ఆమెని చూసి నాకెందుకో దగ్గరి కెళ్ళాలనిపించింది. కానీ—నా కారు దగ్గరవుతోంటే ఆమె కంగారుగా చెయ్యి వూపింది—"

"అప్పుడు మీరాపేశారు. ఎందుకాపారు. అంతేనా? అలా ఆపడం మొదటినుంచీ మీ బలహీనత అనుకుంటాను."

"లేదు జాన్. మీరు పొరబడ్డారు. నా కలాటి బల హీనతల్లేవు. పాతికేళ్ళుగా మాధురి నాతో ఎంతో అన్యోన్యంగా కాపురం చేస్తోంది. ఆమెని మోసగించ లేను. పైగా ఇది వయసు కూడా కాదు. నేను కారెందు కాపానో స్పష్టంగా చెప్పలేను....వయసు రీత్యా పిల్లలు లేని అసంతృప్తివల్ల హఠాత్తుగా ఆమె మీద కల్గిన పుత్రికా వాత్సల్యంవల్ల కావచ్చు లేక వొంటరిగావున్న స్త్రీని ఆదుకోవాలన్న నా వ్యక్తి ధర్మంవల్ల కావచ్చు....కారణం ఏదైనా ఆమె చెయ్యి వూపగానే కారాపేశాను.

ఆమెకు పాతికేళ్ళుండవచ్చు. అంత అందమైనదీ, కానిదీ చెప్పలేను. నాకు వర్ణనరాదు. పసుపు రంగు చీరలో వుంది. కళ్ళకు గాగుల్స్ వున్నాయి. ఎత్తు అయిదున్నర వుండవచ్చు. అంత లావూ కాదు సన్నమూ కాదు—"

"మరి?"

"మధ్యస్థం."

"ప్రొసీడ్! మీరు బ్రహ్మాండంగా వర్ణిస్తున్నారు" జాన్ ఉత్సాహంగా అన్నాడు.

"సారీ! అంతకంటే వర్ణించలేను!" ధరమ్‌చంద్

జాన్‌ని నిరుత్సాహపరుస్తూ అన్నాడు. "ఆమె ముఖం సరిగా చూడ్లేదు. చీకటి. పైగా గాగుల్స్. ఆమె కంఠం మాత్రం మధురంగా వుంది....మర్యాదగా కారులోకి తొంగిచూసి క్షమాపణకోరి లిఫ్ట్ ఇస్తారా అనడిగింది. తలూపి డోర్ తెరిచాను. ఆమె థాంక్స్ చెప్పి ఎక్కాక ఎక్కడికెళ్ళాలో అడిగాను. సెక్రటరియేట్ ముందు డ్రాప్ చెయ్యమంది. కారు పోనిచ్చాను. ఆమె బ్రీఫ్‌కేసు ఆమె ప్రక్కనే సీటు మీద ఉంది___"

"ఆమె మధురమైన కంఠం ఏ భాషలో పలికింది."

"ఇంగ్లీషులో. కానీ ముఖంచూస్తే తెలుగు అమ్మాయిలా వుంది."

"అమ్మాయా? యూ మీన్, అవివాహితా?"

"తెలియదు. నేనామెవైపు ఎక్కువగా చూడ్లేదు. దృష్టి రోడ్డుమీద నిలిపి డ్రైవ్ చెయ్యాలి. లేకపోతే అక్సిడెంట్ చేస్తాను. ప్రక్కన సుందరాంగి వుంటే ఆమెతో డ్రీమ్ సీక్వెన్స్ వేసుకొని డాష్ ఇచ్చే కుర్ర డ్రైవర్ని కాను నేను!" ధరమ్‌చంద్ కోపంగా అరిచాడు.

"ఓ.కే! ఓ.కే! అప్పుడేం జరిగింది?"

ధరమ్‌చంద్ నెమ్మదిపడుతూ అన్నాడు, "ఆమె బెంగుళూరునుంచి వస్తున్నట్లు చెప్పింది. కానీ రాత్రి పూట ఆటోలూ టాక్సీలూ ఎక్కాలంటే ఆమెకు భయమట. బస్సులోనే వెళ్తుందట. బస్సు దొరక్కపోతే నాలాంటి పెద్దమనుషుల్ని లిఫ్ట్ అడుగుతుందట....

"ఆమె చాలా మాట్లాడింది. అవసరానికి మించి మాట్లాడింది. నేనామెని ఏమీ అడగలేదు. ఆమె ఎవరో ఏం చేస్తుందో ఎక్కడ ఉంటోందో అడగాలను

కున్నాను.... కాని ఆమె మాటల్లోనే సెక్రటరియేట్ వచ్చేసింది. అందుకు నేనేమీ బాధపడలేదు. ఆమె దిగి థాంక్స్ చెప్పేసి వెళ్ళిపోయింది.

"అంతే— నేనింటికొచ్చేశాను. ఆమె ఎటు వెళ్ళిందో చూడలేదు. ఇంటికొచ్చి స్నానం చేశాక ఈ బ్రీఫ్ కేసు తెరిచిచూస్తే ఏముంది. ఇవి కన్పించాయి! థాంక్ గాడ్ మాధురి లేకపోవడం మంచిదే అయింది! లేకపోతే వీటిని చూసి నన్నపార్థం చేసుకొని ప్రళయం సృష్టించి వుండేది!"

జాన్ తలూపాడు. "అపార్థం చేసుకోవడం భార్యల హాబీ. మీ బ్రీఫ్ కేసులో డాక్యుమెంట్స్ గురించి చెప్పండి."

"చాలా విలువైనవి- మొత్తం పదకొండు వున్నాయి."

"ఎవరెవరివున్నాయో చెప్పగలరా?"

ధరమ్‌చంద్ అనుమానంగా చూశాడు "ఎందుకు?"

"కేసు యింట్రస్టుగా వుంది."

"నా మీద అనుమానమా? చీట్ చేస్తున్నాననుకుంటున్నారా?"

"ఇంతవరకు అనుకోలేదు. ముందు ఆ డాక్యుమెంట్ వివరాలు చెప్పండి: ఎవరెవరి వున్నాయి?"

ధరమ్‌చంద్ గబ-గబా కొందరు వ్యక్తుల సంస్థల పేర్లు చెప్పాడు. వాటిలో జాన్‌ను 'జీవన్ రావ్' పేరు ఆకర్షించింది.

"ఆగండి— ఈ జీవన్ రావ్ గురించి చెప్పండి. అతను సినీ ప్రొడ్యూసర్ కదూ?"

"అవును."

"అతనికి మీరు ఫైనాన్స్ చేశారా?"

"అవును—నాలుగు లక్షలు. ఈ ఉదయమే చెల్లింపు అయింది."

"సెక్యూరిటీ ఏమిటి?"

"అతని ఇల్లు—బేగం పేటలో పెద్ద బంగళా వుంది."

జాన్ కళ్ళు విశాలమయ్యాయి.

"డబ్బు ఎలా చెల్లించారు?"

"చెక్కు ఇస్తామన్నాం. కానీ చెక్కు మార్చుకొనే వ్యవధి తనకు లేదన్నాడు. స్పాట్ క్యాష్ కావా లన్నాడు. ఇచ్చాం."

"అతని వ్యవహారానికి చెందిన పత్రాలింకేవైనా వున్నాయా?"

"ఉన్నవి రెండూ పోయాయి—అతను వ్రాసిచ్చిన బాండ్, సెక్యూరిటీ డీడ్."

"కాబట్టి మీ దగ్గర అతని సంతకమంటూ ఎక్కడా లేదన్నమాట?"

"లేదు. ఏమిటి మీ అనుమానం, జాన్? త్వరగా వెళ్ళి ఆ యువతి జాడతియ్యండి! ఆ బ్రీఫ్ కేసును స్వాధీనం చేసుకోండి! ఆమె కావాలని ఏమీ చేయలేదు. ఇది పొరపాటున జరిగింది. ఆమె మీద ఎలాటి నిందలు వేయకండి—"

"ఇది పొరపాటున జరిగిందా?" అన్నాడు జాన్ లేచి నిలబడి, "బిజినెస్ తప్ప మరో ధ్యాసలేదు మీకు. పొద్దస్తమానం డబ్బు! డబ్బు! లోకజ్ఞానం శూన్యం. మీకు బి.పి. వుందా?"

ధరమ్‌చంద్ కంగారుగా చూసి, "లేదు—" అన్నాడు.

"అయితే వినండి! ఈ జీవన్‌రావ్ ఫ్రాడ్! ఏ విష

యంలోనూ అతనికి నైతిక విలువలు లేవు! సినీఫీల్డులో కెల్లా పెద్ద అవినీతిపరుడు! అనుకున్నది సాధించడానికి ఎలాంటి మార్గాలనైనా అనుసరించడానికి సందేహించడు.

ఆఫ్ కోర్స్, అతను ఇరవైఏళ్ళుగా ఫీల్డులో వుంటున్నాడు. ఎన్నో హిట్ చిత్రాలు తీశాడు. కానీ ఈ మధ్య తీసిన రెండు భారీ చిత్రాలు మట్టికొట్టుకు పోయాయి. డబ్బంతా పోగొట్టుకున్నాడు. అప్పులు మిగిలాయి. మళ్ళీ అతనికి సినిమా ఆలోచన లేదు! వింటున్నారా? మిమ్మల్ని అలా నమ్మించి డబ్బు పొందాడంటే ఘోరంగా మోసంచేశాడు. మీ రిదివరకు అతనికి ఫైనాన్స్ చెయ్యలేదు. అతని గురించి మీకేమీ తెలియదు. అవునా?"

"అవును. అయితే నన్ను మోసం చేశాడని ఎలా అంటున్నారు?"

జాన్ నవ్వాడు జాలిగా: "సెక్యూరిటీ చూపించిన బంగళా అతను ఆఫీసుకోసం అద్దెకు తీసుకున్నది, ధరమ్ చంద్."

"మై—మై గాడ్ నిజమా?"

"అప్పుడే ఏం ఆశ్చర్యపోతారు? అసలు సంగతి వినండి!"

"ఏమిటి?"

"మీ బ్రీఫ్ కేసును అతనే తస్కరించాడు—మోసం బయటపడుతుందని భయపడి ఆ నకిలీ పత్రాల్ని నాశనం చెయ్యడానికి."

"ఏమిటీ! ఈ పని జీవన్ చేశాడా! నమ్మను, జాన్!"

"వారం క్రితం ఒక యువతి జంగిల్ రామ్ అండ్ మంగల్ రామ్ బ్రదర్స్ని మోసగించింది. ఈ వార్త

విన్నారా?"

"విన్నాను."

"నమ్మరా?"

ధరమ్‌చంద్ అయోమయంగా తలూపాడు.

"వెల్, రసికుడైన మంగళ్‌రామ్ ఆమెని మీ దృష్టితో చూడక పోవడంవల్ల కథ మరి కాస్త ముందుకు నడిచింది—ఇంటివరకూ. ఆమె ఇంట్లో అతనికి కమ్మటి కర్చీఫ్‌తో మరో లోకం చూపించి, తాళంచెవులు కాజేసి, సేఫ్‌లో పత్రాలు కొంగున చుట్టుకొని చెక్కేసింది. అయితే ఆ పత్రాల్లో కూడా జీవన్ డాక్యుమెంట్స్ వుండటం విశేషం."

"చాలా ఆశ్చర్యంగా వుంది!"

"రామ్ బ్రదర్స్ కూడా అతని సొంత బంగళా అనుకొని లోన్ ఇచ్చారు. చెక్కు కాకుండా స్పాట్ క్యాష్ చెల్లించారు—మీకులాగే జీవన్ మోసం వాళ్ళకింకా తెలియదు. నాకూ తెలియలేదు, మీ వ్యవహారం తెలుసుకునేవరకూ. ఇంకెందరి దగ్గర జీవన్ ఈ మోసం చేశాడో—చేస్తున్నాడో తెలియదు. వాళ్ళందరి దగ్గరా ఇలాగే ఫాల్స్ డాక్యుమెంట్స్ దొంగలించి నాశనం చేస్తాడు. ఆ తర్వాత డబ్బుతో ఉడాయిస్తాడు!"

ధరమ్‌చంద్ కొయ్యబారిపోయాడు.

"ఓహ్! దీన్ని ఆపండి! వెంటనే అతన్ని అరెస్ట్ చెయ్యండి!"

"పత్రాలు నాశనమయ్యాక అతని మోసం ఎలా నిరూపిస్తారు? డబ్బు చెల్లించినట్లు ఆధారాలేవీ లేవు, సాక్షులూ లేరనుకుంటాను. మిఠాయిపొట్లంలా అందించారు. అతను, ఎంచక్కా స్వాహా చేసి—"

"ఆపండి! మీరు చెప్పున్నది నిజమైతే తక్షణం అతన్ని పట్టుకోండి! డాక్యుమెంట్స్ నాశనం కాకుండా చూడండి! త్వరగా వెళ్ళండి! మీకెంత డబ్బు కావాలన్నా ఇస్తాను!"

"ఓ.కే., మిస్టర్ ధరమ్‌చంద్. ఆ డాక్యుమెంట్స్ అన్నీ నాశనమైతే మీరు కొన్ని లక్షలు నష్టపోతారు. లక్షకో వెయ్యి చొప్పున చెక్కు వ్రాసి పెడితే న్యాయంగా వుంటుంది."

జాన్ బ్రీఫ్ కేసు అందుకొని బయటికి నడిచాడు.

ధరమ్‌చంద్ ఉద్రేకంగా జీవన్‌ని తిట్టుకోసాగాడు.

## 2

జాన్ కాలింగ్ బెల్ నొక్కి కొన్ని క్షణాలు ఎదురు చూసిన తర్వాత, అకస్మాత్తుగా తలుపు తీసి ఓ నలభై ఏళ్ళు పైబడ్డ స్త్రీ దర్శనమిచ్చింది.

ఆమె ముఖంలో ఆ సమయంలో అపరిచితుణ్ని చూసి కలవరపు ఛాయలు ప్రస్ఫుటించాయి.

ఆ వయసులోనూ ఆమె ఆకర్షణీయంగా వుంది.... వయసు పైబడ్డా పిల్లలు కలగని స్త్రీలు ఇలాగే సౌందర్యం కోల్పోకుండా వుంటారని జాన్ గ్రహించాడు.

అతను నవ్వి, "క్షమించండి, ఇంత రాత్రి ఇబ్బంది పెట్టినందుకు. నా పేరు జాన్—డిటెక్టివ్‌ని" అన్నాడు.

ఆమెలో ఉలికిపాటు జాన్ గమనించక పోలేదు. భయంతోనో, మరెందువల్లనో ఆమె కళ్ళు విశాలమయ్యాయి. ఆమె ఒక్కసారిగా తేరుకుంటూ అంది: "మీరు డిటెక్టివా! అయితే మారువేషాలు వేసి మనుషుల్ని వెంటాడుతారన్నమాట?"

"అవును, అది మీకు వినోదంగా వుండవచ్చు.... కాని ఎప్పుడు ఎవరు చంపుతారోనని నాకు చచ్చేంత భయంగా వుంటుంది!"

ఆమె గట్టిగా నవ్వేసింది. "మిమ్మల్ని చంపేవారెక్కడెవరు లేరు—లోనికి రండి!"

"అంత అవసరంలేదు, ప్రభావతిగారూ! నేను మీ వార్ని కలవాలి. ఇంట్లో వుంటేనే లోనికొస్తాను."

ఆమె జాన్‌ని ఓ క్షణం తీక్షణంగా చూసింది. ఆమె కళ్ళు విచిత్రంగా మెరుస్తున్నాయి. ఆమె అదోలా నవ్వి, "నా పేరు మీ కెలా తెలుసు?" అంది.

"నాకెలా తెలుసు! పబ్లిక్ ఫిగర్స్ పేర్లెవరికి తెలియవు? మీరు ప్రముఖ ప్రొఫెసర్ భార్యనని మర్చిపోతున్నారా?"

"ఎవరైనా భర్తల్ని మర్చిపోతారా! లోనికిరండి, ఆయన కాస్సేపట్లో వచ్చేస్తారు."

"ఆయన యింట్లో లేరా? అయితే నేను ఆఫీసు కెళ్తాను."

"ఉండండి— నేను ఫోన్ చేసి కనుక్కుంటాను, అక్కడున్నారో లేదో?"

"ఆ పని చెయ్యకండి. చూడండి మాడమ్, మీరు కూడా నాతో వచ్చేయండి!"

"మీతోనా! ఎందుకు?"

జాన్ తటపటాయించాడు.

"పరి....స్థితి అలాంటిది. మీరు రెచ్చిపోకూడదు. మీ వార్ని కలుసుకునేందుకు ఒక డిటెక్టివ్ వస్తున్నట్టు ఫోన్ చేసి మీకు తెలియజేయడం ప్రస్తుత పరిస్థితిలో మంచిది కాదు."

"అంటే, ఏమిటి మీరనేది?" ఆమె గొంతు సరిగా పెగలేదు.

"విడమర్చి చెప్పడానికి సమయంలేదు. త్వరగా రండి! మనం వెంటనే అక్కడికి చేరుకోవాలి!"

"అసలేమిటది? ఆయనేం చేశారని? పోలీసు వ్యవహారమా?"

"మీ వూహ కరెక్టు. కమాన్, లెట్స్‌గో!"

ఆమె కంగారుగా చెప్పులేసుకొచ్చి తలుపుకు తాళం వేసింది. ఆమె కారెక్కాక జాన్ స్టార్టుచేసి పోనిచ్చాడు.

"వెల్, మీరేమీ అప్‌సెట్ కాకండి. చీకట్లో బాణాలు వదలడం డిటెక్టివ్‌లకి తరచు అనివార్యమవుతుంది.... మీ భర్తమీద నా అనుమానం నిజం కాకపోవచ్చు. అందుకే నేనిప్పుడు ఆయన ఏ వ్యవహారంలో చిక్కుకున్నారో చెప్పి, తర్వాత మీ ఆగ్రహానికి గురికాదల్చలేదు!"

ఆమె తలూపింది. "ఆయన ఎందులోనూ చిక్కుకోరని—లేరని—నాకు తెలుసు. పదండి!"

"దట్స్ గుడ్. మొదట నేను ఆఫీసుకే వెళ్ళాలనుకున్నాను. కాని, ఇంత రాత్రి ఇంట్లోనే వుంటారనిపించింది...."

"ఈ మధ్య ఆయన ఇంట్లో సరిగా వుండటంలేదు."

"ఎందుకు మాడమ్, షూటింగ్స్ ఏమీ లేవుగా?"

"ఆయన—వ్యవహారాలు నాకు తెలియవు."

"అంటే, మళ్ళీ ఆయన చిత్రం నిర్మిస్తున్నారనుకుంటున్నారా?"

"లేదు. ఇంకేం మిగిలిందని నిర్మించటానికి? ఉన్నదంతా ఆ రెండు చిత్రాల్లో కొట్టుకుపోయింది!"

"ఆ రెండు చిత్రాలు ఎందుకు దురదృష్టం తెచ్చాయో అర్థంగావటం లేదు. ఆయన ఇరవై ఏళ్ళుగా సినిమాలు తీస్తున్నా; ప్రతీది బాక్సాఫీస్ హిట్."

"మీరు సినిమాలు చూస్తారా?"

"అప్పుడప్పుడు."

"మా సినిమాలు చూశారా?"

"మీరు ఫక్తు ఫార్ములా చిత్రాలు తీస్తారు. అవి నాకు నచ్చవు."

"అయితే మీరు న్యూవేవ్ జాతి అన్నమాట— కళాత్మక చిత్రాలు. లేక డిటెక్టివ్ అయినందుకు స్టంట్ చిత్రాల్ని అభిమానిస్తారా?"

"అలాంటిదేమీ కాదు. నా లైఫ్‌లో కావల్సినంత థ్రిల్, ఎక్సైట్‌మెంట్ వున్నాయి....మళ్ళీ వాటికోసం ఎగబడే అవసరంలేదు. రిలీఫ్ కోసం ఆర్భాటంలేని చిత్రాలు చూస్తాను. తల దిమ్మెక్కే సెంటిమెంట్స్, చెవులు హోరెత్తించే సంగీతం, లేచి పరిగెత్తాలనిపించే సాహిత్యం భరించలేను! కళలనేవి ప్రకృతికి అనుకరణ లన్నాడో మహానుభావుడు. ఎంతో ఉదాత్తంగా నిర్వచించాడు. కానీ ఇప్పటి ధోరణినిబట్టి చూస్తే, కళలనేవి మనలోని బలహీనతలకి ప్రతిరూపాలుగా మారిపోతున్నాయా అనిపిస్తోంది...."

"కళల్ని సృష్టించేవారిలో బలహీనతలుంటే ఆదరించేవాళ్ళలో కూడా వున్నాయని మరువకూడదు!"

"అలా ఆదరించే వాళ్ళలో క్లాస్‌కంటే మాస్ ఎక్కువ. మాస్‌ని ఎన్నడూ నమ్మకూడదు. ఎప్పుడెలా త్రిప్పికొడతారో వూహించడం కష్టం. మీ వారి దుర

దృష్టానికి మాస్ కారణమంటే నమ్ముతారా? అంత భారీగా ఖర్చుపెట్టి మాస చిత్రాలు తీయకపోతే ఏం పోయింది?"

"స్టార్ వాల్యూని నమ్ముకుని ఎవరైనా భారీగా తీస్తారు" అందామె.

"స్టార్ వాల్యూకీ కొన్ని హద్దులున్నాయి, మాడమ్. ఒక నటుడితో ఒక చిత్రం హిట్ అయిందంటే అదే కోవలో మరో పది చిత్రాలు వరుసగా వచ్చి వీలైనంత త్వరగా అతన్ని మూల కూర్చోబెట్టేస్తాయి."

"సరే, ఇప్పుడీ లాటరీ బిజినెస్ గురించివద్దు. గతాన్ని తలుచుకుంటే కళ్ళలో నీళ్ళు తిరుగుతాయి....ఇలా ఊహించని దెబ్బ తింటామనుకోలేదు!"

"అయాం సారీ."

ఆమె మాట్లాడలేదు.

జాన్ వేగంగా డ్రైవ్ చేయసాగాడు. కారు ఏర్‌పోర్టువైపు ప్రయాణిస్తున్నప్పుడు ప్రభావతి అంది: "ఏమిటో, మనసంతా చికాగ్గా వుంది! ఇందాక మీ పేరు జాన్ అన్నారు కదూ? ఇప్పుడు గుర్తొస్తోంది! మీకో పార్ట్‌నర్ లాల్ వుండాలి కదూ?"

"వున్నాడు. ప్రస్తుతం పడుకున్నాడు."

"అయితే మీ గురించి నాకు తెలుసు! ఈ సిటీకి మీరు ఫేమస్ డిటెక్టివ్స్! అవునా?"

"పొగడలు వద్దు మాడమ్. మీవారేం చేయదల్చుకున్నారో చెప్పండి."

"ప్రస్తుతం అప్పులుతీరే ఉపాయం ఆలోచిస్తున్నారు. వాటినుంచి విముక్తి పొందినప్పుడు ఏం చెయ్యాలో ఆలోచిస్తారు."

"ఇల్లు తాకట్టులో వుందా?"

"ఈ ఇల్లులేదు. మద్రాసులో ఇల్లు తాకట్టులో వుంది."

"అయితే ఇళ్ళమ్మి అప్పులు తీరుస్తారా?"

"ఇక్కడ ఇల్లు అమ్మే ప్రశ్నలేదు—అది నా ఇల్లు. అయినా ఇళ్ళమ్మినంత మాత్రాన అప్పులు తీరవు!"

"అయితే మార్గమేమిటి?"

"అదే రెండు నెలలనుంచి ఆలోచిస్తున్నారు. మిస్టర్ జాన్, మీరెవరి తరఫున వచ్చారో; ఎందుకీ ప్రశ్నలు వేస్తున్నారో తెలియడంలేదు."

"అదే నాకు చిత్రంగా వుంది! అప్పులు తీరేమార్గం ఎలా వున్నా, ఆయన బయట కొందరికి మళ్ళీ సినిమా తీస్తున్నట్టు నమ్మిస్తున్నారు."

ఆమె చటుక్కున తల తిప్పి చూసింది.

"నమ్మించడమంటే, వంచిస్తున్నారనా మీ ఉద్దేశం?"

"డామ్ కరెక్ట్! మీరు బాగా వూహిస్తారు....ఓహ్! ఆఫీసు వచ్చేసింది...." జాన్ కారు వేగం తగ్గించి, ఎడమ వైపు వీథిలోకి తిప్పుతూ అన్నాడు: "మనం ఈ చివర దిగి నడవటం మంచిది. మన రాక ఆయన్ని డిస్టర్బ చెయ్యకూడదు."

"మీ ధోరణి చూస్తోంటే ఆయన్ను ఏదో పనిలో రెడ్‌హేండెడ్‌గా పట్టుకుంటారనిపిస్తోంది!"

జాన్ బ్రీఫ్ కేసుతో కారు దిగాడు. ఆమె కూడా దిగింది. ఇద్దరూ నిర్మానుష్యంగా వున్న వీధిలో నడవ సాగారు.

"జాన్, నాకేదో భయంగా వుంది!" అందామె.

"ఎందుకు?"

"ఆయనకు నేనేం సంజాయిషీ చెప్పాలి?"

"డోంట్ బాదర్! మీ తరఫున నేను వాదిస్తాను."

మరో అయిదు నిమిషాల తర్వాత ఇద్దరూ ఒక బంగళా గేటు ముందాగారు. గేటు ఒక రెక్క తెరిచి వుంది. లోపలంతా చీకటి. మేడమీద ఒక గదిలో వెలుగు కన్పిస్తోంది. బంగళా చాలా విశాలమైన ఆవరణలో నిశ్శబ్దంగా వుంది.

జాన్ లోనికి నడిచాడు.

ప్రభావతి అతని చెయ్యిపట్టుకుని ఆపింది.

"నాకు నిజంగా భయంవేస్తోంది! నేను రాలేను!"

"వెల్, ఆయన మీమీద దాడిచేస్తారని భయం వుంటే, మీకు నేను బాడీగార్డుగా వున్నాను. నా ఫీట్స్‌ని తర్వాత మీరే మెచ్చుకుంటారు. ఇక నడవండి!"

"ఓహ్ వద్దు! వెళ్ళిపోదాం, ఆయన ఇంటికొచ్చాక మాట్లాడొచ్చు."

"మాడమ్, అప్పటిదాకా ఆగే పరిస్థితి అయితే మీకీ శ్రమ ఎందుకిస్తాను? మీరు నిర్భయంగా నా వెంట రండి, కమాన్!"

ఆమె అసహాయంగా చూసి కదిలింది. మళ్ళీ ఇద్దరూ కొంత దూరం వెళ్ళాక అకస్మాత్తుగా ఆగిపోయి అందామె, "నేను వెళ్ళి కార్లో కూర్చుంటాను. మీరు మాట్లాడి వచ్చేయండి! ఇక్కడ నా అవసర మేమిటి? నేను ఫోన్ చెయ్యకుండా నివారించడానికిక్కడ తెచ్చారు— నేను వెళ్ళి కార్లో కూర్చున్నంతలో అలాంటి ప్రమాదం రాదు కదా?"

జాన్ ఆమెని ఎగాదిగా చూసి, అసహనంగా అన్నాడు: "మాడమ్, మళ్ళీ మీరంతదూరం ఒంటరిగా

వెళ్ళడం మంచిదికాదు. మీ క్షేమం చూడ్డం నా బాధ్యత. టైం వేస్ట్ చెయ్యకుండా నాతో రండి!"

"ఓహ్, ఆయన ఉద్రేకం మీకు తెలియదు! నన్నిక్కడ చూస్తే రెచ్చిపోతారు! మిమ్మల్ని నేనే తెచ్చాననుకుంటారు! ఆయనకు ఆవేశం వచ్చిందంటే మీ రేమీ చెయ్యలేరు! ఆయన దగ్గర రివాల్వర్ వుంది; మీ దగ్గర వుందా?"

"ఇప్పుడు లేదు. రివాల్వర్ రిస్టువాచీ కాదు; ఎప్పుడూ పెట్టుకు తిరగడానికి. పరిస్థితి అంతవరకూ రాదు. నే నాయనకు షాక్ ఇవ్వబోతున్నాను. కాబట్టి ఆయన జడ పదార్థంలా వుండిపోతారు. కమాన్! బి ఎ బ్రేవ్ వుమన్! లెట్స్ గో!"

ఆమె విధిలేక మళ్ళీ కదిలింది. చీకట్లో ఏమీ కన్పించటంలేదు. ఈ చీకట్లో ఇంట్లోంచి తమనెవరూ పసిగట్ట లేరు. జాన్ మేడమీద గదికేసి లోపలెవరైనా కన్పిస్తారేమో చూస్తున్నాడు.

పది గజాలు నడిచాక ప్రభావతి హఠాత్తుగా కేక పెట్టి, భయంతో ముందుకు తూలి, జాన్ని పట్టుకొంది.

"ఏమిటి ఏం జరిగింది?"

"కాలు....కాలికేదో తగిలింది .... " అర్చిందామె వణికిపోతూ.

జాన్ ఆమెని విడిపించుకొని నేలమీద వంగి తడిమి చూశాడు.

అతని ఒళ్ళు చల్లబడింది. చేతికేదో మెత్తగా చల్లగా తడిగా తగిలింది.

అలాగే దాన్ని గట్టిగా పట్టుకొని నిలబడ్డాడు. జేబు లోంచి అగ్గిపెట్టె తీసి ఒక పుల్ల గీశాడు. ఒక్కసారిగా

వెలిగిన కాంతిలో ప్రభావతి జాన్ చేతిలోకి చూసి మళ్ళీ కెవ్వుమంది.

"షటప్! అరవకండి!" జాన్ వారించాడు, మేడ మీద గదికేసి చూస్తూ. కానీ ఆ గదిలో కదలిక లేదు.

అగ్గిపుల్ల వెలుతుర్లో చేతిలో పక్షిని చూశాడు: అది కాకిపిల్ల—ఇంకా రెక్కలు రాలేదు. సరిగ్గా గుప్పిటలో ఇమిడింది. దాని దేహమంతా ఎర్రగా తడిసివుంది.... కళ్ళు మూసివున్నాయి. దాని బుల్లి కడుపులో బుల్లెట్ రంధ్రం వుంది: అది చచ్చిపోయింది.

"కాకిపిల్ల! చాలా దారుణంగా వేటాడారు. ఈ ప్రాంతాల వేటకు అనుమతి లేదు!" జాన్ చుట్టూ తిరిగి చూశాడు. అతని ప్రక్కనే కుడివైపు ఒక బాదం చెట్టు వుంది!! "వెల్, ఈ చెట్టుమీద గూడు వుండవచ్చు' పదండి ఇక వెళ్దాం!"

ఆమె భయం భయంగా చూసింది; "దాన్ని పారేయండి!"

"జేబులో పెట్టుకుంటాను, ఏం చేస్తారు?"

బంగళా చేరుకొని మెట్లెక్కుతున్నప్పుడు ఈసారి జాన్ కాలికేదో తగిలింది. మళ్ళీ తడిమిచూశాడు: అది చెప్పు—ఆడవాళ్ళ హీల్ చెప్పు.

"ఓహ్! ఇదేదో నిధికి దారితీసే మార్గంలా వుంది—ఈసారి ఏం తగులుతుందని మీ ఊహ?"

"లోనికెళ్ళి నెత్తిమీద చావుదెబ్బ తగిలించుకోకుంటే అదే చాలు! పారిపోదాం, పదండి!"

జాన్ చక-చకా మెట్లెక్కి తెరిచివున్న తలుపులోంచి జాగ్రత్తగా లోనికెళ్ళాడు. ప్రభావతి తటపటాయిస్తూ అనుసరించింది.

జాన్ లోనికి అడుగువేసి ఆశ్చర్యంగా చూశాడు.

ప్రభావతి భయపడూ అతని వెనుక వెళ్ళి నిలబడింది. కానీ, మరుక్షణం కెవ్వుమని కేకపెడుతూ అక్కడినుంచి తిరిగి బయటికి పరుగుతీసింది.

# 3

"వెల్! ఇక్కడ చిన్నసైజు యుద్ధరంగంలా వుంది. ఇంత ఘర్షణ జరిగి షాట్స్ ప్రేలినా ఎవరికీ విన్పించక పోవడం అసహజంగానూ వుంది!" అన్నాడు లాల్, గదిని కలయజూస్తూ.

ఇన్స్పెక్టర్ కృష్ణన్ తల విదిలించాడు. "షాట్స్ కొందరికి విన్పించాయి, ఫ్రెండ్. అయితే అదే క్షణంలో ఒక్కసారిగా కాకులు అరుస్తూ ఎగరడంతో స్పష్టంగా గుర్తించలేకపోయారు. ఈ బంగళా వెనుక గ్యారేజి వుంది. రాత్రి తెల్లవార్లూ పనిచేస్తుంటారు. అందువల్ల అప్పుడప్పుడు మోటారు వాహనాలు బ్యాక్ ఫైర్ చెయ్యడం విన్పిస్తుందట.... బహుశ అదే కావచ్చు అనుకున్నారు."

జాన్ అన్నాడు, "కానీ గ్యారేజిలో ఎవరూ ఈ షాట్స్ వినలేదు, లాల్. అక్కడ ఇంజన్ల రొదతో చాలా గందరగోళంగా వుంది."

లాల్ తలతిప్పి, టేబిల్ దగ్గర నేలమీద పడివున్న ఆకారాన్ని చూశాడు.

ప్రొఫెసర్ జీవన్‌రావు దృఢకాయం నిర్జీవంగా, ముఖమంతా రక్తంలో తడిసి వెల్లకిలా పడివుంది. అతని ఎడమకంటి పైభాగంలో బుల్లెట్ గాయముంది. అతని కళ్ళు రెండూ విశాలంగా తెరిచివున్నాయి. పిడికిళ్ళు గట్టిగా బిగుసుకుని వున్నాయి. ఒంటిమీద దుస్తులు

బాగా నలిగిపోయి వున్నాయి—అక్కడక్కడ చిరుగులు కన్పిస్తున్నాయి.

గదిలో వస్తువులన్నీ చెల్లాచెదురుగా పడివున్నాయి. బెడ్ మీద దిళ్ళూ, దుప్పటీ ఓ మూలకి విసిరేసివున్నాయి. దాని ప్రక్కన కుర్చీ బోర్లా పడివుంది. మేజా పై సొరుగు లాగివుంది. ఫ్లవర్ వాజ్ తాకిడికి డ్రెస్సింగ్ మిర్రర్ తూనాతునకలై, పెంకులు చెల్లాచెదురుగా పడ్డాయి. వాటిలో కొన్ని హతుని పాదాల్ని గాయపర్చడంవల్ల అరికాళ్ళు ఎర్రగా కన్పిస్తున్నాయి.

అద్దాల కిటికీ దగ్గర ఒక గాజు గ్లాసు పగిలివుంది. కిటికీ రెక్కలు మూసివున్నాయి. కుడిరెక్క అద్దంలో రెండు రంధ్రాలు ఒక అడుగు ఎడంగా, ఒకదానిపై ఒకటి వున్నాయి. ఆ రంధ్రాల చుట్టూ పగుళ్ళ వ్యాప్తిని జాన్ పరిశీలిస్తున్నాడు. గదిలో ఇంకెక్కడా బుల్లెట్ తాకిడికి గురయిన ప్రదేశాలు లేవు.

నిపుణుల సిబ్బంది సాక్ష్యాధారాల్ని సేకరిస్తోంది.

డాక్టర్ శవాన్ని పరీక్షించి చావు గంటన్నర—రెండు గంటల క్రితం సంభవించిందన్నాడు. అంటే పదకొండూ పదకొండున్నర మధ్య బయట రివాల్వర్ షాట్స్ విన్న వాళ్ళ సమయంతో డాక్టర్ సూచనకి సమన్వయం కుదిరింది. శవాన్ని తరలించారు.

జాన్ లాల్ వైపు తిరిగి అన్నాడు:

"మొత్తం అయిదు షాట్స్ విన్పించాయని జనం చెప్తున్నారు. అయిదు బుల్లెట్స్‌లో రెండు ఈ అద్దం లోంచి దూసుకెళ్ళగా, మూడవది దేహంలో కెళ్ళింది. అద్దంలోంచి బయటికెళ్ళిన రెండు బుల్లెట్స్‌లో ఒకటి బాదం చెట్టుమీద ఈ కాకిపిల్లను గాయపర్చింది. నేను

చెట్టెక్కి చూశాను. గూళ్ళో మరో రెండు పిల్లలూ, తల్లి కాకీ బిక్కు బిక్కుమంటూ పాపం చాలా నెర్వెస్ గా కన్పించాయి.

"అయితే మిగతా రెండు బుల్లెట్స్ ఏమయ్యాయి? గదిలో ఇంకెక్కడా బుల్లెట్స్ తాకిన స్థలాల్లేవు. ఒక వేళ ఘర్షణలో ఆ యువతి కూడా గాయపడిందా? కొందరు చెప్పిన ప్రకారం నాలుగు షాట్స్ వెను వెంటనే విన్పించాక, కాస్సేపటి తర్వాత మరో షాట్ పేలింది. ఆ యువతి కూడా గాయపడిందనుకుంటే ఇక్కడ బ్లడ్-రక్తం వుండాలి. కానీ లేదు! ఈ గదినుంచి ఆమె పారి పోయిన మార్గంలో ఎక్కడా రక్తం చిందలేదు."

"కాబట్టి, ఇన్ స్పెక్టర్," జాన్ కృష్ణన్ వైపు తిరిగాడు, "మెట్ల దగ్గర దొరికిన ఈ చెప్పునిబట్టి, ఇక్కడ దృశ్యాన్నిబట్టి హంతునికీ, ఆమెకూ ఘర్షణ జరిగింది— ఇతన్ని చంపాక ఆమె పారిపోయింది. రివాల్వర్ హంతు నిది-ఆ సొరుగులోంచి తీయబడింది. ఆమె రివాల్వర్ తో-బహుశ ఒక బ్రీఫ్ కేసుతో కూడా పారిపోయివుండాలి—"

ఆ తర్వాత జాన్ పావు గంటసేపు కేసు మొదటి నుంచీ వివరించాడు. కృష్ణన్ వివరాలు వ్రాసుకున్నాడు.

"ఇక, జీవన్ రావ్ అక్రమంగా డబ్బు పోగుచేసు కొంటూంటే ఈ ఇంట్లో గుప్తంగా అపారమైన ధనం వుండవచ్చు. సోదా జరపాలి!"

"వెల్, ఆ పని కృష్ణన్ చేస్తారు" అన్నాడు లాల్ బయటికి దారితీస్తూ.

"మనకిక్కడ పనిలేదు. కేసుతో సంబంధం వున్న వ్యక్తుల్ని కలుసుకోవాలి కమాన్!"

జాన్ కాకిపిల్లను కాయితంలో చుట్టి కృష్ణన్ కిచ్చాడు.

"దీన్ని జాగ్రత్త చెయ్యండి. కుళ్ళిపోకుండ జాగ్రత్త తీసుకోండి."

"దీనితో ఏం చేస్తారు?"

"దీన్ని కుక్కలకి ఎర వేయడం మనస్కరించడంలేదు. ఎంత ముద్దొస్తుందో ఒకసారి చూడండి! దీన్ని ఫార్మాలిక్ పాత్రలో వేసి పెడితే మంచి అలంకారంగా వుంటుంది."

"చూసేవాళ్లకు మూర్ఛవచ్చేలానూ వుంటుంది! మీ అయిడియా అదికాదు, మిస్టర్ జాన్."

"అవును, కాదు. ఈ కాకిపిల్ల కడుపులో ఎవిడెన్స్ వుంది. గ్రహించారా?"

"ఓ.హ్హో_ఓహ్హో___"

"అలాగే విస్తుపోండి!"

జాన్ బయటికి నడిచి లాల్‌ని కలుసుకున్నాడు. ఇద్దరూ క్రిందికివచ్చి డ్రాయింగ్ రూంలో కెళ్ళారు.

అక్కడ ప్రభావతి చేతుల్లో ముఖం దాచుకొని వెక్కి వెక్కి ఏడుస్తోంది. ఆమె ప్రక్కన ఒక లావాటి ఆగంతకుడున్నాడు. అతను జీవన్‌రావ్ పర్సనల్ సెక్రటేరీ మణిగా పరిచయం చేసుకున్నాడు.

"హలో మాడమ్," లాల్ సానుభూతిగా అన్నాడు, "మీవారి మరణం మమ్మల్ని ఆశ్చర్యచకితుల్ని చేసింది. ఆయన ఇలా అకాలమృత్యువు పాలవుతారనుకోలేదు! మీకు సానుభూతి తెలియజేస్తున్నాను.

"మీరిప్పుడు ఇంటికి వెళ్ళిపోవడం మంచిది. మీ సన్నిహితుల ఓదార్పు కావాలి మీకు. మీరు త్వరగా కోలుకుంటారని ఆశిస్తాను. అయితే మీరిప్పుడు మాట్లాడే స్థితిలో వుంటే కొన్ని ప్రశ్నలకి సమాధానాలివ్వండి: మీ భర్త కొన్ని సంస్థల్ని మోసంచేసి డబ్బు పోగు

చేస్తున్నారని మీకు తెలుసా?"

ఈ ప్రశ్నకి ప్రభావతి తలెత్తి కన్నీళ్ల పర్యంతమైన ముఖంతో దీనంగా, నీరసంగా చూసింది.

"తెలియదు."

"వెల్, ఇప్పుడు తెలుసుకున్నారు. ఈ అద్దె ఇంటిని అక్రమంగా తాకట్టు పెట్టి డబ్బు పొందడమేగాక, ఆ నకిలీ పత్రాల్ని ఒక యువతి తోడ్పాటుతో తస్కరించి నాశనం చేస్తున్నారు.... ఆ యువతి ఎవరో తెలుసా?"

"తెలియదు. ఎందరో యువతులతో ఆయనకు పరిచయాలుంటాయి. ఆయన సినీ ప్రొడ్యూసర్."

"అయితే ఈ చెప్పు చూడండి: ఇదెవరిదో తెలుసా?"

"నాకు తెలియదు."

"ఈ బ్రీఫ్ కేసు—ఈ దుస్తులు చూడండి."

"అలాటివి నే నెప్పుడూ చూళ్ళేదు!"

"ఆయనిలాటి పనికి పూనుకున్నారంటే దేశం విడిచిపెట్టే ప్రయత్నంలో వుండవచ్చు. ఏమంటారు?"

"ఈమధ్య ఆయన ప్రయత్నాలు, వ్యవహారాలూ నాకు తెలియవు. ఆయనిలాటి పనికి ఒడిగడ్తాడని నే నెన్నడూ వూహించలేదు."

మణి మధ్యలో ఆతృతగా అన్నాడు:

"సర్ పరిస్థితి విచిత్రంగా వుంది. బాస్ ఇలా చేశారంటే నమ్మలేకపోతున్నాను.... ఆయన కలాపాల గురించి ఆమెకేమీ తెలియదు. నేనిప్పుడు అంతా చెప్పేస్తాను. ఆయన పోయాక రహస్యాలు దాచి మీ దర్యాప్తుని కుంటుపర్చలేను. నేను బాస్ ఉప్పు తిన్నాను. ఆయన్ని చంపిందెవరో త్వరగా శిక్షింపబడేలా చూస్తాను!"

"మణి! ఏమిటి నువ్వనేది! నీకేం తెలుసు?" అంది

ప్రభావతి తీవ్రంగా.

"నేను పర్సనల్ సెక్రటరీని."

"నీకు రహస్యాలు తెలిసివుంటే నా దగ్గరెందుకు దాచావు?"

"దాచానా? అవి మీకు తెలుసనుకున్నాను."

"నాకు తెలియవు!"

"అయితే తెలియకుండా వుం డ ట మే మంచిది! పదండి, సర్. మీతో విడిగా మాట్లాడాలి."

ముగ్గురూ బయటపడి నడిచారు.

ఆవరణలోకొచ్చాక కారు దగ్గరికెళ్ళి నిలబడ్డారు. లాల్ సిగరెట్ ముట్టించి తలూపాడు, "ఇప్పుడు చెప్పండి, మణి."

మణి క్షణం సందేహించి అన్నాడు: "సర్, ఆయనిలా అవినీతికి పాల్పడ్డారంటే నమ్మలేకపోతున్నాను. కాని మీ మాటల్లో నిజముందనిపిస్తోంది.... ఆయన రెండు చిత్రాలు దెబ్బతీశాక వున్నదంతా వూడ్చుకుపోయింది. అప్పులు మిగిలాయి. మద్రాసులో ఇల్లు తాకట్టులో వుంది. ఇక్కడి ఇల్లు భార్య పేర్న వుంది. ఆమె తాకట్టుకు అంగీకరించలేదు. నాకు తెలిసి ఆమె ఎన్నడూ భర్త కష్టాల్లో చేయూత నివ్వలేదు. వాళ్ళమధ్య కంశాం కురం విషయంలో వివాదాలున్నాయి. ఒకర్నొకరు నిందించుకుంటారు.... సరే, బాస్ ఈ రెండు నెలలు చాలా అశాంతిగా గడిపారు. చిత్ర నిర్మాణానికి స్వస్తి చెప్పారు. కానీ ఈ నిర్ణయం బయటివాళ్ళకి తెలియ నివ్వలేదు.

"ఈమధ్య ఆయన నాతో ఒకమాట చెప్పారు: ఇక్కడ్నుంచి శాశ్వతంగా వెళ్ళిపోయి సింగపూర్లో

స్థిరపడతానన్నారు. అక్కడేదైనా వ్యాపారం చేస్తానన్నారు. ఎలాగైనా భార్యని ఒప్పించి, ఇల్లు అమ్మేసి ఆ డబ్బుతో వ్యాపారం ప్రారంభిస్తానన్నారు. ఇక్కడ అప్పులకి మరికొంత గడువు పొడిగించి, ఆ లోపు చెల్లిస్తానని వాగ్దానాలు చేస్తానన్నారు. భార్యతోబాటు నన్ను కూడా తీసుకెళ్తానన్నారు. నేనంటే ఆయనకు చాలా నమ్మకం, గురి.

"కానీ సర్, ఆయన నాతో ఒక విధంగా చెప్పి మరోవిధంగా చేస్తున్నారని ఇప్పుడే తెలిసింది. ఆయనలాటి పనులెప్పుడూ చెయ్యలేదు. ఇల్లమ్మడానికీ, సింగపూర్ వెళ్ళడానికీ భార్య ఒప్పుకోలేదనుకుంటాను. లేక, ఆమెతో విసిగిపోయి విడిచిపెట్టాలనే ఉద్దేశంతో ఆయన ఆలోచన ఆమెతో చెప్పలేదనుకుంటాను.

"ఇదే నిజమైతే అయన మరో స్త్రీని చేపట్టివుండాలి. ఆమెతో డబ్బు కూడబెట్టుకొని, భార్యకు తెలియకుండా సింగపూర్ వెళ్ళాలనుకొని వుండాలి. ఇంతలో ఇలా— ఆయన అన్ని సమస్యలనుంచీ ఇలా విముక్తిపొందారు, సర్!"

"ఆ యువతి ఎవరో మీకు తెలుసా?"

"ఎవరని చెప్పాలి? ఆయన జీవితంలో చాలామంది వున్నారు."

"ఇటీవల కాలంలో ఎవరున్నారో చెప్పండి."

"ఓహ్, ఆయనింకా చంచల ప్రేజీనుంచి బయటపడలేదు! చంచలను ఆయనే ఫీల్డుకి తెచ్చారు—ఆరేళ్ళ క్రితం. ఇప్పటికీ ఆమె ఎవర్‌గ్రీన్ హీరోయిన్. ఆమె ధాటికెవరూ తట్టుకోవడంలేదు. ఇక్కడ మొట్టమొదటి స్టూడియో నిర్మించినప్పుడే బాస్ స్థిరపడ్డారు. అలాగే

చంచల బాస్ మొదటి చిత్రంలో నటించినప్పుడే ఇక్కడ సెటిలైంది. ఇప్పటికీ ఇద్దరూ చాలా సన్నిహితంగా వుంటారు. ఒకర్నొకరు విడిచివుండలేరు! బాస్ మరో యువతిని చేపట్టివుంటే చంచల తప్ప మరెవరూ నా దృష్టిలో లేరు."

"కానీ చంచల అందుకు ఒప్పుకుంటుందా? ఇక్కడ బంగారు జీవితాన్ని కాలదన్ని జీవన్‌తో మామూలు జీవితానికి సిద్ధపడుతుందా?"

"చెప్పలేను. చూస్తే ఆమె జీవన్‌ని వదులుకునేలా లేదు."

"కాని మీ బాస్ ఆమెని ఒప్పించి వుండడు. మరో యువతిని చేపట్టివుండాలి. ఈ దొంగతనాల్ని నిర్వహించారంటే అది డబ్బు, పేరూ వున్న చంచల సహాయంతో కాదు. ఆయనతో వెళ్ళడానికంగీకరిస్తే ఆమె దగ్గర చాలా డబ్బు వుంది. ఇలా అవినీతికి పాల్పడే అగత్యం మీ బాస్‌కు లేదు. ఈమధ్య మీ బాస్ మరెవరితోనైనా ఎక్కువగా గడపడం చూశారా?"

"లేదు."

"ఈ చెప్పు, దుస్తులు చూడండి—"

"చూశాను. ఇవి ఎవరివో నాకు తెలియదు."

"వెల్, మీ బాస్‌తో ఆ యువతికి ఎందుకు ఘర్షణ జరిగిందో తెలియడంలేదు. అకస్మాత్తుగా వాళ్ళిద్దరిమధ్య ఏ వివాదం తలెత్తివుంటుంది? ఘర్షణలో రివాల్వర్ పాత్ర వహించిందంటే సమస్య ప్రాణాలమీదకొచ్చి వుంటుంది. అంటే ఆమె బ్లాక్‌మెయిల్ కొడిగట్టిందా? ఆయన భార్య ఎలాంటిది? ఆయన బయటి వ్యవహారాల్ని

సహిస్తుందా?"

"చంచలతో ఘర్షణపడ్డాక ఆయన గురించి పట్టించుకోడం మానేసింది."

"ఓహ్! ఆమె చంచలతో ఘర్షణపడిందా? ఎందుకు?"

"బాస్‌తో ఆమె వ్యవహారం సహించలేక!"

"అయితే తర్వాత పట్టించుకోడం ఎందుకు మానేసింది?"

"ముందు విరక్తి అనుకున్నాను. తర్వాత చంచల అంటే దేనికో భయపడుతోందని తెలుసుకున్నాను."

"భయమెందుకు? ఆమె జీవన్‌కు భార్య."

"ఎవరైనా కానీయండి. చంచలజోలికి వెళ్ళి ఎవరూ బాగుపడలేరు. ఆమె నిప్పులాంటిది."

"అంటే ప్రభావతిని బెదిరించిందా?"

"అదే నా అనుమానం. కానీ ఏ విషయంలో బెదిరించి వుంటుందో తెలియదు."

"ఈ ఘర్షణ ఎప్పుడు జరిగింది?"

"రెండేళ్ళయింది."

"చంచల జీవన్‌తో మరో యువతిని సహిస్తుందా?"

"ఆమె నిప్పులాంటిది! జీవన్‌తో ఎవర్నీ సహించదు!"

"అందుకే ప్రభావతిని బెదిరించి వుంటుందా?"

"కాదు."

"ఎందుక్కాదు?"

"భార్య ప్రేయసి కాదు కదా?"

లాల్ నవ్వాడు, "ఆల్‌రైట్, మీరు చాలా విషయాలు చెప్పారు. మీరిక వెళ్ళవచ్చు. అవసరమైతే తర్వాత కలుస్తాం."

# 4

మర్నాడు జీవన్‌రావ్ మరణవార్త దావానలంలా వ్యాపించింది. హైద్రాబాదులో, మద్రాసులో కూడా కలకలం రేపింది. ప్రజలు విభ్రాంతి చెందారు. సన్నిహితులు, శ్రేయోభిలాషులూ దుఃఖ సముద్రంలో మునిగారు.

సినీ ఫీల్డు యావత్తు మూతపడింది: షూటింగ్స్ కాన్సిలయ్యాయి. పలుచోట్లనుంచి ప్రముఖులంతా హైద్రాబాదుకు ప్రయాణమయ్యారు.

జీవన్ మృతదేహం పోస్ట్‌మార్టమ్ నిమిత్తం రాత్రంతా మార్చురీలోనే వుంచారు. ఉదయం ఎనిమిది గంటలకి పోస్టుమార్టమ్ ప్రారంభించారు. సాయంత్రం అయిదు గంటలకి గొప్ప వూరేగింపుతో అంత్యక్రియలు జరుగుతాయి.

ఆ ఉదయం చంచల జీవన్ ఇంటికి వెళ్ళి ప్రభావతిని కావలించుకుని వలవలా ఏడ్చేసి అందర్నీ సంభ్రమాశ్చర్యాలలో ముంచెత్తింది. రెండేళ్ళ క్రితం బహిరంగంగా దూషణలకి పాల్పడ్డ ఈ ఇద్దరి మధ్య అకస్మాత్తుగా విభేదాలు సమసిపోవడంతో, గాసిప్ పత్రికలకి మంచి మేత దొరకింది.

జీవన్ చావు గురించి పత్రికలు పూర్తి వివరాలు ప్రకటించలేదు. అతని వ్యక్తిత్వానికి మచ్చతెచ్చే విషయాలన్నీ పోలీసులు మరుగుపర్చారు. ఇంకా బయల్పడని ఏదో ఆంతరంగిక వ్యవహారంలో జీవన్ ఒక అనామక యువతితో ఘర్షణపడిన ఫలితంగా ఈ దుర్ఘటన జరిగిందనీ, విస్తృత పరిధిలో వేగంగా దర్యాప్తు సాగుతోందనీ కమీషనర్ చెప్పినట్లు వ్రాశాయి.

అనామక యువతి జాడ కనుక్కోవడంలో డిటెక్టివ్‌లు కొంతవరకు సఫలమయ్యారు. ఆమె ఇంట్లోంచి పారిపోతోండగా ఎవరూ చూడకపోయినా, దారిలో ఎవరికీ తారసపడకపోయినా, హత్య జరిగిన సమయంలో ఇంచుమించు కొన్ని నిమిషాల వ్యవధిలో ఏర్‌పోర్టు దగ్గర టాక్సీ ఎక్కిన ఒక యువతిని వేటాడారు.

ఆమె చేతుల్లో బ్రీఫ్‌కేసు లేదు. హాండ్ బ్యాగున్నది. హోటల్ మయూర్ ముందు దిగాక ఆమె ఆచూకీ గాల్లో కలిసింది....

అయితే మంగళరామ్, ధరమ్‌చంద్‌ల అస్పష్ట వర్ణన ఆ యువతికి సరిపోయింది. ఆమె నడకలో అందర్నీ ఆకర్షించే ప్రత్యేకత వుంది: మగరాయుడి నడక: ఇరుప్రక్కలా తూలుతూ నడుస్తుంది. డిటెక్టివ్‌లు ఈ గుణాన్నీ, ఆమె ఆనవాల్నీ మణికి విన్పించి; గంటన్నర సేపు ప్రయత్నించి ఫలితం రాబట్టారు.

డిటెక్టివ్‌ల ప్రశ్నలతో మెదడు పూర్తిగా వేడెక్కిన మణి, "ఇప్పుడు తెలుస్తోంది! ఆమె ఎవరో తెలుస్తోంది! ఆ అమ్మాయి ఉషారాణి!" అనర్చాడు.

వెంటనే ఉషారాణి ఫ్లాట్ చేరుకున్నారు. దానికి తాళం వుంది. ఆమె రాత్రినుంచి లేదని తెలిసింది. అక్కడ పోలీసు నిఘా వుంచారు.

ఆమె ఎమ్మెస్సీ చదువుతోందనీ, అయితే ఈ మధ్య చదువు మానేసి తిరుగుతోందనీ పొరుగువాళ్ళు అన్నారు. ఆమె స్నేహితులందరివద్దా వెతికారు. ఎక్కడా లేదు. స్వగ్రామానికి ఫోన్ చేశారు. అక్కడికీ చేరలేదు. వచ్చిన వెంటనే కస్టడీలోకి తీసుకోమని అక్కడి పోలీసులకి

హెచ్చరిక చేశారు.

కానీ, హోటల్ మయూర్ దగ్గర ఆమె అదృశ్యం ఎంతకీ అంతుబట్టలేదు! ఆమె లోనికి రాలేదని డ్యూటీలో వున్న రిసెప్షనిస్టు అన్నాడు. అక్కడ టాక్సీ దిగి నడిచి వెళ్ళడానికి పరిసరాల్లో వీధి ఎక్కడా లేదు. ఆమె టాక్సీ మారిందనుకొంటే అక్కడ టాక్సీ స్టాండు కూడా లేదు. ఏ రన్నింగ్ ఆటోలోనో వెళ్ళివుంటే మాత్రం ట్రేస్ చెయ్యడం చాలా శ్రమతో కూడుకున్న పని.

అక్కడితో వేటకి బ్రేకు పడింది.

ఉదయం పదిగంటలకి కృష్ణన్ ఫోన్ చేసి, జీవన్ ఆఫీసులో పన్నెండు లక్షల రొక్కం, కొన్ని డాక్యుమెంట్స్ లభించాయని చెప్పాడు. రామ్‌బ్రదర్స్‌కి కబురు వెళ్ళింది. వాళ్ళిద్దరూ ఆ డాక్యుమెంట్స్ తమవేనని ధృవపరచి, డిటెక్టివ్‌ల సేవానిరతిని కొనియాడారు.

## 5

ఫోరెన్సిక్ లాబ్ డైరెక్టర్ డాక్టర్ ఖాదిల్కర్ డిటెక్టివ్‌లను సావధానంగా చూసి, "అవును, ఇది నిజం." అన్నాడు.

"ఎలా నిజం! నమ్మలేకపోతున్నాను" అన్నాడు లాల్

"మీ ముద్దుల కాకిపిల్ల!" కృష్ణన్ అన్నాడు జాన్‌ని ఉద్దేశించి, "పాపం, తాను బలి అవుతూ అతి ముఖ్యమైన క్లూ మనకిచ్చింది! ఈ క్లూతో హత్యా స్వరూపమే మారిపోయింది!"

జాన్ అన్నాడు, "మీరు బాగా రూఢిచేసుకొనే ఈ విషయం చెప్తున్నారా?"

బాలస్టిక్స్ ఎక్స్‌పర్టు ఇస్కందర్ తలూపాడు:

"అవును, పొరపాటులేదు. హతుడి మెదడులో, కాకిపిల్ల కడుపులోనూ వున్న బుల్లెట్స్ ఒకటి కావు. అవి వేర్వేరు రివాల్వర్స్‌నుంచి వచ్చాయి."

"అదెలా సంభవం?"

"నా ఉద్దేశంలో కిటికీ అద్దంగుండా ఒక రివాల్వర్ రెండుసార్లు పేలాక, హతుని తలలో మరో రివాల్వర్ పేలింది. అయితే హతుని తలలో రెండు బుల్లెట్స్ వున్నాయి—"

"ఏమిటీ! రెండు బుల్లెట్స్!"

"అవును, డాక్టర్ నాకు రెండు బుల్లెట్స్ అందించారు. అవి రెండూ మెదడులో లభించాయి. గాయం ఒకటే. కానీ బుల్లెట్స్ రెండు. ఈ రెండు బుల్లెట్స్ ఒకటే. ఒకే కోణంలో ప్రయాణించాయి. గాయం క్లోజ్ షాట్ కాదు. గాయం చుట్టూ గన్ పౌడర్, ఆయిల్ మరకలు లేవు. రివాల్వర్ కొన్ని అడుగుల దూరంనుంచి షూట్ చెయ్యబడింది."

"ఎలా? అప్పుడు బుల్లెట్స్ రెండూ ఒకే రంధ్రం గుండా ఎలా వెళ్ళాయి?"

"ఇలా చాలా అరుదుగా జరుగుతుంది—రివాల్వర్ చెడిపోయినప్పుడు లేదా చాలా కాలంగా ఉపయోగించకుండా వుంచినప్పుడు. ట్రిగ్గర్ లాగినప్పుడు బుల్లెట్ పేలకుండా మజిల్‌లోనే ఇరుక్కుంటుంది. మరోసారి లాగినప్పుడు రెండవ బుల్లెట్ పేలి, మొదటిదాన్ని పేల్చి—దాన్ని నెట్టుకుంటూ పోతుంది. అలా రెండూ ఒకే మార్గంలో, కోణంలో ప్రయాణించి; ఒకే బిందువును తాకుతాయి. వీటిని టాండెమ్ బుల్లెట్స్ అంటారు. ఈ హత్యలో సరిగ్గా ఇలాగే జరిగింది."

"ఓహ్, అయితే ఈ రివాల్వర్ ఏ రకానికి చెందింది?"

".38 కాలిబర్, కోల్ట్. లోడ్ చేసి చాలాకాలంగా ఉపయోగించలేదు."

"రెండవ రివాల్వర్?"

"అదే కాలిబర్, స్మిత్. కండిషన్‌లో వుంది."

"థ్లా ఇచ్చిన కాకి పిల్ల!" జాన్ నిట్టూర్చాడు, "వూహించండి, మనమెంత అదృష్టవంతులమో! కాకి పిల్లను బుల్లెట్ తాకకపోతే, ఈ సంఘటనలో రెండు రివాల్వర్స్ ఉపయోగించబడ్డాయని ఎన్నడూ తెలిసేది కాదు!"

"అదే నేనంటున్నాను!" అన్నాడు కృష్ణన్, "కాకి పిల్లను తాకివుండకపోతే దీని జత బుల్లెట్‌లాగే ఇదీ మాయమయ్యేది! ఇక శవంలో దొరికిన బుల్లెట్స్‌తో మనం నిర్దోషిని పట్టుకొని శిక్షించేవాళ్ళం!"

"హతుని తాకిన బుల్లెట్స్ కొంత దూరంనుంచి వచ్చాయి గనుక, అతనితో పెనుగులాడుతున్నప్పుడు ఉషారాణి చేతిలో పేలిన బుల్లెట్స్ అవి కావడానికి వీల్లేదు. ఆ బుల్లెట్స్ కిటికీగుండా బయటికెళ్ళాయి. కాబట్టి కాకిపిల్లలో లభించిన బుల్లెట్‌కు చెందిన స్మిత్ రివాల్వర్ ఆమె చేతిలో వుంది. ఇక టాండెమ్ బుల్లెట్స్‌ని పంపిన కోల్ట్ రివాల్వర్ మరో వ్యక్తి చేతిలో వుండాలి.

"ఆ మరొక వ్యక్తి ఇద్దరిమధ్య ఘర్షణను అవకాశంగా తీసుకొని, చాటుగా వుండి షూట్ చేసి వుండాలి. అలా గాక హతునివద్దా, ఉషారాణివద్దా చెరొక రివాల్వర్ వుంటే; కోల్టు రివాల్వర్ ఉషారాణి చేతిలో వుంటే! షాట్స్ పేలినపుడు ఇద్దరూ పెనుగులాడుతూగాక, కొన్ని అడుగులు ఎడంగా వుంటే మాత్రం పరిస్థితి మా

వూహించవచ్చు—అతన్ని ఉషారాణి చంపి వుండాలి.

"కానీ ఇద్దరివద్దా రివాల్వర్స్ వుండేందుకాస్కారం లేదనిపిస్తోంది. రికార్డ్ ప్రకారం జీవన్ దగ్గర ఒకటే రివాల్వర్ వుంది—స్మిత్. ఇక ఉషారాణి దగ్గర కోల్టు వుండే వీల్లేదు. ఆమె విద్యార్థిని.

"కాబట్టి ఈ కోల్టు రివాల్వర్ ఉపయోగించిన వ్యక్తి మరొకరున్నారు. జీవన్ ఉషారాణిల మధ్య పెనుగులాట జరుగుతున్నప్పుడు · ఉషారాణి చేతిలోనో, లేక జీవన్ చేతిలోనో రెండుసార్లు రివాల్వర్ ప్రేలాక, అప్పుడు ఈ వ్యక్తి చాటుగావుండి తన రివాల్వర్ ప్రయోగించి వుండాలి. ఆ తర్వాత ఉషారాణి పోయాక అక్కడ జీవన్ రివాల్వర్ నీ, బ్రీఫ్ కేసునీ తొలగించి వుండాలి."

"వాటిని తొలగించటంలో ఉద్దేశమేమిటి? చాటు మనిషి దగ్గర .38 కోల్టు వుందంటే ఆ వ్యక్తి పురుషుడై వుండాలి. కొన్నాళ్ళుగా—బహుశ ఏళ్ళుగా దీన్ని ఉపయోగించకున్నా గురి బ్రహ్మాండంగా వుంది. అతనెవరు? ఎవరైనా ఫైనాన్సర్ కావచ్చా?" అన్నాడు జాన్.

"ధరమ్‌చంద్?" కృష్ణన్ అడిగాడు, "చెప్పలేం, కాని, జీవన్ సెక్రటరీ మణిని కూడా మనం దృష్టిలో వుంచుకోవాలి."

లాల్ ఇస్కిందర్ వైపు తిరిగాడు:

"బుల్లెట్స్ విషయంలో నాకు సందేహం వుంది. స్మిత్ రివాల్వర్‌నుంచి వెలువడ్డాయని మీరు చెప్తున్న బుల్లెట్స్‌లో ఒకటి లక్ష్యాన్ని—పక్షిని తాకకముందు రెండు యానకాల గుండా ప్రయాణించింది—"

"అవును. ఒకటి గాలి, రెండోది అద్దం."

"దట్స్ రైట్. గాలి బుల్లెట్స్‌ని హాని చెయ్యాగు. కాని అద్దంనుంచి దూసుకెళ్తున్నప్పుడు రాపిడివల్ల బులెట్ మీాది రేఖాకృతులు చెడిపోయి గుర్తించడం కష్టం కావచ్చునేమో?"

ఇస్కిందర్ నవ్వాడు.

"అలా జరగదు. అద్దంవల్ల స్ట్రియేషన్స్ చెడిపోవు. మేం పరీక్షలు జరుపుతున్నప్పుడు ఇసుక సంచుల్లోకి షూట్ చేస్తాం. అద్దంకంటే ఇసుకవల్ల ఎక్కువ రాపిడి వుంటుంది. అయినా బుల్లెట్స్‌కెలాంటి హానీ జరుగదు.

"మిస్టర్ లాల్, ఈ బుల్లెట్స్ అన్నీ ఒకే రివాల్వర్ నుంచి వెలువడ్డాయని మీా అనుమానం కావచ్చు. అది నిజం కాదు. స్ట్రియేషన్స్ విషయం అలావుంచి, శవంలో దొరికిన బుల్లెట్స్, పక్షిలో దొరికిన బుల్లెట్ విభిన్నాకృతుల్లో వున్నాయి."

"ఆల్ రైట్. షూట్ చేయబడ్డ అయిదు బుల్లెట్స్‌లో నాలుగింటి ఉనికి తెలిసింది. మరో బుల్లెట్ సంగతేమిటి? అదెక్కడ—ఎవర్ని తాకింది?"

"నేనా గదిని ఉదయం పరిశీలించాను. కిటికీ అద్దంలో తప్ప ఇంకెక్కడా బుల్లెట్స్ తాకలేదు. ఆ యువతిని తాకివుంటే అక్కడ రక్తం వుండేది. ఆమె జెట్ విమానంలా ఏర్‌పోర్టు చేరుకొని టాక్సీలో మాయమైందంటే గాయపడి వుండదు. ఒకవేళ చాటుమనిషి చేతి నుంచి ఆ బుల్లెట్ వెలువడివుంటే అది ఉషారాణిని వెంబడించి వుండవచ్చు—"

జాన్ వులికిపడ్డాడు "యూఆర్ డామ్ కరెక్ట్! నాలుగు షాట్స్ తర్వాత కాస్సేపటికి అయిదవ షాట్ విన్పించింది. అది ఉషారాణి పారిపోతున్నపుడు చాటు

మనిషి షూట్ చేసి వుండవచ్చు. కాని గురి తప్పింది!"

"నా వూహ కూడా అదే!" అన్నాడు ఇస్కిందర్.

లాల్ కృష్ణన్ వైపు తిరిగాడు, "వెల్! మీరిప్పుడు సినీ నటి చంచలదగ్గర రివాల్వర్ వుందేమో చెక్ చెయ్యండి!"

"హీరోయిన్ చంచల?" కృష్ణన్ ఆశ్చర్యంగా అడిగాడు.

"యస్. మిస్ చంచలాదేవి." అన్నాడు జాన్.

"ఎందుకు? ఆ చాటు వ్యక్తి ఆమే అనుకుంటున్నారా?"

"ఏమనుకుంటున్నామో ఆమెని కలుసుకొనివచ్చాక చెప్తాం!" అన్నాడు లాల్.

అదే క్షణంలో ఫోను మ్రోగింది.

లాల్ అవతలి కంఠం విని, "యస్, లాల్ హియర్" అన్నాడు.

"మిస్టర్ లాల్! నేను సినీ నటి చంచలను మాట్లాడు తున్నాను. నన్ను క్షమించండి, చాలా తప్పు చేశాను. నేనిలా ఎందుకు చేస్తున్నానో తెలియటంలేదు! మనసు పూర్తిగా వికలమైంది. రాత్రంతా నిద్రలేదు! జీవన్ నా గదిలో రాత్రంతా నవ్వుతూ గడిపాడంటే మీరు నమ్మరు. అతన్ని ద్రోహం చేశాను. అతనికా దుస్థితి కల్గించి మనశ్శాంతిగా బ్రతకలేను! నా మనసు క్షోభిస్తోంది! నా అంతరాత్మ ఈ పాపం సహించనంటోంది!

"నేనింకా అబద్ధాలు చెప్తూ నటించలేను! జీవన్‌ని నేనే చంపాను. అతను నన్ను మోసం చేశాడు. నేను కసిదీరా చంపాను. కానీ నాకు మనశ్శాంతి లభించలేదు! ఇక జీవన్ ఆత్మ నన్ను వదిలిపెట్టదు! అందుకే పశ్చాత్తాపంతో నేనే శిక్ష విధించుకుంటున్నాను....అవును,

నేనిప్పుడు చచ్చిపోతున్నాను. ఇదే నా పాపానికి—"

"హలో!" లాల్ అర్చాడు మధ్యలో, "మీరు త్వరపడకండి!"

కానీ లైను కట్ అయింది.

"కమాన్! కమాన్! ఆమెని ఆపాలి!" లాల్ విసురుగా బయటి కురికాడు.

కానీ అక్కడికెళ్ళేటప్పటికి అంతా అయిపోయింది.

చంచల ఫోను దగ్గర చేతిలో రివాల్వర్ తో, రక్తంలో బోర్లా పడివుంది.

## 6

చంచల ఆత్మహత్య చేసుకోలేదనీ, హత్య చేయబడిందనీ డిటెక్టివ్ల పరిశోధనలో తేలింది. ఆమె ఒక పెద్ద బ్లాక్ మెయిలర్ అని కూడా బయటపడింది.

లాల్ అన్నాడు: "లుక్ హియర్, చంచలను హత్య వెయ్యడానికి రెండు మోటివ్స్ వున్నాయి. ఒకటి జీవన్ హత్యను తప్పించుకోవడం. రెండు, ఆమె బ్లాక్ మెయిల్ నుంచి విముక్తి పొందడం.

"ఆ చాటుమనిషి పురుషుడు కావచ్చన్న అనుమానం ఇప్పుడు తీరింది. చంచల హత్యలో స్త్రీ పాత్ర జీవన్ హత్యను కూడా ఆమె మీద రుజువు చేస్తుంది. అటు జీవన్ తో, ఇటు చంచలతో విసిగిన ఒక స్త్రీ ఈ హత్యలకు పూనుకుంది.

"అయితే చంచలను చంపి, ఆమె అంత వేగంగా ఎలా మాయమైందో అర్థంగావడంలేదు. ఆధారాల్ని బట్టి ఆమె పదకొండున్నరకు వెనుక దారిగుండా వెళ్తూ కన్పించింది. మనం పదకొండూనలభైకి అక్కడ చేరుకున్నాం— ఈ పదినిమిషాల వ్యవధిలో ఆమె షాటోలు గాలించి

ఎలా స్వాధీనం చేసుకుంది? అందుకు కొంత సమయం పడుతుంది. ఆ సమయాన్ని ఆమె నిర్దిష్టంగా వూహించడం కష్టం. ఆమె ఫోను పెట్టేసిన కొన్ని నిమిషాల్లో అక్కడికి మనం చేరుకుంటాం. ఆ భయంతో, కంగారుతో ఆమె ఫోటోలు గాలించడం దుస్సాధ్యం.

"కాబట్టి ఆ ఫోటో లెక్కడ వున్నాయో ఆమెకి ముందే తెలిసివుండాలి. ఆమె అన్నీ ఆరాతీసి రంగంలో దిగివుండాలి. అలాటి పక్షంలో అనుకున్నది క్షణాల్లో చేసేసి పారిపోగలదు!"

"అలాగాక ఇలా కూడ జరగవచ్చు," అన్నాడు జాన్.

"వెల్, ఎలా?"

"చంచలను చంపి ఆమె ఫోటోలతో పారిపోయి వుండదు. అవి ఎక్కడున్నాయో ఆమెకు తెలియదు. చంచల బ్లాక్ మెయిలరని పోలీసులు వూహించరు గనుక, వాళ్ళు గాలించే ప్రయత్నం చెయ్యరన్న నమ్మకం ఆమె కుండవచ్చు. అందువల్ల ఆ ధీమాతో రాత్రి పారిపోయి, మర్నాడు ఎప్పుడో వీలుచిక్కినప్పుడు వచ్చి గాలించి వుండవచ్చు.

చంచలకు బ్లాక్ మెయిలింగ్ లో సహాయపడే మున్నా పోలీసులకి లొంగిపోయినప్పుడుగానీ, ఆమె హత్యలో బ్లాక్ మెయిలింగ్ ఆంగిల్ మనకు నిర్ధారణ కాలేదు. అప్పటికి ఆ ఫోటోలు మాయమయ్యాయి. వాటికోసం ఎక్కడ వెతకాలో ఆమెకు తెలుసు—సినీ నటుల సంపద అంతా బాత్ రూమ్స్ లోనే ముఖ్యంగా వుంటుందన్న నానుడి వుండనే వుంది—"

లాల్ తలూపాడు. "కానీ బాత్ రూంలో పరాయి

వేలిముద్రలేవీ లేవు! ఆమె తెలివిగలది. చంచల బాడీ గార్డు మున్నా కథనం ప్రకారం చంచల దగ్గర చాలా వ్యక్తులకు చెందిన ఫోటోలుండాలి. మరి ఈ హంతకి తనవేగాక, అన్నిటినీ మాయంచెయ్యడంలో ఉద్దేశం ఏమిటి?"

"సింపుల్. మన బ్లాక్ మెయిల్ యాంగిల్ నిరాధారం కావడానికి. చంచల జీవన్ ని చంపి, తద్వారా ఆత్మహత్య చేసుకుందని మనం నమ్మటం ఆమెకు చాలా ముఖ్యం."

"అంటే హంతకి ఎవరు? ప్రభావతి కావచ్చా?"

లాల్ నవ్వాడు: "కాకూడదా? చంచల ఆమెని బ్లాక్ మెయిల్ చేస్తోందని (ఏదో రూపంలో) మనకు ముందే తెలుసు. మున్నా కూడా చెప్పాడు. జీవన్ తో జీవితం సాఫీగా సాగడానికి చంచలకోసం అతను ప్రభావతి ప్రేమకలాపాల్ని ఫ్లాష్! ఫ్లాష్! చిక్కారు దొంగలు—అని కెమెరాలో దాచేసుకున్నాడు. పాపం, పిల్లలకోసం ప్రభావతి పాట్లు ఫలించలేదు!"

జాన్ నిట్టూర్చాడు: "అంతా సర్కమ్ స్టెన్షియల్. ఫిజికల్ ఎవిడెన్స్ లేదు. ఆమె చాలా తెలివిగా ప్రవర్తిస్తోంది, లాల్. ఫోన్ లో ఆమె కంఠంగనుక పసిగట్టి వుంటేనా! ప్చ్, ఆమెని పట్టుకొని అరెస్ట్ చెయ్యడానికి రుజువులూ, ఆధారాలూ ఏవీలేవు. ఆమెని మరో విధంగా ట్రాప్ చెయ్యాలి. కానీ ఎలా చెయ్యగలమో తెలియడంలేదు!"

"వెల్, మనం ఇప్పుడేం చేస్తున్నాం? ఉషారాణి వ్యవహారం ఎంతవరకొచ్చింది? ఆమెని ఇంకా ఎందుకు పట్టుకోలేక పోతున్నాం!"

"చంచల హత్యలో బ్రెయిన్స్ బిజీగా...."

"పార్టనర్! ఇప్పుడు తట్టింది!"

"ఏమిటి? నీ బ్లడీ బ్రెయిన్ ఏమి కనిపెట్టింది?"

"ఏం కనిపెట్టాలి? సిగ్గుపడాలి జాన్, చాలా సిగ్గుపడాలి! చందమామ కోసం చకోరపక్షుల్లా ఊషారాణి రాక కోసం ఇలా ఎదురుచూస్తూ కూర్చోకుండా, ఆమె ఫ్లాట్‌ని సోదాచేసి ముందుకు సాగాలన్న ఆలోచన ఎందుకు రాలేదూ అంటాను!"

జాన్ తలవంచుకున్నాడు.

"నేను నిజంగా సిగ్గుపడుతున్నాను లాల్, నువ్వెళ్లు."

## 7

లాల్ బాలానగర్‌లో ఆరంతస్తుల వనరాజ్ ఫ్లాట్స్ ముందు కారు దిగి, మఫ్టీలో వున్న కానిస్టేబిల్‌ని సైగచేసి పిల్చాడు.

"అలసిపోయినట్టున్నావు. ఏమాలోచిస్తున్నావ్?"

"టైం వేస్టుచేస్తున్నాం సర్, ఆమె ఇక రాదు!"

"కనీసం నువ్వు రాదనుకుంటావు. నీ సూపర్స్ అదీ అనుకోవడంలేదు. నాతోరా, ఆమె ఫ్లాట్ సోదా చేద్దాం."

ఇద్దరూ లోనికెళ్ళి కౌంటర్ దగ్గర ఆగారు. క్లర్క్ లాల్‌ని గుర్తుపట్టి, "మళ్ళీ వచ్చారా? ఆమె దొరకలేదా?" అన్నాడు.

"ఆమె ఫ్లాట్ సోదా జరపాలి."

"కానీ దానికి తాళం వుంది...."

"పాస్ కీ నీ దగ్గర వుంటుంది చూడు—"

"కానీ రూల్స్ ఒప్పుకోవనుకుంటాను...."

"నువ్వనుకునేదానికీ, మేం అనుకునేదానికీ చాలా

తేడా వుంది. ఆమె ఫ్లాట్ వదిలి పారిపోయి తాను దోషినని నిరూపించుకుంటోంది—స్టుపిడ్ బర్డ్!"

క్లర్క్ అయిష్టంగా తాళంచెవి అందించాడు.

లాల్ కానిస్టేబిల్‌తో రెండో అంతస్తులో చేరుకొని, ఉషారాణి ఫ్లాట్‌లో ప్రవేశించాడు. రెండు గదుల ఫ్లాట్. కిచన్, బాత్‌రూం వున్నాయి. ముందుగది పుస్తకాలతో, పత్రికలతో చిందరవందరగా వుంది.... వెనుక గది బెడ్‌రూం. అక్కడ కూడా లేనిదంటూ లేకుండా అన్ని సినీ వార, మాసపత్రికలూ చెల్లాచెదురుగా పడివున్నాయి.

సినిమా పిచ్చి అనుకుంటాను, సర్.

సినిమా పక్షి, అన్నాడు లాల్, ఆమె ఫోటో ఒకటి గాలిస్తే పట్టుకోడం తేలిక!

ఇద్దరూ చెరోగది వెతకసాగారు. లాల్ బెడ్‌రూంలో టేబిల్ సొరుగులు లాగి చూడసాగాడు. వాటినిండా అలంకరణ సామగ్రి తప్ప ఏమీ లేదు. గోడలో బిగించి వున్న అలమైరాలో బట్టలున్నాయి. ఆమె సూట్‌కేసు బెడ్ క్రింద వుంది. పేస్టు, బ్రష్ వగైరా బాత్‌రూంలోనే వున్నాయి. అంటే ఆమె ఉన్నపళంగా పారిపోయింది.

ఇంతలో కానిస్టేబిల్ పిల్చాడు. లాల్ వేగంగా వెళ్ళాడు. అతనొక ఫోటో చూపిస్తూ, "ఇది చూడండి!" అన్నాడు. లాల్ అందుకొని చూశాడు. అతనెవరో గుర్తించడానికి కొన్ని క్షణాలు పట్టింది. అతని కళ్ళు ఉలికిపడి, ముఖం కోపంతో ఎర్రబడింది. ఫోటో తిప్పి చూశాడు. దానిమీద: 'నా హృదయ సామ్రాజ్య రాణి-ఉషారాణికి—రవికాంత్' అని వుంది.

"కమాన్! త్వరగా వెళ్ళాలి!" లాల్ అర్చి బయటికి

దాచేశాడు.

కొన్ని నిమిషాల్లో ఇద్దరూ కార్లో వేగంగా హోటల్ మయూర్ చేరుకున్నారు. అక్కడ రిసెప్షన్‌లో ఫోటోలోలా అచ్చుగుద్దినట్టున్న యువకుడు అదిరిపడి చూశాడు.

లాల్ అతన్ని నవ్వుతూ చూసి, "మిస్టర్ రవికాంత్?" అన్నాడు.

అతరు కంగారుగా తలూపాడు.

"గుడ్, నిన్ను అరెస్టు చెయ్యడానికొచ్చాం."

"నన్నా! ఎందుకు?"

"నువ్వబద్ధం చెప్పావు."

"ఎప్పుడు?"

"మొన్న రాత్రి.... మేమో యువతి గురించి ఇక్కడికొచ్చాం. గుర్తుందా? ఆమె ఈ హోటల్ ముందు అదృశ్యమైంది. నువ్వు లోపలికి రాలేదన్నావు. కానీ వచ్చింది. వచ్చి నీ సహాయం కోరింది. నువ్వామెని ప్రేమిస్తున్నావు. వెంటనే ఆమెని ఎక్కడో దాచేశావు."

"లేదు, లేదు! నాకేమీ తెలియదు!"

"మరి ఈ ఫోటో ఆమె ఫ్లాట్‌లో కెలా వచ్చిందంటావ్? యూ డామ్ సిల్లీ ఫూల్! ఈ మర్డర్స్‌లో నువ్వు అక్సరీవి!"

"ఆమె—ఆమె ఇక్కడ లేదు—"

"ఎక్కడుందో చెప్పి పుణ్యంకట్టుకో!"

కొన్ని క్షణాల తర్వాత లాల్ రిసీవర్ ఎత్తి ఆఫీసుకి డయల్ చేశాడు: "హలో, జాన్! ఉషారాణి జాడ దొరికింది."

"ఎక్కడ?"

"బ్లూసీ పిక్నిక్ కాటేజిలో వుంది. నేనక్కడికి వెళ్తున్నాను. ఆమెని కల్సుకున్నాక మళ్ళీ ఫోన్ చేస్తాను."

మరికొన్ని నిమిషాల తర్వాత కారు ఉస్మాన్ సాగర్ వైపు ప్రయాణించసాగింది. చీకట్లు కమ్ముకుంటున్నాయి. తారలు పొడుచుకొస్తున్నాయి. లాల్ సిగరెట్ తాగుతూ తీవ్రమైన ఆలోచనలతో డ్రైవ్ చేస్తున్నాడు. వెనుక సీట్లో రవికాంత్ తో కానిస్టేబిల్ కూర్చున్నాడు.

ఉస్మాన్ సాగర్ మీద చల్లటి చిరుగాలులు శరీరాల్ని స్పృశించేసరికి బాగా చీకటిపడిపోయి, గులకరాళ్ళ కీచు శబ్దంతో పరిసరాలు ప్రతిధ్వనించసాగాయి.... చెరువు నిశ్శబ్దంగా, గంభీరంగా నిలకడగా వుండాలని విశ్వ ప్రయత్నం చేస్తోందిగానీ; దాని తుంటరి కెరటాలు కొన్ని వెక్కిరించి పారిపోతూ, ఒడ్డుని పలుకరిస్తూ, గుసగుస లాడుతున్నాయి: వాటి చపలత్వం వాటిది.

కానీ బ్లూసీ పిక్నిక్ కాటేజెస్ వాతావరణం ఇందుకు విభిన్నం: అదో ప్రపంచం. ప్రకృతి అందాల్ని అనుభవించాలనుకునే వారికిదొక కృత్రిమ స్థావరం. నాగరిక ప్రపంచపు ఉరుకు పరుగుల యాంత్రిక జీవితం ఇక్కడా ప్రత్యక్షం: అంతా కలుషితం.

లాల్ కారు దిగివెళ్ళి నాల్గవ నెంబర్ కాటేజి బెల్ నొక్కాడు.

"ఎవరూ?" విన్పించింది లోపలినుంచి అరుపు.

రవికాంత్ అన్నాడు: "తలుపు తెరువ్, ఉషా!"

మరుక్షణం తలుపు తెరిచి ఉషారాణి తొంగిచూసింది,

"రవి—నువ్విక్కడ—" ఆ తర్వాత నోరు తెరిచి పెట్టేసిందామె.

# 8

లాల్ నవ్వాడు: "వెల్, వెల్! చిట్టచివరికి దొరికావు!"

"ఎవరు మీరు? కౌన్ హైతుమ్?"

"డర్ నేకీ కోయీ బాత్ నహీం, తుమ్ బహుత్ బహాదూర్ హోనా!"

ఆమె ఉలికి పడింది, "ఏమిటేమిటీ! మీరు లాల్ కదూ? యూ ఆర్ మిస్టర్ లాల్! ఓహ్ రవీ వాట్స్ దిస్?"

"నీ కర్మ," రవికాంత్ చెప్పాడు.

లాల్ లోనికి నడిచి చైర్‌లో కూర్చున్నాడు. అందరూ అనుసరించారు. ఉషారాణీ కంగారుగా అయోమయంగా లాల్ ముందు కూలబడింది.

"వెల్, ఇప్పుడు చెప్పు!"

"వాడ్డూయూ మీన్? ఏం చెప్పాలి?"

"నువ్విక్కడ కెందుకొచ్చావు? ఏం చేస్తున్నావు? జీవన్, చంచల హత్యలతో నీ సంబంధం ఏమిటో అబద్ధాలు చెప్పకుండా ఆలాపించు బేబీ!"

"మీరు నన్నలా పిలవకూడదు!. ఐ హేట్ యూ!"

"నువ్వంటే నాకు గౌరవంలేదు. నువ్వు పెద్ద చదువులు చదువుతున్నదానివి. సభ్యతా సంస్కారం, మంచీ చెడు తెలిపినదానివి. అయినా అవన్నీ వదిలేసి సినిమా వ్యామోహంలో నేరాలకు పూనుకున్నావు—నిన్నిప్పుడెవరూ గౌరవించరు!"

"ఈ మర్డర్స్‌తో నాకే సంబంధంలేదు! నేను నిర్దోషిని."

"హత్యల విషయంలో నిర్దోషి కావచ్చు. కానీ

ధరమ్‌చంద్, మంగళ్ రామ్‌లను బఫూన్స్ చేసి కాలేవు!"

"అవును, నేను వాళ్ళని మోసం చేశాను. అందుకు భయపడి నేనిక్కడ దాక్కోలేదు. నా ప్రాణాలకు సేఫ్టీ కావాలి: వాటికి మోసం వుంది."

"ఎవరివల్ల?"

"రాజేశ్వరివల్ల."

"ఆమె ఎవరు?"

"ఆ నైట్ జీవన్‌తో పోట్లాడింది."

"నువ్వు జీవన్‌తో ఎందుకు పోట్లాడావు?"

ఆమె ముఖం ఎర్రబడింది: "అతను నన్ను డిసీవ్ చేశాడు! డర్టీ రోగ్! అతన్ని బిలీవ్ చెయ్యడం నా మిస్టేక్! నా తప్పు! నన్ను నాశనం చెయ్యడానికి ట్రై చేశాడు. దుర్మార్గుడు! నాకీ పిచ్చి ఎందుకుపట్టిందో తెలియదు. ఈ క్రేజీ చిన్నప్పటినుంచీ వుంది. ఆ రోజుల్లో జమున స్క్రీన్ మీద గోదారి గట్టుందీ—అని గంతులేసినప్పుడే స్టార్ట్ అయింది—సినిమాపిచ్చి. హీరోయిన్ కావాలన్న దుర్బుద్ధి!

"ఇదే నన్నిప్పుడీ స్టేజికి తెచ్చింది, మిస్టర్ లాల్. ఇన్నాళ్ళూ అణచిపెట్టుకున్న కోరికనూ, కన్న కలల్నీ తట్టుకోవడం ఇహ నావల్ల కాలేదు. ఏజ్ బార్ అవుతోంది. ఇప్పుడే త్వరపడకపోతే జీవితాంతం సఫర్ అవ్వాలి! లైఫ్‌లో నేను సాధించదల్చుకున్న లక్ష్యం ఒకటే: హీరోయిన్ కావడం."

లాల్ అన్నాడు: "లక్ష్యం మంచిదే; కానీ అదృష్టం అందరికీ వుండదు."

"అవును. నా అదృష్టం పరీక్షించుకోడానికే జీవన్‌ని మీట్ అయ్యాను—వన్ మన్త్ బ్యాక్. అతన్ని చాలా

నమ్మాను. అభిమానించాను. ట్వెంటీ యియర్స్ గా ఫీల్డులో వుంటున్నాడు. చాలా పేరు సంపాదించాడు. బ్యానర్ గొప్పది. హిట్ చిత్రాలు తీశాడు.

"కానీ ఈమధ్య రెండు పిక్చర్స్ ఫెయిల్ అయ్యాయి-ట్రెండ్ అలాటిది. ఈ మల్టీ స్టార్ మాడ్ నెస్ ఇంకె న్నాళ్ళో వుండదు. ఈ వాతావరణం ఇక్కడే కాదు, హాలీవుడ్ లోనూ వుంది. నల్గురు సూపర్ స్టార్స్ తో వైడ్ స్క్రీన్ తో తీసిన 'ఎ బ్రిడ్జ్ టూఫార్' లాటి మల్టీ మిలియన్ చిత్రాలు అట్టర్ ఫ్లాప్స్ అవుతుండగా, లవ్ స్టోరీ, ది గ్రాడ్యుయేట్ లాటి బడ్జెట్ చిత్రాలు సూపర్ హిట్స్ అవుతున్నాయి.

"నేను జీవన్ ని మీట్ అయినపుడు ఈ విషయాలన్నీ డిస్కస్ చెయ్యలేదు. నా ఆశయం చెప్పాను. అతని ప్రోత్సాహం కావాలన్నాను. చాలా ఫ్రాంక్ గా చెప్పాను సంగతి. నాకు పర్సనాలిటీ వుంది, గ్లామర్ వుంది, మంచి వాయిస్ వుంది. ఎలాటి ఎమోషన్స్ నయినా ప్రదర్శించగలను—ప్రయాసపడకుండా.

"నా టాలెంట్స్ ని అతను గుర్తించాడు. కానీ ఇమీడి యట్ గా ఒపీనియన్ చెప్పలేదు. వారం రోజులు పాస్ చేశాడు. నేను తిరుగుతూనే వున్నాను. అతనేదో ఆలో చనల్లో గడుపుతున్నాడు. చాలా వర్రీగా కన్పించ సాగాడు.

"ఒకరోజు అతని ఒపీనియన్ ఏమిటో నేనే కదిపాను. అప్పుడతను కొత్త హీరోయిన్ తో చిత్రం తీయాలంటే కొన్ని ప్రాబ్లమ్స్ వున్నాయన్నాడు. డేర్ చేస్తే అసలే దెబ్బతిని వున్నతను మళ్ళీ కోలుకోనంతగా సఫర్ అయే

డేంజర్ వుందన్నాను. నేను డిసపాయింటయ్యాను, మళ్ళీ వారం రోజులు అవునని గానీ, కాదనిగానీ చెప్పకుండా గడిపేశాక ఒక డెసిషన్కొచ్చి కండిషన్ పెట్టాడు."

"ఏమిటది?"

"నాలుగైదు స్టోరీస్ తన డైరెక్టర్ పరిశీలనలో వున్నాయనీ, ఏదో ఒకటి సెలక్టు చేశాక నన్ను పిల్చి స్క్రీన్ టెస్టు వగైరా తతంగమంతా ఫార్మల్గా జరిపించి అతన్ని ఒప్పిస్తానన్నాడు. అప్పుడీ కండిషన్ పెట్టి అందుకు ఒప్పుకుంటేనే మిగతావన్నీ జరుగుతాయన్నాడు.

"అందుకు నేనేమీ విధిలేక ఒప్పుకోలేదు. కావాలంటే అతనికి గుడ్ బై కొట్టవచ్చు. కానీ, నా వీక్ నెస్-నా కోరికల్ని జయించలేక పోయాను. ఈ ఛాన్స్ పోగొట్టుకుంటే జన్మలో రాదు! అందుకే ఒప్పుకున్నాను.

దొంగతనాలు చేశాను. జీవన్ నన్ను హిప్నటైజ్ చేశాడు—నా బలహీనతను కనిపెట్టి. ఆ దొంగతనాలు దేనికో చెప్పలేదు. వాటితో నాకేమీ సంబంధం లేదన్నాడు. ఇష్టంలేకపోతే తన్ని మర్చిపొమ్మన్నాడు. అంతే, మిస్టర్ లాల్. ఇంతకంటే మీకు ఎక్స్ప్లెయిన్ చెయ్యానవసరం లేదు. నా పరిస్థితి మీ కర్థమైంది."

"నువ్వు అబద్ధం చెప్తున్నావు. నీ సినిమా ప్రయత్నాలు బూటకం. జీవన్ కి మళ్ళీ చిత్రం తీసే ఆలోచనలేదని నీకు తెలుసు. మీరిద్దరూ ప్రేమించుకున్నారు. ఈ దొంగతనాలు చేసి డబ్బుతో సింగపూర్ పారిపోవాలనుకున్నారు."

"ఓహ్, నో! నాకదేమీ తెలియదు! నేను సినిమా ఛాన్స్కోసమే ప్రయత్నించాను! అతన్ని ప్రేమించలేదు.

మాట్లాడవేం, రవీ! నిన్ను మోసం చేస్తానా?"

"చెయ్యవు," రవికాంత్ వినయంగా ఒప్పుకున్నాడు.

"వెల్, ఈ రాజేశ్వరి గురించి చెప్పు. ఆమె ఏం చేసింది?"

"నన్ను చంపటానికి ట్రై చేసింది!" అంది ఉషారాణి, "ఆ రాత్రి నేను ధరమ్‌చంద్ బ్రీఫ్ కేసుతో జీవన్ చెప్పిన ప్రకారం అతని ఆఫీసు కెళ్ళాను. అప్పుడే పోర్టికోలో నేను మెట్లెక్కుతోంటే ఆమె ఎదురైంది. చాలా అప్‌సెట్ అయినట్టు కన్పించింది. ఏదో తిట్టుకుంటూ నాముందునుంచి స్పీడుగా గేటుకేసి వెళ్ళిపోయింది.

"నేను పైకివెళ్ళి జీవన్‌ని చూశాను. అతనూ కోపంగా, కసురుకుంటూ కన్పించాడు. ఏం జరిగిందని అడిగాను. ఆమె ఎవరని అడిగాను. అతను చెప్పలేదు. బాగా తాగి భయంకరంగా వున్నాడు. నేను గుచ్చి-గుచ్చి అడిగితే అప్పుడు చెప్పాడు—అప్పటివరకూ ఆమె ఎవరో నాకు తెలియదు. ఆమె పేరు రాజేశ్వరి. ఆమెని హీరోయిన్ చేస్తానని మాటిచ్చాడట. కానీ అది మర్చిపోయి నాతో ప్రయత్నాలు చెయ్యటం తెలిసి ఆమె ఎక్సైట్ అయిందట. బాగా తిట్టి మాట నిలబెట్టుకోకపోతే అంతుచూస్తానని వార్నింగ్ ఇచ్చి వెళ్ళిపోయిందట—"

"తర్వాత?"

"అంతే, అతనింకేమీ చెప్పలేదు. బ్రీఫ్ కేసు తెరిచి చూసుకున్నాడు. నన్ను మెచ్చుకొని, మరిద్దరి దగ్గర అలాంటివి తెస్తే నా రెస్పాన్సిబిలిటీ తీరుతుందన్నాడు. అంతవరకూ అలా బాగానే వున్నాడు. కానీ ఒక్కసారిగా వింతగా మారిపోయాడు. అతని నిషా చూపులు,

అవతారం భయం పుట్టించాయి.

"నామీద అసభ్య వర్ణన ప్రారంభించాడు. నన్ను పట్టుకొని అసహ్యంగా బిహేవ్ చేయసాగాడు. నేనాశ్చర్యపడ్డాను. అతనికి చాలా రెస్పెక్ట్ ఇచ్చాను. అభిమానించాను. అలా ప్రవర్తించడం సహించలేక పోయాను. అతని చేష్టలు మితిమీరాయి. పశువులా మారిపోయాడు! నేను ప్రమాదం గుర్తించాను. హి ట్రైడ్ టు మాలెస్టు మీ! డూయూ హియర్ మీ?

"అలాంటి పరిస్థితిలో ఆడది ఏంచేస్తుంది? సెల్ఫ్ డిఫెన్స్ కు పూనుకుంటుంది. పెనుగులాడాను, పాకిపోవడానికి ప్రయత్నించాను. చేతికి అందింది విసిరికొట్టాను. లాభంలేకపోయింది! అతను వొళ్ళు రక్కుతూ, బట్టలు చింపేస్తూ, బెడ్ మీద ఎత్తేసి అక్ర.... నేనతని ముఖం మీద తన్ని క్రిందికి జంప్ చేశాను. అప్పుడు గుర్తొచ్చింది—అతను టేబిల్ సొరుగులో పెట్టుకొనే రివాల్వర్. దాన్ని తీసి బెదిరించాను—"

"అప్పుడు?"

ఉషారాణి ఊపిరి పీల్చుకుంది: "అతను భయపడలేదు. పిచ్చి ఆవేశంతో నా మీద కొకి రివాల్వర్ పట్టుకున్నాడు. అప్పుడేం జరిగిందో నాకు తెలియదు. రివాల్వర్ పేలింది! నేను భయంతో అర్చి చెయ్యివదలమన్నాను. అతను మొండిగా ఇంకా మెలితిప్పసాగాడు. నేను రివాల్వర్ వదిలేయాలనుకున్నాను. కానీ అతనే ట్రిగ్గర్ మీద చెయ్యివేసి లాగేశాడు! అప్పుడూ గండం తప్పింది!

ఇంతలో బయట తలుపుచాటున ఏదో ఆకారం కన్పించింది. దాని చేతిలో రివాల్వర్ క్లియర్ గా చూశాను! నన్ను చూపి అది ట్రిగ్గర్ లాగింది! థాంక్

గాడ్ ఏం జరిగిందో అది ఫైర్ కాలేదు! నేను గభాల్న జీవన్ వెనక్కి చూశాను. అప్పుడే ఆ ఆకారం మరోసారి ట్రిగ్గర్ లాగింది—బుల్లెట్ దూసుకొచ్చి జీవన్ తల్లో దూరింది!"

లాల్ సిగరెట్ నలిపేసి సాలోచనగా తలూపాడు.

"అప్పుడేం జరిగింది?"

ఉషారాణి ఉద్రేకంగా అంది, "నేను భయంతో అటూ ఇటూ పరుగెత్తాను.... బ్యాగందుకొని ఠెండ్‌గా బయటికి పరుగుతీశాను! నడవలో వురికి మెట్లు దిగుతున్నప్పుడు నా వెనుక మళ్ళీ రివాల్వర్ పేలింది!

"నేను గట్టిగా అర్చి దొర్లుతూ పడిపోయాను. నడవలో అడుగులు విన్పించాయి. మెరుపులా లేచి శక్తి కొద్దీ బయటికురికాను. రోడ్డు చేరుకుని వేగంగా పరిగెత్తాను! అప్పుడు నా పరిస్థితి—భయం మీకు వర్ణించలేను! నేనే స్థితిలో రవికాంత్ దగ్గరికి చేరానో నాకే తెలియదు. తలచుకుంటే గుండె జలదరిస్తుంది.... దట్సాల్, మిస్టర్ లాల్. ఇంతకంటే నాకేమీ తెలియదు. నేనెవర్నీ ఖూనీ చెయ్యలేదు!"

"చేశావు."

"ఎవర్ని?"

"భాషని—నీ మాతృ భాషను."

"మిస్టర్ లాల్ మీరు మాటర్స్‌ని సీరియస్‌గా ఎందుకు తీసుకోరు?"

"నేను జీవితాన్నే సీరియస్‌గా తీసుకోను. ఆ ఆకారాన్ని నువ్వు స్పష్టంగా చూశావా?"

"లేదు, నడవలో చీకటిగా వుంది. అందుకే నాకు చావు తప్పింది! కానీ ఆమె ఎవరో వూహించగలను:

రాజేశ్వరి! ఆమె నన్ను చంపటానికి ట్రై చేసింది. రివాల్వర్ ముందు నామీదకే గురిపెట్టి షూట్ చేసింది. కానీ ఎందుకో ఫైర్ కాలేదు. అంతలో నేను వెనక్కి జంప్ చేయ్యడం, ఆమె మళ్ళీ షూట్ చెయ్యడం, బుల్లెట్ జీవన్‌ని తాకడం—మిస్టేక్! అంతా మిస్టేక్!"

లాల్ ఆలోచనల్లో పడ్డాడు.

ఆమె మళ్ళీ అంది: "నేను లోనికెళ్ళాక రాజేశ్వరి ఆ ప్రాంతాలే వుంది. జీవన్‌తో నా ఘర్షణ గమనించి, తన కూతురికి అడ్డుగా వున్న నన్ను ఫినిష్ చెయ్యాలనుకుంది. కాని పొరపాటున జీవన్‌ని చంపేసింది! ఇప్పుడామె నన్ను గాలిస్తుంటుంది!....ఆమె జీవన్‌ని చంపగా నేను చూశాను."

"నువ్వు స్పష్టంగా చూడలేదన్నావు."

"లేదు, కాని వూహించలేరా? ఆమె ఆ బంగళా లోనే దాచుకుంది—"

"ఆధారంలేదు. ఆమె వెళ్ళిపోయివుండొచ్చు. ఆమె అక్కడే వుందని రుజువు లేకపోతే ఏమీ చెయ్యలేం."

"ఎలా రుజువుచేస్తారు? సరే, ఆమెని పట్టుకోవడం మీ వంతు. నన్నిప్పుడేం చేస్తారు?"

"కమీషనర్ కప్పగిస్తాను. ఆయనీ కేసుని ప్రత్యేక శ్రద్ధతో పర్యవేక్షిస్తున్నారు."

"అంతేనా?"

"అంతే," అన్నాడు లాల్, మరో సిగరెట్ వెలిగిస్తూ. "అప్పగింతలంటే నాకిష్టం."

హఠాత్తుగా ఫోను మ్రోగింది.

అందరూ ఉలికిపడ్డారు. రవికాంత్ ఫోన్ అందుకో బోయాడు. లాల్ వారించాడు. లేచివెళ్ళి రిసీవర్ ఎత్తి

కళ్ళు చిట్లిస్తూ చెవిదగ్గర పెట్టుకున్నాడు.

"హలో, లాల్?" జాన్ గొంతు విన్పించింది, కంగారుగా.

"యస్, ఏమిటి జాన్?"

"ఆమె వచ్చేస్తోంది!"

లాల్ ముఖం చిట్లించాడు: "ఆమెకెలా తెలుసు?"

"తర్వాత చెప్తాను. ఆమె లోనికి జొరబడి షూట్ చెయ్యకుండా జాగ్రత్తపడు—చాలా దగ్గర్లో వుంది!"

లాల్ రిసీవర్ పెట్టేసి వెనక్కి తిరిగాడు.

"మీరంతా ఇక్కడే ఉండండి! ఎవరూ కదల కూడదు, బయటికి రాకూడదు!" అని హెచ్చరించి వేగంగా బయటికెళ్ళాడు.

## 9

కారెక్కి స్టార్ట్ చేసి నూకించాడు లాల్. వేగంగా డ్రైవ్ చేసి, ప్రైవేట్ రోడ్డు దాటేసి, మెయిన్ రోడ్డు చేరుకొని మలుపు తిప్పుతుండగా; దూరంగా హెడ్ లైట్స్ కన్పించాయి.

లాల్ ఇంకా వేగం పెంచి వందగజాలు వెళ్ళాక, హెడ్ లైట్స్ పూర్తిగా దగ్గరై కారు కన్పించింది: అంబాసిడర్. డ్రైవింగ్ సీట్లో ఒక స్త్రీ వుంది. ఆమె హారన్ కొడుతూ తోవ అడుగుతూ డిప్పర్ వెలిగించ సాగింది. ట్రాఫికేటర్ ఎడమవైపు మలుపుని సూచిస్తోంది.

కాని లాల్ ఆమెకు తోవ ఇవ్వకుండా అలాగే వెళ్ళే సరికి, ఆమే రోడ్డు క్రిందికి దూసుకెళ్ళబోయింది. వెంటనే లాల్ కుడివైపు తిప్పి ఆమెకడ్డుగా వెళ్ళాడు. రెండూ ఢీకొన్నాయి. ఫెండర్లు ఖంగుమన్నాయి. బాయ్‌నెట్స్

రాసుకుంటూ కీచు మన్నాయి. రెండు కార్లూ ఆగి పోయాయి.

లాల్ హెడ్ లైట్స్ ఆర్పేసి దిగాడు. ఆమె కూడా దిగింది. కానీ లైట్లు ఆఫ్ చెయ్యలేదు. ఆమె లాల్ ని చూసి పళ్ళు నూరుతూ, కళ్లలో నిప్పులు కురి పిస్తూ, వణుకుతూ నిలబడింది.

లాల్ నవ్వాడు.

"ఆహ్, కమాన్! చాలా మంచిపని! నిన్నెలా పట్టు కోవాలో తోచక తల బద్దలు చేసుకుంటున్నాం. ఇప్పుడు నీకై నువ్వే ఇలా బయటపడి మా శ్రమ పూర్తిగా తగ్గించావు! వెరీగుడ్. నువ్వన్నమాట పిచ్చెక్కిన హంతకివి?"

ఆమె పిడికిళ్ళు బిగుసుకున్నాయి.

"ఏమిటి వాగుతున్నావు, నా కారు డ్యామేజి చేసీ!" అర్చిచిందామె.

"నువ్వు మరొకర్ని చంపటంకంటేనా, నీ కారు గురించి బెంగ?"

"నోర్మూయ్. నువ్విక్కడెందుకొచ్చావ్?"

లాల్ మళ్ళీ నవ్వాడు, "నా రాక నీకెంత ఆశ్చ ర్యంగావుందో, నీ రాక నాకూ అంతే వుంది. నువ్వింత వరకు చాలా జాగ్రత్తగా మసలుకున్నావు. కానీ దుర దృష్టంకొద్దీ ఇలా పట్టుబడ్డావు. బుకాయించకు! నువ్విక్కడ విశ్రాంతికోసం వచ్చావంటే నమ్మను. నువ్వు ఉషారాణి కోసం వచ్చావు. ఆమెని చంపడం నీకత్య వసరం! నువ్వు జీవన్ ని చంపినపుడు ఆమె చూసిందన్న అపోహతో—భయంతో ఈ పనికి పూనుకున్నావు."

"నీ పిచ్చి వాగుడు కట్టిపెడ్తావా, లేదా?"

లాల్ బిగ్గరగా నవ్వాడు, "పిచ్చివాగుడా? సరే, పిచ్చిచేష్టల్ని ఆట కట్టించడానికి నేనెలా వాగినా లక్ష్య పెట్టను. విను! నువ్వు జీవన్‌ని చంపావు, చంచలనీ చంపావు, ఇప్పుడు ఉషారాణి కోసం వచ్చావు.

"జీవన్ దొంగతనంగా డబ్బు కూడబెట్టుకొని ఉషా రాణితో పారిపోతున్నాడని అనుమానించావు. అతను నిన్ను మోసం చేస్తున్నాడనుకున్నావు. అతనిమీద కసితో, ఆమెమీద అసూయతో వాళ్ళ వ్యవహారం తేల్చాలనుకున్నావు, ఇద్దరు ఆడవాళ్ళ మధ్య అసూయ ప్రాణాలమీదకి తెస్తుంది. నువ్వు ఉషారాణిని చంపేసి, ఆ హత్యలో జీవన్‌ని ఇరికించి, దేశం విడిచి వెళ్ళి పోకుండా బుద్ధి చెప్పాలనుకున్నావు.

"అందుకే ఆ రాత్రి వాళ్ళిద్దరి మధ్య ఘర్షణ జరుగు తున్నప్పుడు రివాల్వర్ తీసి షూట్ చేయబోయావు. కాని అది జరుగలేదు. నీ రివాల్వర్ కండిషన్‌లో లేదు. అది పేలలేదు. నువ్వు మరోసారి షూట్ చేయబోయేంతలో ఆమె జీవన్ వెనక్కి దూకేసింది....నువ్వు నాలిక కరచు కునేంతలో బుల్లెట్స్ జీవన్ తల్లో దూరాయి!"

ఆమె రాతి విగ్రహంలా నిలబడివుంది.

"జరిగిన పొరపాటుకి నువ్వు షాక్ తిన్నావు. నువ్వు తేరుకునేంతలో ఉషారాణి బయటకురికింది. నువ్వు మళ్ళీ షూట్ చేశావు. కానీ చీకట్లో గురి తప్పింది. ఆమె తప్పించుకు పారిపోయింది. నువ్వెంటనే గదిలో జీవన్ బ్రీఫ్‌కేస్తో, రివాల్వర్‌తో పారిపోయావు.

"కానీ నీకు ఉషారాణి గురించి భయంగా వుంది.

ఆమె పోలీసుల దగ్గరకెళ్ళి నీ గురించి చెప్పెయ్యవచ్చు. పట్టుబడతావు. కాబట్టి ఆ ప్రమాదం తప్పించాలి. అప్పుడు నీకు మెరుపులాటి ఆలోచన వచ్చింది.

"చంచల నిన్ను బ్లాక్ మెయిల్ చేస్తోంది. ఆమె మార్గానికి అడ్డురాకుండా నిన్ను అప్రతిష్టపాలు చేసే ఫోటోలు అట్టిపెట్టుకుంది. నువ్వేకాదు, చాలామంది ఆమె మార్గంలో అడ్డువెళ్ళి విచారించారు....

"అందువల్ల నీకామెపైన చాలా కసివుంది. ఆమె పీడ తొలగించాలనుకుంటున్నావు. ఇప్పుడు జీవన్ హత్యను తప్పించుకోవాలంటే, చంచల బ్లాక్ మెయిల్ నుంచి బయటపడాలంటే, నీ కొకటే మార్గం కన్పించింది.... జీవన్ని తాను చంపినట్టు చంచల ఒప్పుకునేలా చేసి, ఆమెని చంపేయడం.

"ఈ ఆలోచనతో నువ్వు మర్నాడు రాత్రి ఆమె ఇంటికెళ్ళి ఫోన్ దగ్గరికి తీసుకొచ్చి షూట్ చేసి చేతిలో రివాల్వర్ పెట్టావు. ఆ బ్రీఫ్ కేసుని బెడ్ రూంలో వుంచావు. తర్వాత నీ ఫోటోల కోసం గాలించావు. ఎంతో ఓపిగ్గా నింపాదిగా గాలించి, బాత్ రూం గోడలో వాటిని కనుక్కున్నావు. 'అప్పుడు' చంచల కంఠంతో నాకు ఫోన్ చేసి పారిపోయావు!"

ఆమె గాభరాగా అటూ ఇటూ చూసింది.

"చాలా అద్భుతంగా ఆలోచించావు! చంచల జీవన్ని చంపిన పశ్చాత్తాపంతో ఆత్మహత్య చేసుకుంది. నువ్వు జీవన్ హత్యనుంచి బయటపడ్డావు. చాలా బాగుంది. అప్పుడు ఉషారాణివల్ల నీకే ప్రమాదమూ వుండదు.

"కానీ, నీ అంచనా తారుమారైంది. చంచల ఆత్మ

హత్య చేసుకోలేదని పత్రికల్లో వెల్లడైంది. దాంతో నీ కదురు పుట్టింది—ఇప్పుడు ఉషారాణి పోలీసులకి చిక్కితే నువ్వు తప్పించుకోలేననుకున్నావు. ఆమె కోసం గాలింపు ప్రారంభించావు — చివరికి ఇక్కడ వుందని తెలుసుకున్నావు. నువ్వు అసాధ్యురాలివి! ఎలా తెలుసుకున్నావు? మమ్మల్ని అనుసరించావా?"

ఆమె ఉద్రేకంగా కాలితో కారుని తన్ని అర్చింది.

"రాస్కెల్! రోగ్! నన్ను మోసం చేశాడు! ఎవరో అనామకుడు నాకు ఫోన్ చేసి ఉషారాణి ఇక్కడవుందని పోలీసులా మెని గాలిస్తున్నారని, కానీ కొన్ని ఇబ్బందుల వల్ల తను పోలీసులకి చెప్పడం లేదనీ; అతనికి థాంక్స్ చెప్పి వెర్రిదానిలా బయలుదేరి వచ్చేశాను! కానీ ఇప్పుడర్థమవుతోంది! అలా ఎవరు చేస్తారు? ఎవరూ చెయ్యరు. నీ పార్టనర్ నన్ను మోసగించి ఇక్కడికి రప్పించాడు! అతన్ని నిలువునా చీరేస్తాను!"

లాల్ రాయిలా వుండిపోయాడు కొన్ని క్షణాలు.

"దట్ డర్టీ పార్టనర్!" అర్చాడతను ఉద్వేగంగా; అతని కళ్ళు చెమర్చాయి. "నువ్వు రెడ్ హాండెడ్‌గా పట్టుబడాలని సమయస్ఫూర్తిగా ఇలా నా చేతుల్లోకి పంపాడన్నమాట. జాన్ నా పార్టనర్ అయినందుకు ఎంత గర్విస్తానో నీకేం తెలుసు!"

ఆమె హఠాత్తుగా కారు డోర్ తెరిచి, బ్యాగులోంచి రివాల్వర్ తీసింది. దానితో గిరుక్కున తిరిగి లాల్ వైపు గుడ్డిగా కాల్చబోయింది.

కానీ అదే క్షణంలో జాన్ కారు వెనుక నుంచి మెరుపులా వచ్చి, బూటుకాలితో ఆమె చేతిలో

రివాల్వర్ ఎగరగొట్టాడు.

"నో మోర్ కిల్లింగ్ ప్రభావతీ! నో మోర్ డ్రామా! కట్టుకున్న భర్తని, చంచలని హత్య చేసినందుకు నీకు ఉరిశిక్ష తప్పదు!" అన్నాడు లాల్ క్రిందపడ్డ రివాల్వర్ అందుకుంటూ.

ప్రభావతి చేతులు ఖాళీ! ఆమె ఇప్పుడు శాశ్వత బందీ!

—: ఐపోయింది :—

# సంసారంలో సరిగమలు!

## వసుంధర

"ఏమిటండీ అలా ఉన్నారు?" అంది శాంతాదేవి.

గోవిందరావు బదులివ్వకుండా భార్యకు ఓ కాగితం అందించాడు.

"డియర్ గోవిందరావ్—ఎంతో సంతోషంగా ఉన్నావు కదూ—నువ్వు జీవితాంతం అవమానపడే సంఘటన అతికొద్ది రోజుల్లోనే జరుగనున్నది. సిద్ధపడు!"

శాంతాదేవి ఆ కాగితం చదివి-"ఏమిటండీ ఇది? ఎవరు వ్రాశారు?" అనడిగింది.

"పోస్టులో వచ్చింది. ఈ హెచ్చరిక ఎవరు ఎందుకు పంపారో నాకు తెలియడంలేదు. నా మనసు కీడును శంకిస్తోంది—" అన్నాడు గోవిందరావు.

గోవిందరావు ఆ ఊళ్లో అప్పుడప్పుడే గుర్తింపు తెచ్చుకుంటున్న పెద్దమనిషి. అతడికి ఊళ్ళో ఓ పుస్తకాల షాపు, కూళ్ళ ఫారం ఉన్నాయి. స్వగ్రామంలో పదెకరాల భూమీ, ఓ చిన్న డైరీఫారం ఉన్నాయి. భార్యాభర్త

లిద్దరి పేరునా డిపాజిట్లు మూడు లక్షలకు దాటాయి. ఇంకా కొత్త వ్యాపారాల్లో అడుగు పెట్టాలని ఆయన అనుకుంటున్నాడు.

గోవిందరావుకు పెళ్ళై ఆరేళ్ళు దాటింది. ఇద్దరమ్మాయిలు. రెండోసారి కాన్పు కష్టమైతే భార్యకు ఆపరేషన్ చేసేశారు. అందువల్ల మరిపిల్లలు పుట్టే అవకాశంలేదు. తన పిల్లలంటే గోవిందరావుకు ప్రాణం. అతగాడి వయస్సు ముప్పై దాటింది. శాంతాదేవి వయసు పాతిక్కి మించలేదు. పెద్దకూతురు నాలుగేళ్ళది. రెండో కూతురు రెండేళ్ళది.

వాళ్ళింట్లో సామాన్యుడు కలగనే వస్తువులన్నీ ఉన్నాయి.

నిజానికి మహారాజులకంటే, అష్టయిశ్వర్యవంతులకంటె గోవిందరావువంటివాళ్ళే అదృష్టవంతులు. అతడు భాగ్యవంతుల్లో సామాన్యుడు. అందువల్ల సామాన్యుల్లో భాగ్యవంతుడిగా బ్రతకగల్గుతున్నాడు. అతడి చుట్టుప్రక్కల ఉన్నవారందరికీ అతడొక మహాదృష్టవంతుడిలా కనబడతాడు. చాలామంది అతడి ఇంటికి వచ్చివెళ్ళే అవకాశముంది. ఆ విధంగా అతడి సంపదలను సామాన్యులు చూసే అవకాశముంది. మరీ గొప్పవాళ్ళ ఇంటికి సామాన్యులు వెళ్ళిచూసే అవకాశముండదు కదా?

ఆ అదృష్టవంతుడు గోవిందరావు కిప్పుడిలాంటి ఉత్తరం వచ్చింది.

"ఏ దరిద్రపు వెధవకి కన్నుకుట్టిందో ఏమో—" అంది శాంతాదేవి బాధగా.

"రాసిందెవరో తెలిస్తే ఏ బాధాలేదు. కానీ ఎలా తెలుసుకునేది?" అన్నాడు గోవిందరావు.

"ఎవరైనా డిటెక్టివ్‌ను కలుసుకుంటే?" అంది శాంతాదేవి.

"డిటెక్టివ్ దగ్గరకు వెళ్ళామనుకో—ఆయన చాలా ప్రశ్నలడుగుతాడు. మనతో విరోధం ఉండే అవకాశం ఎవరెవరికుందో చెప్పమంటాడు. ఆ విషయం తెలిస్తే మనమే అన్నీ ఊహించుకోవచ్చు. ఆ డిటెక్టివ్ కాస్త చేతకాని వాడయ్యాడంటే—అనవసరంగా ఏ కావలసిన వాడి దగ్గరో మాటజారి అయినవాళ్ళతో చెడిపోయేలాకూడా చేయొచ్చు—" అన్నాడు గోవిందరావు.

"అయితే ఏం చేస్తారు?"

"ప్రస్తుతానికి ఎవరో సరదాకి రాశారని సరిపెట్టుకుందాం. అంతకంటే ఏం చేయగలం?" అన్నాడు గోవిందరావు నిట్టూర్చుతూ.

## 2

"రేపే ఉమ పుట్టిన రోజండీ—" అంది శాంతాదేవి.

ఉమ గోవిందరావు పెద్దకూతురు. రెండోదాని పేరు రమ.

"అవును. అందుకు ఏర్పాట్లన్నీ జరుగుతున్నాయికదా!" అన్నాడు గోవిందరావు.

"దానికి నాలుగునిండి అయిదోస్తున్నాయి. అందుకని ఈసారి ఎక్కువమందిని పిలుద్దామని అనుకొంటున్నాను" అంది శాంతాదేవి.

"శాంతా—నువ్వు కావడానికి నా అర్ధాంగివే కాని నీకు నాపై సంపూర్ణాధికారాలున్నాయి. నువ్వేమంటే కాదన్నాను....?" అన్నాడు గోవిందరావు:

"మీరు భర్తగా లభించడం నా అదృష్టం. మన ఈ అదృష్టం కలకాలం ఇలాగే ఉండాలన్నది నా కోరిక"

అంది శాంతాదేవి భర్త జుట్టులోనికి వేళ్ళు పోనిస్తూ.

"పిల్లలు నిద్రపోయారా?" అన్నాడు గోవిందరావు.

"ఇంకా ఇంత సేపా? ఎనిమిదిదాటేక ఒక్క క్షణం కూడా మెలకువగా ఉండలేరు వాళ్ళు...."

గోవిందరావు వాచ్ చూసుకుని ఆవలించి— "తొమ్మిదిన్నరయింది—" అన్నాడు.

"ఏం మీకూ నిద్రవస్తోందా?" అంది శాంతాదేవి నవ్వుతూ.

"నిద్రరావడంలేదు కానీ పడుకోవాలని ఉంది—" అన్నాడు గోవిందరావు.

శాంతాదేవి బుగ్గలు ఎర్రబడ్డాయి— "మీకు ఇంకా చిన్నతనం పోలేదు—" అంది.

"నీకు ముసలాడిలా కనబడుతున్నానేమోకానీ నే నింకా చిన్నవాణ్ణేమరి!" అన్నాడు గోవిందరావు నవ్వుతూ. ఆ మాటలకు శాంతాదేవి బుగ్గలఎరుపు ఇంకా ఎక్కువైంది.

అంతలో ఎవరో తలుపు తట్టిన చప్పుడైంది.

"ఎవరో తలుపు తడుతున్నారండీ!" అంది శాంతాదేవి.

"ఈ సమయంలో నిన్ను వదిలి వెళ్ళి తలుపు తీయ లేను...." అన్నాడు గోవిందరావు.

"పోనీ నేను వెళ్ళి తలుపు తీస్తాను...." అంది శాంతాదేవి.

"అప్పుడు మాత్రం నిన్ను వదిలి ఉండగలనా? అయినా బుద్ధిలేనివెధవలు ఇంతరాత్రివేళ యువక దంపతుల ఇంటి తలుపు తడతారా?" అన్నాడు గోవింద రావు చిరాగ్గా.

తలుపు మళ్ళీ చప్పుడయింది.

"మోటు వెధవల్లా ఉన్నారు. వాళ్ళకి కాలింగ్ బెల్ కూడా కనబడుతున్నట్లులేదు" అని విసుక్కుంటూ లేచి వెళ్ళాడు గోవిందరావు. అతడు తలుపు తీసేసరికి ఇద్దరు యువకులు కనబడ్డారు. అతననుకున్నంత మోటుగాలేరు వాళ్ళు.

"గోవిందరావున్నాడా?" అన్నాడు వాళ్ళలో ఒకడు.

ఆ పలకరింపుకు చిరాకుపడుతూ "నేనే గోవింద రావును" అన్నాడతను.

వెంటనే యువకులిద్దరూ చటుక్కున లోపలకు అడుగుపెట్టారు. ఒకడు వెంటనే తలుపువేసి— "ఈ రాత్రికిక్కడే పడుకుంటాం—" అన్నాడు.

"ఎవరుమీరు?" అన్నాడు గోవిందరావు కంగారుగా.

"మా ఉత్తరం అందలేదా?" అన్నాడో యువకుడు విసుగా.

"ఏ ఉత్తరం?"

"డబ్బుతో వంటికి బాగా కొవ్వెక్కింది కదూ? చిన్న చిన్న ఉత్తరాలు నీ మీదేం పని చేస్తాయిలే?" అని ఆ యువకుడు నవ్వి — "నువ్వు చాలా సంతోషంగా ఉంటున్నావు. జీవితాంతం కుమిలికుమిలి బాధపడేస్థితికి నిన్ను దిగజార్చడం మా ఆశయం"—అన్నాడు.

"ఆ ఉత్తరం రాసింది మీరా? ఎవరుమీరు? నేను మీకేం అపకారం చేశాను? నాకేమీ అర్థంకావడంలేదు" అన్నాడు గోవిందరావు.

"ప్రస్తుతానికి నీకు మా పేర్లు అనవసరం. సులభంగా ఉంటుంది కాబట్టి నన్ను నెంబర్ వన్ అనీ, ఈ నా మిత్రుణ్ణి నెంబర్ టూ అనీ వ్యవహరించు—" అన్నా

డొక యువకుడు.

గోవిందరావు చటుక్కున రెండడుగులు వెనక్కు వేసి వేగంగా అక్కణ్ణించి పక్కగదిలోకి వెళ్ళబోయాడు. నెంబర్ వన్ ఒక్క ఉదుటున వెళ్ళి గోవిందరావును చేయి పట్టుకుని "పిచ్చిపిచ్చి వేషాలు వేయకు. మా ఇద్దరిదగ్గరా రివాల్వర్లున్నాయి. ఈ క్షణంనుంచి మీ ఇంట్లో ఎవరో ఒకరు మా నెంబర్ టూ కంట్రోల్లో ఉంటారు. నేను ఇల్లంతా తిరుగుతూంటాను" అంటూ రివాల్వర్ తీసి అతడికి గురిపెట్టాడు.

ఆ దేసమయానికి అక్కడికి వచ్చిన శాంతాదేవి ఆ దృశ్యంచూసి కెవ్వుమని అరిచింది.

"నీ భార్యను అరవొద్దని చెప్పు!" అన్నాడు నెంబర్ వన్.

"అరవకే బాబూ!" అన్నాడు గోవిందరావు.

"గుడ్! ఇప్పుడు మనం అలా సోఫాల్లో కూర్చుని ముందు కార్యక్రమం చర్చిద్దాం. నీ భార్య సమయానికే వచ్చింది. అంతా కలిసే మాట్లాడుకుందాం" అన్నాడు నెంబర్ వన్.

అంతా వెళ్ళి అక్కడున్న సోఫాల్లో కూర్చున్నారు.

వచ్చిన వాళ్ళెవ్వరో గోవిందరావు భార్యకు చెప్పాడు. శాంతాదేవి ఆ ఆగంతకులవంక బెంగగా, భయంగా చూసింది.

"మేమీ ఇంట్లో రేపు రాత్రి పది గంటలవరకూ ఉంటాం!" అన్నాడు నెంబర్ వన్.

"రేపు మన ఉమ పుట్టిన రోజండీ!" అంది శాంతాదేవి.

"ఆ విషయం మాకు తెలుసు. అది మాకు ముఖ్యమైన అవకాశం. అందుకే ఈ రోజు రాత్రి ఇక్కడకు వచ్చాం...." అన్నాడు నెంబర్ వన్.

"ఏమిటి మీ పని?" అంది శాంతాదేవి.

"అది చెబితే నీకు ఈ క్షణంనుంచీ నిద్రపట్టదు. సమయం వచ్చినప్పుడే ఆ వివరాలు చెబుతాను. ప్రస్తుతానికి తక్షణ కర్తవ్యం తేలుద్దాం—" అన్నాడు నెంబర్ వన్.

"ఎలాగూ మాకు ఈ క్షణంనుంచీ నిద్రపట్టదు. మీ రెందుకొచ్చారో ఇప్పుడే చెప్పేయండి. మా గుండెలదరిచస్తున్నాం—" అన్నాడు గోవిందరావు.

"మేమిద్దరం మీ ముఖ్య బంధువులం. పుట్టినరోజు అని మమ్మల్ని మీరు ప్రత్యేకంగా ఆహ్వానించారు. అదీ రేపు ఎవరైనా మా గురించి అడిగితే మీరు ఎవరికైనా చెప్పాల్సింది! అదీ రేపటి సంగతి మరి ఈ రోజు సంగతేమిటంటే...." అని నెంబర్ వన్ తన మిత్రుడివంక చూసి కన్నుగీటాడు.

నెంబర్ టూ నవ్వి — "మీ భార్యాభర్తలిద్దరూ వేర్వేరు గదుల్లో పడుకోవాలి. మీరు పిచ్చి-పిచ్చి వేషాలేయకుండా ఇద్దరికీ చెరొకరూ కాపలా ఉంటాం ఈ రాత్రి—" అన్నాడు.

శాంతాదేవి భయంభయంగా భర్తవంక చూసింది. గోవిందరావుక్కూడా ఏమనాలో తోచినట్లులేదు. వయసులో ఉన్న భార్యను ఒంటరిగా మరో యువకుడితో ఒదిలిపెట్టడానికి ఏ భర్త అంగీకరిస్తాడు?

"మేము పిచ్చి-పిచ్చి వేషాలు వేయమని మాట ఇస్తున్నాము—" అన్నాడు గోవిందరావు.

నెంబర్ వన్ కాసేపు ఆలోచించి—"సరే—అయితే మీరు విడివిడిగా పడుకోవాలి. మీ గదిలో నేను పడుకుంటాను. నా మిత్రుడు బయట పడుకుంటాడు—"

అన్నాడు.

అదే ఓ పెద్ద రిలీఫ్ అన్నట్లుగా శాంతాదేవి నిట్టూర్చింది.

"నెంబర్ టూ—నువ్వు టెలిఫోన్ కనెక్షన్ తీసేసి పడుకో—గదిలో వీళ్ళ సంగతి నేను చూసుకుంటాను. గది బయట నువ్వు చూసుకుందువుగాని—" అన్నాడు నెంబర్ వన్ తన మిత్రుడితో.

# 3

తెల్లవారుఝామున అయిదు గంటలకు కాలింగ్ బెల్ మ్రోగింది.

శాంతాదేవి చటుక్కున లేచి కూర్చుని—"వంటావిడ కావమ్మ అయుంటుంది—" అంది.

అప్పుడు నెంబర్ వన్ మెలకువగానే ఉన్నాడు—"ఇంకా ఎవరెవరొస్తారింటికి?" అన్నాడు.

ఆమె చెప్పిన ప్రకారం ఒక ఆడ, ఇద్దరు మగ—మొత్తం ముగ్గురు పనివాళ్లు వస్తారు ఇంకో గంటలో.

"సరే—నువ్వెళ్ళి పనులు చూసుకో—కానీ ఒక్క విషయం గుర్తుంచుకో. ఈ రోజల్లా నీ భర్త ఈ గదిలో నాకు బందీగా ఉంటాడు. ఇతరులెవ్వరూ ఈ గదిలోకి రాకూడదు...." అన్నాడు నెంబర్ వన్.

ఆ గదిలో అన్ని సదుపాయాలూ ఉన్నాయి.

శాంతాదేవి తలుపులు తీసుకుని బైటకు వెళ్ళింది. కాస్త దూరంలో ఉండి గదివంకే గమనిస్తున్న నెంబర్ టూని చూసి ఆమె కలవరపడింది. తనే వెళ్ళి తలుపు తీసింది. మామూలుగా అయితే మళ్ళీ వెళ్ళి నిద్రపోయేది. కానీ నెంబర్ వన్ ఉన్న ఆ గదిలోకి మళ్ళీ వెళ్ళడానికి ఆమెకు మనస్కరించలేదు. ఆ యువకులిద్దరూ ఎవరో,

ఏం చేయనున్నారో ఆలోచనలకు అంతుపట్టక ఆమె దిగాలుగా ఉంది.

నెంబర్ టూ అనుక్షణం ఇల్లంతా కలయతిరుగుతూనే ఉన్నాడు. నెంబర్ వన్, గోవిందరావు ఆ గదిలో చిక్కుబడి ఉన్నారు. అందరికీ కాఫీలు, టిఫిన్లు అందాయి.

నెంబర్ వన్ ఇడ్లీలోకి చట్నీ రుచిని మెచ్చుకుంటూ- "అనుభవిస్తున్నావ్ మజా!" అన్నాడు. "అయినా ఇదెంతసేపులే—రాత్రికి నువ్వు ఏడుస్తూ ఉంటావు...." అన్నాడు మళ్లీ.

"నీ ఉద్దేశ్యమేమిటో చెప్పు!" అన్నాడు గోవిందరావు.

"సమయం రాగానే చెబుతాను—"అన్నాడు నెంబర్ వన్.

కుటుంబ సభ్యులు దిగులుగా ఉన్నప్పటికీ ఇంట్లో హడావుడి ప్రారంభమవుతోంది. ఎనిమిదయ్యేసరికల్లా గోవిందరావు వ్యవహారాలు చూసే మేనేజర్ కిరణ్ వచ్చి గోవిందరావును చూడగోరాడు.

"నీకేం కావాలో నాకు చెప్పు. అన్నీ నేను చూస్తాను—" అంది శాంతాదేవి.

"ఆయనతో ఒక్కసారి మాట్లాడాలి!" అన్నాడు కిరణ్.

"ఆయన ఇంట్లో లేరు—" అన్నాడు నెంబర్ టూ. శాంతాదేవి అప్రయత్నంగా అతడివంక చూసింది. నెంబర్ టూ రమను ఎత్తుకొని ముద్దులాడుతున్నాడు. కానీ అతడి కళ్లలో రమను చంపే క్రౌర్యం ఆమె మాత్రమే చూడగలిగింది.

కిరణ్ శాంతాదేవిని నొక్కించలేదు. ఏర్పాట్లు చేయ

డానికి డబ్బు కావాలతడికి. ఆ విషయం చెప్పగానే అతడు అడిగిన డబ్బిచ్చి పంపించింది శాంతాదేవి.

గోవిందరావు తన బెడ్రూంలోనే భోంచేశాడు. కొత్త బట్టలు వేసుకువచ్చిన కూతురిచేత శాంతాదేవి ఆయనకు ఆ గదిలోనే దణ్ణం పెట్టించింది.

"పుట్టిన రోజు ఉమది. సాయంత్రం మా ఇంటికి ఎందరో ముఖ్యులు వస్తారు. ఆ సమయంలో నేనుకూడా బయట వుండి అందర్నీ పలకరించాలి. అందుకు అభ్యంతరమేమిటి?" అన్నాడు గోవిందరావు.

"మాకే అభ్యంతరమూలేగు. నువ్వు బయటకు వెడితే గదిలో నీ భార్యను వదిలిపెట్టాలి. ఆడదాన్ని ఒంటరిగా నాలో వదలడానికి భయపడుతున్నావు కాబట్టి నేను నిన్ను ఇక్కడ ఉండమన్నాను—" అన్నాడు నెంబర్ వన్.

"ఉమ మా ఇద్దరి కూతురూనూ—మేమిద్దరం బయట ఉండాలి—"

"అలా కుదరదు...." అన్నాడు నెంబర్ వన్.

"ఎందుకని?" అన్నాడు గోవిందరావు.

"ఎందుకో చెబుతాను. జాగ్రత్తగా వినండి—" అన్నాడు నెంబర్ వన్ శాందాదేవినీ, గోవిందరావునూ ఇద్దర్నీ ఉద్దేశించి.

భార్యాభర్తలిద్దరూ చెవులు రిక్కించారు.

"సాయంత్రం మీ ఇంట ముఖ్యులందరూ జేరాక— వేడుక మధ్యలో ఒక మనిషి అక్కడకు వస్తాడు. అతడి చేతిలో ఏదేళ్ళ కుర్రాడు ఉంటాడు. ఆ వ్యక్తి చెప్పిన కథను శాంతాదేవి నిజంగా అంగీకరించాలి. అంగీకరించని పక్షంలో ఇక్కడ గోవిందరావు చచ్చి

పోతాడు. తర్వాత శాంతాదేవి పిల్లలు కూడా చచ్చి పోతారు. అందుకోసమే మీ దంపతుల్ని వేరువేరుగా ఉంచుతున్నాం—" అన్నాడు నెంబర్ వన్.

"ఏమిటా వ్యక్తి చెప్పే కథ?" అన్నాడు గోవిందరావు,

"ఆ వ్యక్తి పేరు గోపీనాథ్. అతడు శాంతాదేవిని ఒకప్పుడు ప్రేమించాడు. శాంతాదేవి కూడా అతణ్ని ప్రేమించింది. మనసు, తనువు కూడా గోపీనాథ్‌కు అర్పించింది—" అన్నాడు నెంబర్ వన్.

"ఏమండీ—ఇవేం మాటలు?" అరిచినట్లుగా అంది శాంతాదేవి.

"ఇలా అరిచి కాసేపు నటించినా ఫరవాలేదు. కానీ తర్వాత ఇది నిజమని నలుగురిముందూ ఒప్పుకోవాలి. గోపీనాథ్, శాంతాదేవి పెళ్లి చేసుకుందామనుకున్నారు. ఈ లోగా గోవిందరావు శాంతాదేవిని చూసి పెళ్లాడాలనుకున్నాడు. గోవిందరావు ఆస్తిపాస్తులు చూసి శాంతాదేవి తలిదండ్రులు మోజుపడ్డారు. వారి మాట కాదనలేక శాంతాదేవి కూడా ఈ పెళ్లికి ఒప్పుకుంది. ప్రియురాలి మనసు మారిపోగానే గోపీనాథ్ దెబ్బతిన్నాడు. కానీ అతడు శాంతాదేవి సుఖాన్ని కోరుకున్నవాడు. అందువల్ల ఆమె జీవితంలోంచి నిష్క్రమించదలిచాడు. అయితే అప్పటికే శాంతాదేవి మూడు నెలల గర్భవతి. అబార్షన్ చేయిస్తే ప్రాణప్రమాదమని గోపీనాథ్ శాంతాదేవి తలిదండ్రులు నొక్క కోరిక కోరాడు. రహస్యంగా శాంతాదేవికి పురుడు పోయించి పుట్టిన బిడ్డను తనకు అప్పగించాలి. శాంతాదేవికి గుర్తుగా ఆ బిడ్డను పెంచుకుని చరమ జీవితం గడపాలనుకున్నాడతను...."

"అబద్ధం....అంతా అబద్ధం...." అరిచింది శాంతా దేవి.

"ఈ అబద్ధాన్ని నిజం చేయగల శక్తి నీకుంది. చేయాలి కూడా. గోపినాథ్ తన బిడ్డనింతకాలం పెంచాడు. అతడికి జీవితం అంటే విరక్తి కలిగింది. సన్యాసుల్లో కలిసిపోవాలనుకుంటున్నాను. శాంతాదేవి కెలాగూ ఇంక పిల్లలు పుట్టరు. ఆమెకు మగపిల్లలు లేరు. ఈ బిడ్డను ఆమెకు అప్పగించి వెళ్ళిపోవాలని వచ్చాడతను. అతని వేదాంత దృష్టికి ఈ ప్రపంచపు హద్దులు తెలియవు...." అని ఆగాడు నెంబర్ వన్.

శాంతాదేవి ఏడుస్తూ—"నేను చచ్చిపొమ్మన్నా చచ్చి పోతానుకానీ ఈ అబద్ధం నిజమని చెప్పలేను. ఆ అవమానంతో బ్రతకలేను...." అంది.

"నీ భర్త విశాల హృదయుడు. అతడికి నిజం తెలుసును. మేము మీ ఇద్దరిమధ్యా కలతలు సృష్టించడం లేదు. పచ్చగా ఉన్న మీ ఇద్దర్నీ పదిమందిలో నవ్వుల పాలు చేయడమే మా ఉద్దేశ్యం. మా తాలూకు పిల్లవాడు మీ ఇంటి బాబు కావడం మా ఆశయం. ఆ బాబును మీరు నిజంగానే కన్న కుర్రాడిలా పెంచి పెద్ద చేయాలి. వాడికే చిన్న ప్రమాదం సంభవించినా—మీ పిల్లలక్కూడా ప్రమాదం—" అన్నాడు నెంబర్ వన్.

"ఇది అన్యాయం. ఒక హిందూ స్త్రీని దుశ్శీలవతినని అంగీకరించమనడం దారుణం. తను శీలవతినని అందర్నీ నమ్మించడం కోసం అగ్ని ప్రవేశం చేయడానిక్కూడా సిద్ధపడింది సీత. అలాంటి దేశంలోని స్త్రీని ఇలాంటి పనికి బలవంత పెట్టడం నేనంగీకరించను—" అన్నాడు గోవిందరావు.

"నువ్వు అంగీకరిస్తావని నేను అనుకోవడంలేదు. ఆ విషయం నేను పట్టించుకోదల్చుకోలేదు. మేము చెప్పినట్లు చేయాలంటే—లేని పక్షంలో నువ్వు చావల్సిందే—" అన్నాడు నెంబర్ వన్.

సుమారు గంటసేపు అక్కడ చర్చ జరిగింది. ఆ గంటసేపటిలోనూ నెంబర్ వన్ పట్టుదల ఎంత గట్టిదో ఆ దంపతులిద్దరూ తెలుసుకోగలిగారు తప్ప ఇంకే ప్రయోజనమూ కనబడలేదు. చిట్టచివరకు గోవిందరావు శాంతాదేవిని అందుకు ఒప్పించక తప్పలేదు.

"వీళ్లు చెప్పిందానికి ఒప్పుకోకపోతే - నేను చస్తాను మన పిల్లలు చస్తారు. ఆ తర్వాత నువ్వు చస్తావ్. సమస్యలను తర్వాత ఏదో విధంగా పరిష్కరించుకోవచ్చును. ముందు మన ప్రాణాలు రక్షించుకోక తప్పదు...." అన్నాడు గోవిందరావు.

ఈలోగా శాంతాదేవి ఏదైనా అఘాయిత్యం చేయడానికి వీల్లేదు. నెంబర్ టూ రోజల్లా రమను ఎత్తుకునే ఉంటున్నాడు. తన ప్రాణాలనైనా త్యాగం చేయడానికి సిద్ధపడుతుంది కానీ—ఏ తల్లీ తన బిడ్డ ప్రాణాలు తీయడానికి అంగీకరించదు.

ఎంతో ఉత్సాహకరమైన ఉమ పుట్టిన రోజు ఆ దంపతుల మనసులనిండా విషాదం నింపింది.

## 4

గోవిందరావు తలపట్టుకుని కూర్చున్నాడు.

శాంతాదేవి కూర్చుని ఏడుస్తోంది.

అది అర్ధరాత్రి ఒంటిగంట సమయం.

నిద్రపోతున్న ఇద్దరాడపిల్లలకు కాస్త దూరంగా ఒక పదేళ్ళ పిల్లవాడు కూడా నిద్రపోతున్నాడు.

"ఏడవకు శాంతా!" అన్నాడు గోవిందరావు అనునయంగా.

"నేనింక వీధిలోకి వచ్చేదెలాగండీ!" అంది శాంతాదేవి ఇంకా ఏడుస్తూనే.

"శాంతా—మనకు డబ్బుంది. డబ్బు ఎలాంటి మచ్చలనైనా తొలగిస్తుంది. నీకు మరీ అంత అవమానంగా ఉంటే ఈ ఊరొదిలి వెళ్ళిపోదాం" అన్నాడు గోవిందరావు.

"కానీ..కానీ..మన పెళ్ళయి ఆరేళ్ళయింది. ఈ పదేళ్ళ కుర్రాణ్ని నా బిడ్డగా ఎలా చెప్పుకోనండీ? వాడిని చూస్తేనే నాకు అసహ్యం వేస్తోంది. వీడు మన ఇంట్లో తిరుగుతూంటే నాకు ఒళ్ళు కంపరంగా ఉంటుంది. నేను చెయ్యని పాపాన్ని కల్పన అనడానికి వీల్లేకుండా ఎదురుగా ఉన్న వీడిగురించి నలుగురికీ నేనేం సంజాయిషీ ఇచ్చుకోవాలి?" అంది శాంతాదేవి ఏడుపు ఆపకుండానే.

గోవిందరావు భార్యను సమీపించి దగ్గరగా తీసుకుని- "ఏడవకు శాంతా! కష్టమో నష్టమో, అవమానమో, దుఃఖమో ఏదో ఒకటి—ఇద్దరం కలిసే భరిద్దాం—" అన్నాడు.

"నేను బ్రతకలేనండీ—చచ్చిపోతాను—" అంది శాంతాదేవి. సాయంత్రం నలుగురిముందూ ఆ భయంకర విషయం ఆమె అంగీకరించగానే అక్కడ పెద్ద సంచలనం కలిగింది. చాలామంది ఆమెను అసహ్యించుకుని అక్కణ్నించి వెంటనే వెళ్ళిపోయారు. కొంతమంది ఆమె ముఖంమీదే నవ్వుకొన్నారు. కొందరు మగవాళ్లు ఆమెకు వినబడేలా ఆమె గురించి అసభ్యంగా మాట్లాడుకున్నారు.

"భర్త పక్కన లేకుండా పార్టీ బాగానే ఏర్పాటు

చేసింది. ఆడాళ్లను వదిలేసి ఒక్క మగాళ్లనే పిలిస్తే ఇంకా బాగుండేది కదా....”

శాంతాదేవి అప్పుడే ఏడుపు ఆపుకోలేకపోయింది. ఆమె ఏడుపు ఎవరిలోనూ జాలిపుట్టించలేదు.

చాలా త్వరగానే ఆ వేడుక ముగిసింది. ఏడేళ్ళ కుర్రాడినక్కడే వదిలేసి గోపీనాథ్ ఎప్పుడో వెళ్ళిపోయాడు. ఆ పాత్ర నటించిన వ్యక్తి ఎవరోగానీ తన పాత్రపోషణ అత్యద్భుతంగా చేశాడు. అందరికీ అతడి గాధ వినగానే—అతనిపైన జాలీ, ఆమెపైన అసహ్యమూ కలిగాయి. ఆ ఏడేళ్ల కుర్రాడు తల్లి ప్రేమకోసం తపించి పోతున్నాడట. వాడిపై కూడా అక్కడ చేరినవారందరికీ సానుభూతి కలిగింది.

అంతా వెళ్ళిపోయాక ఇంట్లో శాంతాదేవి మాత్రమే మిగిలాక నెంబర్ వన్, టూ లిద్దరూ వెళ్ళిపోయారు. వెళ్ళేముందు ఆ పిల్లవాడి గురించి మరీ మరీ హెచ్చరించారు....

“ఇప్పుడు మనం ఏడుస్తూ కూర్చుంటే ప్రయోజనం లేదు. మనమీద ఎవరు ఎందుకు పగబట్టారో తెలుసుకోవాలి. ఇందుకు మనం ఎన్నో విషయాలు చర్చించాల్సి ఉంది—” అన్నాడు గోవిందరావు.

కాసేపటికి శాంతాదేవి మామూలు మనిషయింది. అప్పుడు గోవిందరావు నెమ్మదిగా—“నేనిలా అడుగుతున్నానని ఏమీ అనుకోకు. పెళ్ళికిముందు నువ్వెవ్వరినైనా ప్రేమించడంగానీ, నిన్నెవరైనా ప్రేమించడంగానీ జరిగిందా—?” అన్నాడు.

శాంతాదేవి కళ్ళు మళ్ళీ చెమ్మగిల్లాయి—“అదుగో—నేను అనుమానించినంతా అయింది. మీలో అప్పుడే అను

మాన బీజాలు నాటుకున్నాయి—" అంది.

"నిన్ను అనుమానిస్తే నేను మూర్ఖుణ్ణే అవుతాను. నా ప్రశ్నను అర్థం చేసుకోకపోతే నువ్వు మూర్ఖురాలివౌతావు. పెళ్ళికి ముందు ఎవర్నైనా ప్రేమిస్తే అదో పెద్ద తప్పు అనుకునే సంస్కార విహీనుణ్ని కాను నేను...." అన్నాడు గోవిందరావు.

"పిల్లలమీద ఒట్టేసి చెబుతున్నాను. మిమ్మల్ని పెళ్ళి చేసుకునేవరకూ పరాయి మగవాడి ఊహ కూడా నా మనసులో మెదలలేదు—" అంది శాంతాదేవి.

ఆమె మాటలకు చలించిపోయాడు గోవిందరావు— "నన్ను క్షమించు శాంతా! నేను నిన్ను శంకించడం లేదు. నువ్వు పునీతలలో పునీతవు. ఇప్పుడు నాకున్న వ్యథలన్నీ ఈ కుర్రాడి గురించే! వీడెవరో మనకు తెలియదు. ఎవరి తాలూకు వాడో తెలిస్తే దాన్నిబట్టి మన మీద పగబట్టినవాళ్ళ ఆచూకీ తెలుసుకోవచ్చు. కానీ ఎలా? వీడికి ఏమాత్రం ప్రమాదం జరిగినా మన పిల్లలకు ప్రమాదమే!" అన్నాడు.

"ఎవరో తెలివిగా పథకం పన్ని—కానీ ఖర్చులేకుండా ఈ కుర్రాణ్ని ఆస్తిపరుణ్ని చేశారు. చేసినవాళ్ళు చేసినట్టూరుకోకుండా మన జీవితాన్ని నవ్వులపాలు చేశారు...." అంది శాంతాదేవి.

## 5

బాబు తన పేరు విజయ్ అని చెప్పాడు. ఎన్ని ప్రశ్నలువేసినా వాడు చెప్పే విషయం ఒక్కటే. వాణ్ణి గోపీనాథ్ పెంచాడు. వాడి తల్లి పేరు శాంతాదేవి.

వాడు అప్పుడే శాంతాదేవిని అమ్మా అని పిలవడం ఆరంభించాడు.

వాణ్ని ఇంకేం ప్రశ్నలువేసినా తలనొప్పి అంటాడు.

ఎవరో కానీ ఆ కుర్రాడికి మంచి శిక్షణ ఇచ్చారు.

విజయ్ ప్రవర్తన చాలా చక్కగా ఉంది. వాడు ఆడపిల్లలిద్దర్నీ పెద్దచెల్లి, చిన్నచెల్లి అని పిలుస్తున్నాడు. అభిమానంగా చూస్తున్నాడు. ఉమ, రమ, కూడా వాడికి బాగా మచ్చికయ్యారు.

శాంతాదేవి, గోవిందరావు కూడా ఎన్నో విధాల ఆలోచించారు—ఆ కుర్రాడిచేత నిజం చెప్పించాలని. ఏమడిగినా వాడు చెప్పేవి రెండు మాటలు—"నన్ను గోపీనాథ్ పెంచాడు. మా అమ్మ పేరు శాంతాదేవి!"

ఇంకేమైనా అడిగితే — "తలనొప్పి!" అన్నాడు వాడు.

గోవిందరావుకు చిరాకువచ్చి వాణ్ని పక్క గదిలోకి తీసుకువెళ్ళి నాలుగు తగిలించి—"నిజం చెప్పు వెధవ కానా!" అన్నాడు. విజయ్ ఏడుస్తూ కూర్చున్నాడు తప్పితే నిజం చెప్పలేదు.

శాంతాదేవి మధ్యలో కలగజేసుకుని విజయ్‌ని బైటకు తీసుకువచ్చింది. చిన్న కుర్రాడిని హింసించడం తనకు నచ్చదని చెప్పిందామె. గోవిందరావు ఆమెవంక అదోలా చూశాడు.

ఆ రోజు సాయంత్రం గోవిందరావుకు ఫోన్ వచ్చింది.

"మిస్టర్ గోవిందరావ్! ఇది మొదటి తప్పుగా గుర్తించి వదిలేస్తున్నాను. చిన్న కుర్రాడిమీద చేయి చేసుకుంటావా? నీ పిల్లలకు అంగవైకల్యం రావాలని నీకుందా?" అంది ఓ కంఠం ఫోన్‌లో.

గోవిందరావు అదిరిపడ్డాడు—"మీరు పొరబడ్డారు. నేను విజయ్‌మీద చేయిచేసుకున్నానని ఎవరు చెప్పారు?"

ఆ సమయంలో శాంతాదేవి అక్కడే ఉంది—

"ఎవరండీ అది!" అందామె.

"నువ్వే విను...."అంటూ గోవిందరావు ఆమెకు ఫోన్ అందించాడు.

"ఒకరు చెప్పాలా నాకు? నీ ఇంట్లో ఏం జరిగినా నాకు తెలుస్తుంది! ఇంకెప్పుడూ ఆ పసిబాలుడిమీద చేయిచేసుకోకు. నీ పిల్లలకు అంగవైకల్యం వస్తుందని హెచ్చరిస్తున్నాను...."

అవతల క్లిక్‌మనేలోగానే రిసీవర్ శాంతాదేవి చేతిలోంచి జారిపోయింది.

"ఎలా తెలిసిందంటావ్ వాడికి?" అన్నాడు గోవిందరావు.

అయోమయంగా ముఖం పెట్టింది శాంతాదేవి.

"వాడేదో సినిమాల్లో ముఠామనిషనీ వాడికి మనింట్లో ఏ క్షణంలో ఏం జరుగుతున్నా తెలిసే ఆధునిక సౌకర్యాలున్నాయనీ నేననుకోవడంలేదు. అయినా అంత అవసరమూ వాడికుండదు. మనింట్లోనే మనమీద గూఢచారులుగా పనిచేస్తున్నారెవరో?" అన్నాడు గోవిందరావు.

"ఎవరై ఉంటారండీ వాళ్ళు?" అంది కంగారుగా శాంతాదేవి.

"నేను విజయ్‌ని కొట్టినపుడు ఇంట్లో ఎవరున్నారు?" అన్నాడు గోవిందరావు.

"వంటమనిషి ఉంది. పనివాళ్ళిద్దరున్నారు...." అంది శాంతాదేవి.

"ఇంకా...."

"పిల్లలున్నారు...."

"ఇంకా...."

"ఇంకెవరున్నారు—మీరూ.... నేనూ?" అని శాంతా దేవి అప్రయత్నంగా భర్తవంక చూసి—"ఏమండీ! మీరు నన్ను అనుమానిస్తున్నారా?" అంది.

గోవిందరావు వెంటనే ఏమీ మాట్లాడలేదు. తర్వాత నెమ్మదిగా—"ఆ ముగ్గుర్నీ ఇలా పిలు—" అన్నాడు.

వంటమనిషినీ, పనివాళ్ళనీ శాంతాదేవి పిల్చుకుని వచ్చింది.

"మీరు మా ఇంట్లో మాటల్ని బైటకు చేరవేస్తున్నట్లు నాకనుమానం వచ్చింది. ఒకే ఒక్కరోజు చూస్తాను' ఇది కొనసాగిందా? మీ ఉద్యోగాలు ఊడతాయి—" అన్నాడు గోవిందరావు తీవ్రంగా.

వాళ్ళు ముగ్గురూ ఆ దంపతుల కాళ్ళమీద పడ్డారు. తమకేమీ తెలియదని మొరపెట్టుకున్నారు. తమ అమాయకత్వాన్ని నిరూపించుకునేందుకు ఏ పరీక్షకైనా సిద్ధమే అన్నారు.

వాళ్ళను చూస్తూంటే అమాయకులేనని గోవిందరావుకి అనిపించింది. అయినా ఏ దొంగ కూడా ఓ పట్టాన చేసిన తప్పు ఒప్పుకోడు గదా!

అందుకని మర్నాడు గోవిందరావు వాళ్ళను పరీక్షించ దల్చాడు. వాళ్ళ ముగ్గుర్నీ ఉదయంనించి సాయంత్రం వరకూ వంటిల్లు ప్రాంతాలు కదలకూడదని శాసించాడు.

భోజనాలయ్యాక విజయ్‌ని మరోమారు బెదిరించాడు. ఆ కుర్రాడేమీ చెప్పకపోయేసరికి నాలుగు తగిలించాడు. మధ్యలో శాంతాదేవి కలగజేసుకోపోతే అతని చేతిలో ఆ కుర్రాడేమైపోయేవాడో ఏమో—

ఏడ్చి-ఏడ్చి అలసిపోయి నిద్రకుపడ్డాడు విజయ్.

విజయ్ నిద్రకుపడ్డ పదినిముషాలకు ఫోన్ వచ్చింది. అది శాంతాదేవి రిసీవ్ చేసుకుంది.

"మా శక్తిసామర్థ్యాలు తెలిసుండీ మీరెందుకు నిర్లక్ష్యం చేస్తున్నారు? అనవసరంగా పనివాళ్ళను అనుమానించకండి. మీ ఇంట్లో ఏం జరిగేదీ ఇక్కడ నిమిషాలతో సహా రికార్డవుతోంది. ఈ రోజు నీ భర్త విజయ్‌ని సరిగ్గా పదకొండు గంటల నలభైరెండు నిముషాలకు కొట్టాడు. నువ్వు వారించకపోతే కుర్రాడు ఏమైపోయేవాడో ఏమో!"

శాంతాదేవి మతిపోయినదానిలా అయిపోయింది. అప్పుడే అక్కడికి వచ్చిన గోవిందరావు—"ఎవరది?" అని—తర్వాత భార్య ముఖభావాలు చూసి చటుక్కున ఫోన్ అందుకున్నాడు.

"ఏం—మాట్లాడవు? నీ భర్త సరిగ్గా పదకొండు గంటల నలభైరెండు నిముషాలకు విజయ్‌ని కొట్టినట్లు మాకెలా తెలిసిందనా? ఎలా తెలిసిందని ఆలోచించడం వల్ల ప్రయోజనంలేదు. మాకు తెలిసితీరుతోందని గ్రహించాలి. అందువల్ల ఏం జరుగుతుందో ఊహించాలి. ఇంకోసారిలా జరిగితే ఉమకు కాళ్ళుండవు. రమకు చేతులుండవు. దట్సాల్!"

అవతల ఫోన్ క్లిక్‌మంది.

"ఇంపాసిబుల్!" అన్నాడు గోవిందరావు.

శాంతాదేవి నోట మాటరాకుండా కాసేపు అలాగే నిలబడిపోయింది. తర్వాత భర్తను సమీపించి అతడి చేయిపట్టుకుని—"నాతో రండి!" అంది.

ఇద్దరూ పిల్లలు పడుకున్న గదికి వెళ్ళారు. శాంతాదేవి పిల్లలిద్దర్నీ దగ్గరగా తీసుకుని "వీళ్ళిద్దరికీ ఏమైనా

నేను బ్రతకలేనండీ! ఆ విజయ్‌ని కన్నకొడుకులా పెంచుదామండీ!" అంది.

గోవిందరావు తలపట్టుకుని—"శాంతా! నా బాధ నీకు తెలుసు. పదిమందిలో పరువుగా బ్రతుకుతున్నాం మనం. చూస్తూ చూస్తూ వీడికి ఈ విజయ్‌గాడికి ఇంట్లో సమాన హోదా ఎలా ఇవ్వగలం? అలా చేస్తే నీమీద అభియోగం నిజమేనని లోకం నమ్ముతుంది. ఒక పతితగా సమాజం నిన్ను వేలెత్తి చూపిస్తుంది. ఒక పతితను ఆదరించిన నన్ను సమాజం అభినందించదు. చేతకానివాడని వెక్కిరిస్తుంది. అది నువ్వూ నేనూ కూడా భరించలేము. ఈ కుర్రాడి వెనుక రహస్యం తెలుసుకోకుంటే ఎలా?" అన్నాడు.

"వద్దండీ—మన పిల్లల క్షేమంకోసం నేను ఎంత అవమానాన్నైనా భరించడానికి సిద్ధంగా ఉన్నాను-" అంది శాంతాదేవి.

గోవిందరావు మౌనంగా ఉండిపోయాడు.

శాంతాదేవి—"ఏమండీ—ఆ విజయ్ నింకేమీ అననని, కొట్టనని మాట ఇవ్వండీ—" అంది.

"ఈ మాట నువ్వు అడగ్గలిగావు కానీ—నేను ఇవ్వలేను శాంతా!" అని అక్కణ్నించి వెళ్ళిపోయాడు గోవిందరావు.

భర్త మాటలకు అర్థాన్ని ఆలోచిస్తూ అలాగే ఉండిపోయింది శాంతాదేవి.

## 6

శాంతాదేవి అనుకున్నంత సుగమంగా లేదు జీవితం. అవమానం రకరకాలుగా ఎదురయిందామెకు.

ఇరుగుపొరుగు ఆవిడ్ని చూడగానే చెవులు కొరుక్కుంటూన్నారు. వీధిలో ఆమెను చూడగానే గౌరవంగా తొలగిపోయే మగవాళ్ళిప్పుడు వెకిలి చూపులు చూస్తున్నారు. ఇంట్లో పనివాళ్లు తప్ప ఎవ్వరూ ఆమెను గౌరవించడంలేదు.

తమ పిల్లల క్షేమం దృష్ట్యా ఆమె విజయ్ మీద ఈగ కూడా వాలనివ్వడంలేదు. అది మరిన్ని అపార్థాలుకు దారితీస్తోంది. ఆమె విజయ్‌మీద చూపే ప్రేమాను రాగాల విషయం పనివాళ్ళద్వారా బైటకు పాకుతోంది. ఆమె శీలవతి కాదన్న విషయంలో బయటివారి కెవ్వరికీ ఇప్పుడు సందేహంలేదు.

గోవిందరావు అక్క వచ్చిందో పర్యాయం. విజయ్ గురించి ఆరాలుతీసింది. ఏ పరిస్థితిలో వాడు తమ ఇంట చేరాడో శాంతాదేవి వదినగారికి చెప్పుకుంది.

"వాడు నీ కొడుకు కాకపోతే నాలుగుతన్ని వీధిలోకి గెంటేయాల. మీకొచ్చిన బెదిరింపు గురించి పోలీసులకు చెప్పాలి. అంతేకానీ ఆ వెధవ నిలా నెత్తికెక్కించుకుని ఆస్తి కట్టబెడతారా?" అని మరదల్ని మందలించిందామె.

తమ్ముడి దగ్గరకు వెళ్ళి—"దాని ప్రేమాభిమానాల తీరు చూస్తూంటే వాడు నిజంగానే దాని కొడుకని పిస్తోందిరా. పెళ్ళికి ముందు కాలుజారి ఉంటుంది. తన కింక పిల్లలు పుట్టే అవకాశంలేదు. ఉన్నవాళ్లిద్దరూ ఆడ పిల్లలు. ఈ ఆస్తి తన కొడుకే ఎందుకు అనుభవించ కూడదు—అనుకొని అది ఏదో పథకంవేసి నిన్ను బోల్తా కొట్టించి తన కొడుకునింటికి రప్పించుకుని నీ ఎదురుగానే వాడికి తల్లిప్రేమను అందిస్తోంది—" అందామె.

గోవిందరావు ఆమె మాటలు నమ్మడానికిష్టపడడం

లేదు.

"నా మాటలు నమ్మరు. ఏదో రోజున అది నిన్ను కూడా విషంపెట్టి చంపేస్తుంది—" అంది గోవిందరావు అక్క.

"శాంత అలాంటిది కాదు...." అన్నాడు గోవిందరావు.

"పెళ్ళాం మాటలు విని మరీ ఇంత చచ్చు వెధవ్వై పోయావేంటిరా!" అని విసుక్కుందామె.

ఈ సంభాషణ శాంతాదేవికి వినబడింది. అసలు వినపడాలనే గోవిందరావు అక్క కాస్త గట్టిగా మాట్లాడింది.

"పెళ్ళికిముందే పరాయి మగాడికి వళ్ళప్పగించి బిడ్డను కన్న ఆడది— పెళ్ళయ్యాక—అందులోనూ బిడ్డలు పుట్టకుండా ఆపరేషన్ కూడా జరిగాక తిన్నగా ఉంటుందటరా—"

శాంతాదేవికి వళ్ళంతా సూదులతో గుచ్చినంత బాధ కలిగింది. వదినగారి సంగతి ఆమెకి తెలియనిదేమీ లేదు. కానీ ఆవిడ అభియోగాలన్నీ భర్త సహించి ఎలా వింటున్నాడు? ఆయన మనసులో విషబీజం ప్రవేశించిందా.

శాంతాదేవి చటుక్కున ఆ గదిలోకి ప్రవేశించి— "ఏమమ్మా వదినా—ముగ్గురు పిల్లల తర్వాత నువ్వు ఆపరేషన్ చేయించుకున్నావు గదా—ఆ అనుభవంతో నే ఈ మాటలంటున్నావా?" అంది.

గోవిందరావు అక్క తెల్లబోయింది. గోవిందరావు మాత్రం తీవ్రంగా—"శాంతా— పెద్దాచిన్నా లేకుండా ఏమిటామాటలు?" అన్నాడు.

"వయసుతోటే పెద్దవాళ్ళు కారండీ మనుషులు...."

అంది శాంతాదేవి.

"ఆ సంగతి నాకు తెలుసు. బుద్ధి నిబట్టే పెద్దరికం! నీ బుద్ధెలాంటిదో ఇంట్లో ఏ దేళ్ళ కుర్రాడు సాక్ష్యమిస్తున్నాడు—" అంది గోవిందరావు అక్క.

"నా బుద్ధెలాంటిదో నా మొగుడికి తెలుసు. మిగతా వాళ్ళేలా అనుకున్నా నాకు బాధలేదు...." అంది శాంతాదేవి.

"తెలుస్తూనే ఉంది నువ్వు సిగ్గులేనిదానివని. వాణ్ని చవటనిచేసి ఆడిస్తున్నావు. నీ పరిస్థితుల్లో నేనుంటేనా- మొగుడు క్షమించినాసరే విషం మింగి చచ్చేదాన్ని...." అంది గోవిందరావు అక్క.

"ఇంతకీ మీ బాధ నేను చావలేదనా?" అంది శాంతాదేవి.

"శాంతా—ఊరుకో—" అన్నాడు గోవిందరావు.

"ఉరుకుంటానండీ! అన్నీ మీకు తెలుసు. మీరూరుకుంటున్నారు. నన్నూరుకోమంటున్నారు. ఇలాగే ఊరుకుంటే ఇప్పటికే నల్గురూ నమ్ముతున్న ఈ అబద్ధం ఇంకా ఇంకా బలపడిపోతుంది. మనవాళ్ళన్న వాళ్ళే మనల్నర్థం చేసుకోవాలి. పెళ్ళయి ఆరేళ్ళు దాటింది. ఇంకా ఈవిడ మిమ్మల్నీ, నన్నూ వేరుచేసి మాట్లాడుతుందేమిటి? మనమంతా ఓ కుటుంబంలోని వాళ్ళం కదూ—చేతనైన సాయంచేయాలి కానీ ఇదా మాట్లాడే పద్ధతి!" అంది శాంతాదేవి ఉక్రోషంగా.

"అంతా నా కర్మ!" అని అక్కణ్నించి వెళ్ళిపోయాడు గోవిందరావు.

"ఏదో తమ్ముడన్న అభిమానంకొద్దీ నాకు తోచింది చెప్పానుకానీ నీమీద నాకు ద్వేషమేమీ లేదు. మీ

సంసారం—మీ ఇష్టమొచ్చినట్లు పడండి—" అంది గోవిందరావు అక్క.

మర్నాడావిడ వెళ్ళిపోయింది.

"ఇక ముందునించి మన జీవితం ఇలాగే వుంటుంది. నాకు నీ మీద పూర్తి సానుభూతి ఉంది. నన్నుమాత్రం అపార్థం చేసుకోకు—" అన్నాడు గోవిందరావు భార్యతో.

అప్పటికే శాంతాదేవి ఒక నిర్ణయానికొచ్చింది.

## 7

రమ గుక్కపట్టి ఏడుస్తూంటే గోవిందరావుకు మెలకువచ్చింది! పక్కలో శాంతాదేవి లేదు.

"శాంతా, శాంతా!" అని పిలిచాడతను. జవాబు రాలేదు.

బహుశా బాత్రూంకు వెళ్ళి ఉంటుందని అనుకున్నాడు గోవిందరావు. అతడు రమను సముదాయించడానికి యత్నిస్తూండగా విజయ్ అక్కడికి వచ్చాడు.

"ఏరా—ఇలా వచ్చావ్?" అన్నాడు గోవిందరావు చిరాగ్గా.

"బాత్రూంకు వెళ్ళాల్సి లేచాను. రమ ఏడుపు వినిపించింది—" అన్నాడు విజయ్.

"బాత్రూంనుంచి వస్తున్నావా—అమ్మ బాత్రూంలో లేదా?" అన్నాడు గోవిందరావు.

"లేను...."

ఉలిక్కిపడి లేచాడు గోవిందరావు. వెతికి చూడగా శాంతాదేవి ఇంట్లో ఎక్కడాలేదు. ఆ ప్రయత్నంలోనే అతనికి తలగడకింద ఓ ఉత్తరం కనబడింది. అది చూడ

గానే అతని మనసు కీడును శంకించింది. వణుకుతున్న చేతులతో దాన్ని చదివాడతను.

"ఏమండీ!

నేను దూరంగా వెళ్ళిపోతున్నాను. నా శవం కూడా మీ కళ్ళబడదు. నా పిల్లల్ని ఏ లోటూ లేకుండా పెంచి పెద్ద చేస్తారని ఆశిస్తున్నాను. ప్రస్తుత పరిస్థితిల్లో ఇంతకుమించి వేరే మార్గం కనబడ్డంలేదు నాకు. విజయ్ గురించి మీరేమని చెప్పగలరు?.... ఇప్పుడైతే నామీద ప్రేమతో వాణ్ని భరించానని చెప్పుకోవచ్చు.

సుఖంగా గడిచిపోతున్న మన కాపురంలో దేవుడే ఈ చిచ్చుపెట్టాడు. మీ క్షేమాన్నీ, మన పిల్లల క్షేమాన్నీ దృష్టిలో ఉంచుకుని చావాలనే నిర్ణయానికి వచ్చాను. పిల్లలకు మాత్రం నిజం చెప్పకండి. ఊరెళ్ళిందనీ మళ్ళీ వస్తుందనీ చెప్పండి. అవసరమనిపిస్తే రెండోపెళ్ళిచేసుకోండి. అందుకు ఈ ఉత్తరం ఉపయోగించుకోండి.

శాశ్వతంగా మీకు దూరమైపోతున్న—

మీ

శాంత."

ఉత్తరం చదివి కాసేపు అలా నిశ్చేష్టుడై ఉండిపోయాడు గోవిందరావు.

ఆఖరికి శాంత ఎంతపని చేసింది?

అసలు శాంత ఇలా ఎందుకు ప్రవర్తించింది?

రకరకాల ప్రశ్నలు గోవిందరావును బాధించాయి. అయితే తన ప్రవర్తన కూడా శాంతను కొంతవరకు ఆత్మహత్యపట్ల ప్రోత్సహించినట్లు అతడికి అనిపించింది.

కానీ తను ఏం చేస్తాడు? శాంతను తనేమీ పల్లెత్తుమాట అనలేదు. చుట్టూ వున్న సమాజాన్ని అదుపులో పెట్టడం తనవల్ల కాలేదు.

కానీ ఆడదాని బ్రతుకు చుట్టూ వున్న సమాజంపైనే ఆధారపడివుంది—ఆ సమాజం ఆమెను వెక్కిరిస్తున్నప్పుడు భర్త ఆమెను ప్రత్యేక శ్రద్ధతో చూడాలి. తనలా చూడలేదు. కానీ తనున్న పరిస్థితు లెలాంటివి?

విచిత్రమైన పరిస్థితులు శాంతను ఆత్మహత్యకు పురి గొలాృయి.

ఇప్పుడు తనేం చేయాలి? శాంతను రక్షించుకునే అవకాశమింకా ఉందా?

గోవిందరావు బుర్ర హఠాత్తుగా పనిచేయడం ప్రారంభించింది. ఇప్పుడు టైము అయిదయింది. శాంత ఇల్లువదిలిపెట్టి ఎంతసేపయిందో? ఎంతయినా రెండు మూడు గంటలు దాటి ఉండదు.

పోలీస్ స్టేషన్‌కు ఫోన్ చేస్తే?

అప్పుడీ ఉత్తరం చూపించాలి. పోలీసులు మొత్తం కథ అడుగుతారు. వాళ్ళకు నిజంచెప్పక తప్పదు. విజయ్ తన కొడుకుకాదన్న విషయం ఊరంతా తెలుస్తుంది. కానీ అందువల్ల ఉమ, రమలకు ప్రమాదం. శాంత కోరిక అదికాదు. వాళ్ళ క్షేమాన్ని కోరే శాంత ఆత్మ త్యాగానికి తలపడింది.

ఈ ఉత్తరం సంగతి తనకు తప్ప మరెవ్వరికీ తెలియదు. ఈ విషయాన్ని రహస్యంగా ఉంచడమే మంచిది. ఎవరైనా అడిగితే పుట్టింటికి వెళ్ళిందని చెప్పవచ్చు. ఎటొచ్చీ పుట్టింటివాళ్ళు అడిగితే?

"పుట్టింటికని బయలేరింది. అంతకుమించి నాకేమీ తెలియదు...." అని చెప్పాలి.

# 8

"మిస్టర్ గోవిందరావ్! విజయ్‌ని నువ్వు ఈ రోజు సాయంత్రం అయిదు గంటలకు కొట్టావు. నా ఆఖరు హెచ్చరిక కూడా అయిపోయింది కాబట్టి నీ ఉమ, రమ ఏమవుతారో చూసుకో—"

గోవిందరావు కంగారుగా—"అబద్ధం. ఆ సమయంలో నేనింట్లో లేను. ఇంటికి నేను ఆరింటికి వచ్చాను—" అన్నాడు.

"నీ సంజాయిషీలు నేను వినను. నీ మాటలు నేను నమ్మను. ఈ రోజు రాత్రి నీ రమకు ఏం గతిపడుతుందో చూసుకో—"

"ఎవర్నువ్వు? ఎక్కణ్నించి మాట్లాడుతున్నావు?" అన్నాడు గోవిందరావు.

"ఆ వివరాలు నీకు అనవసరం. హెచ్చరిక అయిపోయింది!"

ఫోన్ క్లిక్ మంది. గోవిందరావు మతిలేనివాడిలా వెర్రి చూపులు చూశాడు. తర్వాత నెమ్మదిగా రిసీవర్ క్రెడిల్ చేసి—"విజయ్!" అని పిలిచాడు.

"ఏం డాడీ!" అంటూ పరుగెత్తుకు వచ్చాడు విజయ్.

"ఈ రోజు సాయంత్రం అయిదుగంటలకు నిన్నెవరైనా కొట్టారా?"

"లేదు డాడీ! అయా రమను ఆడిస్తూంటే— నేను, ఉమ ఆడుకుంటున్నాం—"

గోవిందరావు విజయ్‌ను మరికొన్ని ప్రశ్నలు వేశాడు కానీ ఉపయోగించే సమాచారమేదీ రాలేదు.

ఫోన్ చేసిన వ్యక్తి ఎవరు? అతడికి తప్పుడు సమాచారాన్నెవరిచ్చారు? దానినతడెలా నమ్మాడు? అతడికి విజయ్‌మీద ఆసక్తి ఏమిటి?

గోవిందరావు కాసేపు ఆలోచించి—"ఏం లాభం లేదు—శివప్రసాద్‌కి ఫోన్ చేయాలి—" అనుకున్నాడు. అనుకున్నదే తడవుగా అతడి వేళ్ళు చక-చకా పని చేశాయి.

"హాలో శివప్రసాద్ స్పీకింగ్—" అంది అవతలి కంఠం.

"శివప్రసాద్—నువ్వేనా? నేను....గోవిందరావుని మాట్లాడుతున్నాను...." అన్నాడు గోవిందరావు.

"సార్—ఏమిటి విశేషాలు!" అందా కంఠం వినయంగా.

"నీవల్ల నాకో సాయం కావాలి!"

"చెప్పండి సార్!"

"కొద్ది నిముషాల క్రితం నాకో ఫోన్ కాల్ వచ్చింది. సాయంత్రం అయిదింటికి కొట్టానుట. నా కూతురు రమను ఏదో చేస్తానని బెదిరిస్తూ మాట్లాడాడో వ్యక్తి!"

శివప్రసాద్ ఆశ్చర్యపడ్డట్టున్నాడు. అదంతా కంఠంలో ధ్వనించింది—"చాలా చిత్రంగా వుందిసార్! అలా ఎందుకు జరిగిందో!"

"ఎందుకో ఒకందుకు జరిగింది. ఈ విషయంలో నువ్వు చెయ్యగలిగింది చేయి—"

"సార్—ఇంటిదగ్గర సాయానికి మనుషుల్ని పంపించమంటారా?"

"ఇద్దర్ని పంపించు. నాకు భయంగా ఉంది!" అన్నాడు గోవిందరావు. తర్వాత అతను ఫోన్ పెట్టేసి

"ఆయా!" అని పిలిచాడు.

అతని పిలుపు వింటూనే ఆయా అక్కడకు వచ్చింది రమను ఎత్తుకుని. గోవిందరావు రెండు చేతులూ చాపగానే రమ అతడిమీదకు దూకేసింది. అతను పాపను హృదయానికి హత్తుకుని ముఖాన్ని ముద్దులతో నింపేసి ఆయావంక కృతజ్ఞతాపూర్వకంగా చూసి—"అత్యవసర పరిస్థితిలో దీని తల్లి పుట్టింటికి వెళ్ళింది. నువ్వు మూడు రోజుల్లో దీనిని చక్కగా మచ్చిక చేసుకున్నావు. నువ్వు ఇలాగే ఈ పాపకు తల్లిని మరిపించాలి. నీ ఋణం ఉంచుకోను—" అన్నాడు.

"ఇందులో ఋణానిదేముందండీ—ఇది నా వృత్తి. డబ్బు తీసుకు చేస్తున్న పనిని మీరు మెచ్చుకోవడం మీ సహృదయత. కలకాలం ఈ పాపను నేను చూడక్కర్లేదుగా. కన్న బిడ్డను విడిచి వాళ్ళమ్మ మాత్రం ఎన్నాళ్ళుండగలదు? కొద్ది రోజుల్లో ఎలాగూ వచ్చేస్తుంది—" అంది ఆయా. ఆమె చేతులు చాపగానే రమ ఆమె మీదకు దూకింది. కానీ రమ ఆయా దగ్గర ఉండలేదు. వచ్చీరాని ధ్వనులతో తండ్రిని మళ్ళీ చేయి చాపమని కోరింది.

అలా ఇద్దరిమీదకూ దూకుతూ కాసేపు ఆడుకుంది రమ.

"ఈ రోజు దాన్ని జాగ్రత్తగా కనిపెట్టుకుని ఉండు...." అన్నాడు గోవిందరావు.

"నేనీ ఇంట్లో ఉన్నన్నాళ్ళూ రమను కన్నతల్లికంటె ఎక్కువగా చూసుకుంటాను—" అంది ఆయా.

గోవిందరావు ఓ పర్యాయం కళ్ళు తుడుచుకున్నాడు. బహుశా అతడికి శాంతాదేవి గుర్తుకు వచ్చినట్లుంది.

ఆయా రమను తీసుకుని వెళ్ళిపోయింది.

తర్వాతేం చేయాలా అని ఆలోచిస్తూ ఉండిపోయాడు గోవిందరావు. అతడింకా ఆలోచనల్లో ఉండగానే ఆ ఇంటికి ఇద్దరు మనుషులు వచ్చారు. ఇద్దరూ కండలు తిరిగిన వస్తాదుల్లా ఉన్నారు.

"మమ్మల్ని శివప్రసాద్ పంపాడు—" అన్నారు వాళ్ళు.

గోవిందరావు వాళ్ళను చూసి తృప్తిగా నిట్టూర్చాడు. తర్వాత ఆయా ఉన్న గదిని వారికి చూపించి—"ఆయా చేతుల్లో ఉన్న నా పాపను మీరు ఈ రాత్రంతా కనిపెట్టి ఉండాలి. జాగ్రత్తగా ఉన్నందుకు ఎంత పారితోషికమో—అజాగ్రత్తగా ఉన్నందుకు అంత శిక్ష!" అన్నాడు.

"ఒక పనికి అంగీకరించాక పారితోషికం తీసుకోవడం మాత్రమే అలవాటు మాకు!" అన్నాడు వస్తాదుల్లో ఒకడు.

# 9

రాత్రి రెండుగంటలకు గోవిందరావు ఇంట్లో కాలింగ్ బెల్ మ్రోగింది. గోవిందరావు కంగారుగా లేచాడు.

వచ్చినదెవరై ఉంటారు? బెదిరించిన మనిషి వచ్చాడా?

వస్తాదు తలుపుతీయడానికి వెడుతూంటే గోవిందరావు ఆగమన్నాడు. ఆగంతకుడు వస్తాదుని పడగొడితే తను ఒంటరిగా మిగిలిపోతాడు. తనే వెళ్ళి తలుపుతీస్తే తనకేమైనా ప్రమాదం జరిగితే ఆగంతకుణ్ని వస్తాదు జాగ్రత్తగా ఎదుర్కొంటాడు.

ఆయా ఉన్న గదికి ఎటాచ్డ్ బాత్రూం ఉంది. బయటి నుంచి బాత్రూంలోకి ఏ వెంటిలేటర్ ద్వారానో ఆగం

తకుడు వచ్చే అవకాశముంటుందని భయపడి గోవిందరావు రెండో వస్తాదుని బయట కాపలాపెట్టాడు.

వస్తాదుకి ఏం చేయాలో చెప్పి గోవిందరావు గుమ్మం దగ్గరకు నడిచాడు. గోవిందరావు సూచన ప్రకారం వస్తాదు టెలిఫోన్ దగ్గరకు నడిచాడు.

గోవిందరావు వణుకుతున్న చేతులతో తలుపుతీశాడు. ఎదురుగా ఓ అపరిచితుడున్నాడు. అతడి ముఖానికి ఉన్న గెడ్డం, మీసాలు అతడెవరో తెలుసుకునేందుకు వీల్లేకుండా వున్నాయి.

"హలో గోవిందరావూ—నన్ను గుర్తుపట్టావా?" అంటూ చేయి జాపాడతను.

అతనెవరో గుర్తులేకపోయినా గోవిందరావు అప్రయత్నంగా చేయి జాపాడు.

ఆ వ్యక్తి షేక్‌హాండ్ ఇస్తూంటే గోవిందరావు చేతికి ఏదో గుచ్చుకున్నట్లయింది—"మోసం!" అంటూ అరిచి ఉన్నవాడున్నట్లుగా కూలిపోయాడు గోవిందరావు.

అది చూసిన వస్తాదు వెంటనే టెలిఫోన్ ఎత్తబోయాడు. అతను రిసీవర్ తీసేలోగానే ఆగంతకుడి చేతిలో రివాల్వర్ మెరిసింది. క్షణంలోనే అది పేలింది. కానీ శబ్దంలేదు. వస్తాదు మాత్రం ఉన్నవాడున్నట్లుగా కూలిపోయాడు.

ఆగంతకుడు తిన్నగా ఆయా ఉన్న గదిలోకి వెళ్ళాడు. అక్కడే రమ ఆయా ఒకరినొకరు వాటేసుకుని నిద్రపోతున్నారు. ఆగంతకుడి చేయి ఆయా మెడమీదకు వెళ్ళింది. అతడి వేలికి కట్టివున్న చిన్నసూది ఆమె మెడకు గుచ్చుకుంది. ఆమె ఒకసారి సన్నగా మూలిగి కొద్దిగా కదిలి మెడ వాల్చేసింది.

ఆగంతకుడు రమను చేతిలోకి తీసుకున్నాడు. అతడు ఎత్తుకున్నాక కూడా ఆ పాపకు మెలకువ రాలేదు. ఆగంతకుడు పాపను ఎత్తుకొని వీధిలోకి నడిచాడు. అక్కడ ఉన్న కారులో ఎక్కాడు. పాపను బ్యాక్ సీట్లో పడుకోబెట్టాడు. తను ముందు సీట్లోకి వెళ్ళాడు. కారు కదిలింది....

# 10

బాత్రూం గోడ అవతల కాపలాకాస్తున్న వస్తాదుకు చిన్న కునుకు పట్టినట్లయింది. గోడకు జారగిలబడే అతడు నిద్రపోతున్నాడు. మధ్యలో మెలకువవచ్చి ఉలిక్కిపడి లేచాడతను. కళ్ళు నలుముకుని కంగారుగా ఓసారి చుట్టూ చూసి తర్వాత పైకి చూశాడు.

బాత్రూం వెంటిలేటర్ అద్దాలు పగిలేవు.

అతడు "హమ్మయ్య" అనుకుని నిట్టూర్చి—మత్తు వదలడం కోసం ఓసారి ఇల్లు చుట్టిరావాలనుకున్నాడు.

అలా తిరుగుతూ ఓసారి ఇంట్లోకి వెళ్ళి రెండో వస్తాదుని పలకరించాలనుకున్నాడతను.

వీధి తలుపులు జేరగిలవేసి ఉండడం గమనించి ఆశ్చర్యపడి చటుక్కున తీసి ఇంట్లోకి వెళ్ళాడు. గుమ్మానికి దగ్గర్లోనే ఉన్న గోవిందరావు కనబడ్డాడు.

వస్తాదు ఉలిక్కిపడ్డాడు. కంగారుగా ఇంట్లో తిరగడంలో టెలిఫోన్ దగ్గర పడివున్న తన వస్తాదు మిత్రుడు కనబడ్డాడు.

వస్తాదు అతణ్ని కదిపి చూశాడు. వంటిమీద ఎక్కడా గాయం కనబడలేదు. మనిషికి ఊపిరి ఆడుతోంది. వస్తాదు అతణ్ని గట్టిగా కుదిపాడు. కొద్దినిమిషాలలా చేసేసరికి పడిపోయిన వస్తాదు లేచి నిలబడి—"ఏం

జరిగింది— నేనెక్కడున్నాను?" అన్నాడు.

ఇద్దరు వస్తాదులూ ఒకరి సంగతి ఒకరికి చెప్పు కున్నారు.

"మనకు శిక్ష తప్పదు!" అన్నాడు ఓ వస్తాదు.

"మాట్లాడకుండా ఇక్కణ్నించి వెళ్ళిపోతే?"

"మన బాధ్యత ఆ పాపను కాపాడ్డం? పద.... అక్కడి పరిస్థితి చూద్దాం...."

రమ అక్కడ లేకపోవడం వారు గుర్తించడానికి ఎంతోసేపు పట్టలేదు.

"ఏం చేస్తాం? ఆగంతకుడు మనల్ని మించినవాడు. ముందు గోవిందరావుగారి పరిస్థితి చూద్దాం."

ఇద్దరూ వెళ్ళి గోవిందరావును కదిపి, కుదిపి మెలకువ తెప్పించి జరిగింది చెప్పారు.

గోవిందరావుకు మళ్ళీ స్పృహతప్పినంత పనైంది.

"మీరేం చేస్తున్నారు?" అన్నాడతను కోపంగా.

"జీవితంలో మొదటిసారి ఓడిపోయాం—" అన్నాడు వస్తాదు నీరసంగా.

"నా రమ....రమ ఎలా ఉంది? క్షేమమేనా?" అన్నాడు గోవిందరావు వణుకుతున్న కంఠంతో.

ఆమె క్షేమంగా ఉంటుందన్న నమ్మకముంటే గోవిందరావు కంఠం వణికి ఉండేది కాదు.

## 11

"గోవిందరావ్! నా హెచ్చరికను నువ్వు లక్ష్య పెట్టడంలేదు. ఈ రాత్రి వచ్చి ఉమను కూడా తీసుకు పోతాను."

"వద్దు. నీకేం కావాలో చెప్పు...." అన్నాడు గోవిందరావు కోపంగా.

"నా మాట నువ్వు విననప్పుడు నీ మాట నేనెందుకు వినాలి?"

"నువ్వెవరో నాకు తెలియదు. నీకు అనుమానంగా ఉంటే విజయ్‌నే వచ్చి అడిగి తెలుసుకో. వాడు నా పిల్లలతో కలిసిమెలిసి ఆడుకుంటున్నాడు. వాడిమీద నాకేమీ పగలేదు. అసలే తల్లి దగ్గరలేక నా పిల్లలు బెంగటిల్లి ఉన్నారు. వాళ్ళను నువ్వు బాధించవద్దు—"

"నీ పిల్లలు నీకెంత ప్రాణమో—నాపిల్లాడు నాకూ అంతేకదా! ఈ రోజు ఉమను తీసుకువెళ్ళక తప్పదు—" అంది అవతల కంఠం.

"తీసుకెళ్ళి ఏంచేస్తావ్?"

"నువ్వు విజయ్‌ని హింసించడానికి రెట్టింపు హింసించి నీపై పగతీర్చుకుంటాను—"

"నేను విజయ్‌ని కంటికి రెప్పలా చూసుకుంటున్నా నంటే నమ్మవేం?"

"కట్టుకున్న పెళ్ళానికే నిజంచెప్పని నీ చరిత్ర నాకు పూర్తిగా తెలుసు. నీమాటలెందుకు నమ్ముతాను?" అవతల క్లిక్‌మంది.

గోవిందరావుకు కాళ్ళూ చేతులూ ఆడలేదు. అతను పరుగున కూతురు దగ్గరకు వెళ్ళాడు. విజయ్, ఉమ, ఏదో ఆడుకుంటున్నారు. గోవిందరావు కూతుర్ని ఎత్తుకుని— "ఓ మామయ్యగారింటికి వెడదాం, వస్తావా?" అని అడిగాడు.

"నేనూ వస్తాను—" అన్నాడు విజయ్.

గోవిందరావుకు విజయ్‌ని తన పరిచయస్థుల ఇంటికి తీసుకు వెళ్ళడం ఇష్టంలేదు. అందుకని—"నువ్వు వద్దు. ఇంట్లోనే ఉండు—" అని చెప్పి కార్లో బయల్దేరి తనకు

బాగా తెలిసిన పోలీస్ ఇనస్పెక్టర్ చంద్రశేఖర్రావు ఇంటికి వెళ్ళాడు.

"ఏమిటి విశేషాలు?" అనడిగాడు చంద్రశేఖర్రావు.

"నీకు తెలియని వేమున్నాయ్?" అన్నాడు గోవింద రావు నీరసంగా.

ఉమ పుట్టినరోజుకు ఆహ్వానం అందినా ఏవో పను లుండడంవల్ల చంద్రశేఖరరావు వెళ్ళలేకపోయాడు. అతడి భార్య మాత్రం వెళ్ళి విశేషాలు భర్తకు అంద జేసింది. వెంటనే అతడు ఫోన్ చేసి గోవిందరావును సంగ తేమిటని అడిగాడు. ఈ విషయంలో తనేమైనా సాయ పడగలనా అని కూడా అడిగాడు.

"ఎవరూ సాయపడలేరు. అంతా నా దురదృష్టం!" అన్నాడు గోవిందరావు అప్పుడు.

"నాకు తెలిసినదేముంది? నువ్వేదో దాస్తున్నావ్—" అన్నాడు చంద్రశేఖరరావు.

"అన్నీ తర్వాత చెబుతాను. నాకు తెలియని వ్యక్తి ఎవరో ఉమను తీసుకుపోతానని బెదిరిస్తున్నాడు. నాకేదో భయంగా ఉంది. ఈ రోజుకు దీన్ని నీ రక్ష ణలో ఉంచుతున్నాను. ఇంట్లో వుంచినా పోలీస్ స్టేష న్లో వుంచినా దీని రక్షణభారం నీదే!" అన్నాడు గోవిందరావు.

"అసలేమిటి కథ—" అన్నాడు చంద్రశేఖరరావు.

"ఇప్పుడు అర్జంటు పనిమీద వెడుతున్నాను. మళ్ళీ వస్తాను. అప్పుడు అన్నీ చెబుతాను...." అంటూ హడా వుడిగా అక్కణ్ణించి బయల్దేరాడు గోవిందరావు. అతడి మనసుపడే ఆరాటాన్ని సూచిస్తూ కారు చాలా

స్పీడుగా నడిచింది. అది శివప్రసాద్ ఇల్లు చేరడానికి ఎంతోసేపు పట్టలేదు.

# 12

శివప్రసాద్ గోవిందరావుని సాదరంగా ఆహ్వానించాడు.

"ఎక్కడో ఏదో మోసం జరిగింది!" అన్నాడు గోవిందరావు.

"ఏమైంది?"

"రాత్రి రమ మాయమైంది. డేర్ డెవిల్ కిడ్నాపింగ్—" అన్నాడు గోవిందరావు. అతడి కంఠం విన్నా ముఖం చూసినా ఏడ్వడానికి సిద్ధంగా ఉన్నాడని పిస్తోంది.

శివప్రసాద్ చాలా ఆశ్చర్యపడ్డాడు—"మరి నేను పంపిన వస్తాదులేమైనారు?"

"సారీ చెప్పి వెళ్ళిపోయారు!"

శివప్రసాద్ ఆలోచనలో పడ్డాడు.

గోవిందరావు తీవ్రంగా శివప్రసాద్ వంక చూసి—"నాకు నా రమ కావాలి!" అన్నాడు.

"నా శాయశక్తులా ప్రయత్నిస్తాను సార్!" అన్నాడు శివప్రసాద్.

"ప్రయత్నించడంకాదు. నాటకాలు కట్టిపెట్టు. రమ లేనిదే నేను బ్రతకలేను. నా చిట్టితల్లి నాక్కావాలి. నువ్వే దాన్ని మాయం చేశావని నాకు తెలుసు."

"సార్!" అన్నాడు శివప్రసాద్ కంగారుగా.

"నీకు తప్ప ఇంకెవరికీ ఆ అవకాశంలేదు. అవసరమూ లేదు...."

"ఆఖరికి మీరు నన్ను అనుమానిస్తున్నారా?" అన్నాడు శివప్రసాద్ దీనంగా.

"బాగా ఆలోచించి ఎవర్ననుమానించాలో నువ్వే చెప్పు!" అన్నాడు గోవిందరావు.

"అవకాశం నాకున్నమాట నిజమే! కానీ అవసరం... నాకేమిటి?"

"అవసరంలేకేం? ఉమ, రమ లేకుంటే విజయ్ ఒక్కడే నాకు మిగుల్తాడు...." అన్నాడు గోవిందరావు.

"పిల్లలంటే మీకున్న సెంటిమెంటు బాగా తెలిసిన వాణ్ని. వాళ్ళ జోలికి నేనెందుకు వెడతాను సార్! అసలుకే మోసం తెచ్చుకునేంత తెలివితక్కువవాణ్ని కాను నేను...." అన్నాడు శివప్రసాద్.

"నువ్వు కాకపోతే మరెవ్వరై ఉంటారు?" అన్నాడు గోవిందరావు.

శివప్రసాద్ ఆలోచనలో పడ్డాడు. ఈ కేసులో మూడో వ్యక్తి ప్రమేయం ఎలా వచ్చిందో అతడికీ అంతు బట్టడంలేదు—"సార్! ఎలా ప్రవేశించాడో మన వ్యవహారంలోకి మూడో వ్యక్తి ప్రవేశించాడు. అతనెవరో అంతుబట్టడంలేదు నాకు...." అన్నాడతను.

"నేనే ఆ మూడో వ్యక్తిని...." అంటూ తలుపు చాటునుంచి ఓ వ్యక్తి ప్రవేశించాడక్కడికి.

ఇద్దరూ కంగారుగా లేచినిలబడ్డారు—"ఎవరున్నవ్?" అన్నాడు గోవిందరావు.

"నేనెవరో తర్వాత చెబుతాను. ముందు మీరు నేనడిగే ప్రశ్నలకు జవాబు చెప్పండి!" అన్నాడతను.

"చెప్పకపోతే?"

"మిస్టర్ గోవిందరావ్—చంద్రశేఖరరావు ఇంటికి

ఫోన్ చేసి ఉమ వుందో లేదో కనుక్కో. లేదని చెబుతారు. అప్పుడు నాతో మాట్లాడుదువుగాని..." అన్నాడావ్యక్తి.

గోవిందరావు కంగారుగా చంద్రశేఖరరావు ఇంటికి ఫోన్ చేసి కబురు విని కంగారుపడిపోయాడు చంద్ర శేఖరరావు, గోవిందరావు వెనకనే ఏదో పనిమీద బయల్దేరాట్ట. అతడలా వెళ్ళగానే ఓ వ్యక్తి మెరుపులా వచ్చి ఉమను తీసుకుని వెళ్ళిపోయాట్ట. చంద్రశేఖరరావు భార్య పోలీస్ స్టేషన్‌కి ఫోన్ చేసిందట.

"ఎవర్నువ్వు?" అన్నాడు గోవిందరావు వణుకుతున్న కంఠంతో.

"చెబుతాను. కానీ ముందు నా ప్రశ్నలకు జవాబు కావాలి!"

"అడుగు...."

"విజయ్ ఎవరు?"

"నిజానిజాలు నాకు తెలియవు. శాంతకు వివాహం ముందు పుట్టిన బిడ్డ అని పదిమందిలోనూ ఉండగా ఒకడామెకు బిడ్డను అందించాడు. ఆమె ఆ మాటల్ని ఖండించలేదు—...." అన్నాడు గోవిందరావు.

"అలాగా—మరి విజయ్‌ని కొట్టడానికి వీల్లేదని నీకు బెదిరింపులెందుకొస్తున్నాయి?"

"ఏమో— తెలియదు...."

ఆ వ్యక్తి చేతిలో రివాల్వర్ మెరిసింది—"నేను మిమ్మల్ని చంపను. కానీ వికలాంగుల్ని చేస్తాను. ఇదేగతి కొన్ని క్షణాల తర్వాత నీ బిడ్డలకూ పడుతుంది. అసలు సంగతి ఏమాత్రం పొల్లుపోకుండా నాకు చెప్పాల్సిందే! నిజం నాకు తెలియదని అనుకోకండి. మీ నోట చెప్పించాలన్నదే నా తాపత్రయం...."

"ఏమిటి నీకు తెలిసిన ఆ నిజం?"

"ఉదాహరణకు విజయ్ శాంతకు పుట్టాడన్నావు.... అదీ పెళ్ళికిముందు. విజయ్ మీ పెళ్ళికి ముందు పుట్టిన మాట నిజమే....కానీ వాడు శాంత బిడ్డకాదు. నీ బిడ్డ అంటాను. నాకు తెలిసిన ఎన్నో నిజాల్లో ఇది మొదటిది!"

గోవిందరావు కంగారుపడ్డాడు. శివప్రసాద్ ముఖంలో అయితే భయమే మే వెలసింది. ఇద్దరూ ఏక కంఠంతో— "ఎవర్నువ్వు?" అన్నారు.

"ఇంకా సమయం రాలేదు. ముందు నే నడిగిందానికి చెప్పండి...."

గోవిందరావు కుర్చీలో కూలబడి శివప్రసాద్ వంక నిస్సహాయంగా చూశాడు. శివప్రసాద్ కథ చెప్పడానికే నిర్ణయించుకున్నాడు. అతను చెబుతూంటే ఆ వ్యక్తి వింటూ నిలబడ్డాడు.

శివప్రసాద్ అక్క పద్మినికీ, గోవిందరావుకీ పుట్టిన అక్రమ సంతానం విజయ్. పద్మినిని గోవిందరావు మోసం చేశాడు. తనజోలికి రాకుండావుంటే ఆమెకు పుట్టిన బిడ్డకు మంచి భవిష్యత్తుండేలా చేస్తాననీ, ఆమె పెళ్ళి ఖర్చులు తను భరిస్తాననీ అన్నాడు. పద్మిని తమ్ముడు శివప్రసాదుకు కాస్త గోవిందరావులాంటి వాళ్ళ అండ కావాలి. అన్నివిధాలా అంగీకరించి పద్మిని గోవిందరావు షరతులకు అంగీకరించింది. ఫలితంగా విజయ్ అనాథ శరణాలయంలో పెరిగాడు చాలా కాలం.

గోవిందరావుకు అనుభవించిన స్త్రీపై సెంటిమెం టున్నా లేకపోయినా తనకు పుట్టిన బిడ్డలంటే మాత్రం సెంటిమెంటు. విజయ్ అనాథ శరణాలయంలో పెరగడం అతడికి చాలా బాధగా వుంది. అందుగురించి అతడు

మథనపడసాగాడు.

"అంగుకీ చెత్తపథకం ఎందుకు? ఓ ఆడదాన్ని మానసికంగా హింసించడమెందుకు? నీ భార్య శాంతాదేవికి విశాలహృదయముంది. నీ వెధవ చరిత్రను చెప్పుకుని ఏడిస్తే ఆమె నిండు హృదయంతో క్షమించి వుండేది కదా! ఆ బిడ్డను మనస్ఫూర్తిగా ఆదరించి చేరదీసేది కదా!" అన్నాడు ఆ వ్యక్తి.

తర్వాత కథ చెప్పడానికి శివప్రసాద్ని మళ్ళీ హెచ్చరించవలసి వచ్చింది. ఈ భాగాన్నతడు చాలా ఇబ్బందిపడుతూ చెప్పాడు. ఆ వ్యక్తి ఏ భావమూ లేకుండా వింటున్నాడు.

ముందు విజయ్ని ఇంట్లో అలా ప్రవేశపెట్టాలనే అనుకున్నారు. కానీ ఈలోగా గోవిందరావు కన్ను శివప్రసాద్ చెల్లెలు సుభద్రపై పడింది. అంతవరకూ వారి పథకం ఏమిటంటే—శాంతాదేవికింక ఎలాగూ పిల్లలు పుట్టారు కాబట్టి, వాళ్ళకెలాగూ మగపిల్లలు లేరు కాబట్టి నిజం చెప్పో, చెప్పకో విజయ్ని ఇంట్లో ప్రవేశపెట్టాలి. అయితే గోవిందరావు కన్ను సుభద్రమీద పడడంతో పథకం మార్చాల్సివచ్చింది.

సుభద్ర అపురూప సౌందర్యవతి మాత్రమే కాదు. పద్మినికంటే తెలివైనది. గోవిందరావుకు తన్ను వివాహం చేసుకునే ఉద్దేశ్యంలేదని ఆమె గ్రహించింది. గోవిందరావును వివాహం చేసుకోవడానికి ఆమెకు అభ్యంతరము లేదు. అందువల్ల ఆమె గోవిందరావు వలలో పడలేదు. అలాగని ఊరుకోకుండా ఒంటరి సమయాల్లో అతణ్ని రెచ్చగొట్టి ఊరించి అందకుండా పోతూవుండేది. క్రమంగా గోవిందరావుకు సుభద్రపై ఆకర్షణ పెరిగింది.

అతడామె వలలోపడ్డాడు. ఆమెను వివాహం చేసుకోవా లనుకునే సితికి వచ్చాడు. వారి వివాహానికి శాంతాదేవి మాత్రమే అడ్డు.

ఈ వివాహం శివప్రసాద్‌కీ ఆమోద యోగ్యమే అయింది. గోవిందరావువంటి ధనవంతుడితో తనకు సంబంధ బాంధవ్యాలు గట్టిపడతాయి. అక్కాకొడుకు కాబట్టి విజయ్‌కి మంచి రక్షణ ఉంటుంది.

అప్పుడే ముగ్గురి బుర్రలూ పని చేశాయి. విజయ్‌ని ఇంట్లో ప్రవేశపెట్టడంతోనే శాంతాదేవికి మానసిక హింస ప్రారంభం కావాలి. ఆఖరికి ఆమె ఆత్మహత్యకు సిద్ధపడాలి.

విజయ్‌ని కొట్టడమూ, ఆ విషయమై టెలిఫోన్లు రావడమూ ముందుగా నిర్ణయించుకున్న పథకాలు. సమాజం, గోవిందరావు అక్కలాంటివారు తమకు తెలియకుండానే తమ సహజపద్ధతిలో ఈ పథకానికి సహకరించారు.

శాంతాదేవి ఆత్మహత్య చేసుకుంది.

కానీ విజయ్ గురించిన టెలిఫోన్లు ఆగలేదు.

ఎవరు చేస్తున్నారు? ఎందుకు చేస్తున్నారు?

"శాంతాదేవి మీరనుకున్నంత తెలివితక్కువది కాదు. మనసు చెదిరి ఆమె పుట్టిలు చేరి తన దీన గాథ చెప్పుకుంది. ఆమె తమ్ముడు నా దగ్గరకువచ్చి ఈ కథంతా చెప్పాడు. చంటిపిల్లను వదిలి ఉండలేకపోతోందామె. ఆమె సమస్యంతా విన్నాక— నాకో ఉపాయం తోచింది. ఇంకా విజయ్ పేరుతో టెలిఫోన్స్ చేసి—ఈ పథకంలో ఎవరున్నారో వారిని కంగారుపెట్టవచ్చు. అలాగే కిడ్నాపింగ్ పేరుతో పిల్లన్నెత్తుకుపోయి తల్లి దగ్గరకు చేర్చవచ్చు...."

"శాంత బ్రతికేవుందా!" ఉత్సాహంగా అన్న గోవిందరావు ముఖం అంతలోనే పాలిపోయింది. తను ఇప్పుడు శాంత బ్రతికిఉంటే మాత్రం ఆమెకు తన ముఖాన్నెలా చూపించగలడు?

"నీ దురదృష్టంకొద్ది ఆమె ఇంకా బ్రతికే ఉంది. నీ అదృష్టమేమిటంటే ఇప్పుడు నీ కథంతా విని కూడా ఆమె నిన్ను క్షమించవచ్చు...." అని ఆ వ్యక్తి ఆగి— "గోవిందరావూ! పెళ్ళిచేసుకున్నవాడు పిల్లలొక్కర్నే ప్రేమిస్తే చాలదయ్యా—పెళ్ళాన్ని కూడా ప్రేమించాలి!" అన్నాడు.

గోవిందరావు ఏమీ మాట్లాడలేదు.

"ఇన్ని ఘోరాలు జరిగినా నువ్వు కిక్కురుమనక పోవడమూ, పోలీసులకు ఫిర్యాదుచేయకపోవడమూ నాకు నీమీద అనుమానాన్ని కలిగించాయి. నేను రంగంలోకి దిగగానే నువ్వు శివప్రసాద్ చుట్టూ తిరగడంతో కథంతా మీ ఇద్దరిమధ్యనే ఉన్నదనిపించింది. చేసిందేదో చేసావుగానీ—తక్షణం పరుగెత్తుకుని నీ భార్య దగ్గరకు వెళ్ళు. చంద్రశేఖరరావు సహకారంతో నీ కూతురు ఉమ కూడా ఈపాటికి ఆ ప్రయాణం దారిలో ఉంటుంది—" అన్నాడు ఆ వ్యక్తి.

"ఇంతకీ....నువ్వు....మీరు....మీరెవరు?" అన్నాడు గోవిందరావు.

"నన్ను డిటెక్టివ్ వెంకన్న అంటారు!" అని ఆ వ్యక్తి అక్కణ్ణించి చర-చరా వెళ్ళిపోయాడు. వెళ్ళే టప్పుడు అతని చేతిలోని మినీ టేప్ రికార్డర్‌ను గోవింద రావు, శివప్రసాద్ కూడా చూశారు.

— :ఐపోయింది :—

# అల్పాయుష్కుడు?

వాణిశ్రీ

జగదాంబా జ్యూవెలరీ షాపులో వాళ్ళు ఆమె వంక కన్నార్పకుండా చూస్తున్నారు.

ఆమె ఎర్రటి నైలెక్స్ చీరకు ఎర్రటి పువ్వుల బార్డర్ వున్న చీరతో, ఎర్రటి పోలిస్టర్ బ్లౌజుతో, ఎర్రటి గులాబీలు జడలో తురుముకుని, దివినుండి దిగివచ్చిన దేవ కన్యలా వుంది.

ఆమె హేండ్ బ్యాగ్ కూడా ఎర్రగా కొట్టుకుంటున్న గుండెలా కదుల్తోంది.

సేల్స్‌మాన్ చూపించిన వుంగరాలేవీ ఆమెకు నచ్చలేదు.

"కిరీటం మోడల్‌లో వున్న రింగ్ కావాలి" వీణ మీటినట్టుగా అంటూ నాజూకుగా కదిలింది ఆమె.

ఆమెను చూస్తుంటే అతని గుండె లయతప్పుతోంది.

"అటువంటివి లేవా?" ప్రశ్నించింది ఆమె.

"నో మేడమ్! కావాలంటే ఆర్డర్ మీద తయారు

చేయించి ఇస్తాం" అన్నాడు అతను తేరుకుని.

"ఎంత టైం తీసుకుంటారు?"

"ఎంతో టైం ఎందుకు? ఈవాళ ఆర్డర్ ఇస్తే రేపు ఇచ్చేస్తారు" ఆమె వెనుకనుంచి వచ్చాయి ఆ మాటలు.

ఆమె తల గిర్రున త్రిప్పింది త్రాచుపాములా.

అతను నవ్వాడు.

ఆమె అతన్ని చూసి సిగ్గుతో మొగ్గలా ముడుచుకు పోయింది. ఎర్రటి ముఖం మరింత ఎరుపెక్కి ఎర్రటి లైటు ఫోకస్ చేసినట్లయింది.

"సైజు తీసుకుని క్రౌన్ సైజు రింగ్ తయారుచేయండి. రేపు ఈవెనింగ్ కల్లా ఇవ్వాలి" అన్నాడు అతను.

"యస్సార్" అన్నాడు సేల్స్‌మాన్ ఆమె వేలుసైజు తీసుకుని.

అతను పర్స్‌తీసి వంద కాగితం అందించి "అడ్వాన్సు తీసుకోండి" అన్నాడు.

సేల్స్‌మాన్ రశీదు పుస్తకంతీసి "పేరు చెప్పండి" అన్నాడు.

ఆమె సిగ్గుపడుతూ వుంది. సిగ్గుతో ఆమె గొంతు పెగలడంలేదు.

సేల్స్‌మాన్ వింతగా చూస్తున్నాడు. చివరకు అతనే చెప్పాడు.

"ఫణి రాజకుమారి" అన్నాడు.

"రింగ్‌లో ఏ రంగురాళ్ళు వెయ్యమంటారు?"

"తెల్లరాళ్ళ మధ్య ఎర్రరాయి" అన్నాడు అతను ఆమె టేస్టు తెలిసిన వాడికివలె.

ఆమె తల వూపింది.

అతను రశీదు తీసుకుని జేబులో పెట్టుకున్నాడు.

"పద...." అన్నాడు.

ఇద్దరూ షాపులోనుంచి బైటకువచ్చారు.

ఆమె అటూ ఇటూ దిక్కులు చూస్తోంది.

"ఫణీ...." అన్నాడు అతను.

ఆమె తల వంచుకుని "వూఁ...." అంది.

"హోటల్ కెళ్దామా?" అన్నాడు.

"వుహుఁ...." అంది ఆమె.

"ఏం?"

"బాగుండదు....ఎవరైనా చూస్తే...." నెమ్మదిగా అంది.

అతను నవ్వాడు.

"బాగుంది ఫణీ. ఈవాళ ఇరవై రెండో తారీఖు. రెండో తారీఖున పెళ్ళి. గట్టిగా పదిరోజులు లేదు. ఇంతలోకే ఎవరేమనుకుంటారు?" అన్నాడు అతను.

ఆమె మాత్రం "వుహూఁ...." అంటూనే ఆటో కేకేసింది.

ఆటోలో కూర్చుని ఆమె అతనివంక చూసింది క్రీగంట.

అతను నవ్వుతూ చెయ్యి వూపాడు.

ఆటో కదిలింది.

గాలిలో తేలిపోతున్నట్లు పోతోంది ఆటో. ఆటో కంటే వేగంగా కదులుతున్నాయి ఆమె మనసులో మధుర మైన వూహలు.

'ఎంత బాగున్నాడు విజయ్!' అనుకుంది.

అతని రూపం కళ్ళముందు కదుల్తోంది. చెవుల్లో మంగళవాద్యాలు మ్రోగుతున్నాయి.

రాబోయే ఆ రోజు.... పెళ్ళిరోజు ఎంత తొందరగా

వస్తే అంత బాగుండును అనుకుంటోంది ఆమె.

ఆమె ఆటో దిగింది 'ఫణి నివాస్' ముందు. ఆ మేడ పైన రెండో అంతస్తు పిట్టగోడకున్న అక్షరాలు ఎర్రగా మెరుస్తున్నాయి 'ఫణి నివాస్' అని.

ఆమె పుట్టాక అదృష్టం కలిసివచ్చిందనే నమ్మకంతో ఆ మేడకు ఆమె పేరు పెట్టాడు తండ్రి.

ఆటోరిక్షా వెళ్ళిపోయాక పోస్టుమన్ వస్తూ కనిపించాడు.

ఆమె వాచీవంక చూసింది. పన్నెండు దాటి పది నిముషాలైంది.

వెడ్డింగ్ కార్డులు ప్రింటైన అప్పటికి పదిహేనురోజులు దాటింది. ముఖ్యమైన ఫ్రెండ్స్‌కి పర్సనల్ లెటర్స్ వ్రాస్తూ వెడ్డింగ్ కార్డులు జతచేసి అప్పుడే పోస్టుచేసింది. వాళ్ళనుంచి ఏవైనా లెటర్స్ రావచ్చు అనుకుంటూ అక్కడే నిల్చుంది పోస్టుమన్‌వంక చూస్తూ.

పోస్టుమన్ టపా ఇచ్చాడు. ఆత్రంగా అడ్రసులు చూసింది. అన్నీ ఆమె తండ్రికే వున్నాయి. నిరాశపడింది.

"రిజిష్టర్ పోస్టు ఒకటి వుందమ్మా!" అన్నాడు పోస్టుమాన్.

"నాన్నగారిని పిలుస్తాను వుండు" ఆమె లోపలికి పోబోయింది.

"నాన్నగారికి కాదమ్మా! మీకే" అన్నాడు.

ఆమె ఆశ్చర్యంగా చూసింది.

"నాకా!" ఆశ్చర్యంతో అంది.

"అవునమ్మా!" అంటూ అతను కవరు అందించాడు.

ఫ్రమ్ అడ్రస్ చూసింది. 'రామనాథం' అని వుంది.

'ఎవరబ్బా ఈ రామనాథం?' అని ఆమె మనసులో

ప్రశ్నించుకుంటూనే సంతకం చేసింది.

ఆమె మనసులో ఆలోచనలు సుళ్ళు తిరుగుతున్నాయి. వేగంగా అడుగులు వేస్తూ తన గదిలోకి వెళ్ళి ఫ్యాన్ ఆన్ చేసి బెడ్ మీద పడుకుని కవరు విప్పింది.

"ప్రియమైన చెల్లీ ఫణి రాజకుమారీ!

నీకు మున్సిపల్ ఛైర్మన్ గారి అబ్బాయి విజయ్‌తో పెళ్ళి నిశ్చయమైందని తెలిసి సంతోషించడం లేదు. ఎంతో విచారిస్తున్నాను. విజయ్ అందగాడే. ఒడ్డూ పొడుగూ వుండి హీరోలా వుంటాడు. నాకు తెలుసు.

కాని పాపం అతను అల్పాయుష్కుడు. అతను నువ్వనుకున్నంత మంచివాడు కాదు. ధనగర్వంతో, అధికార మదంతో ఎన్నో పాపాలు చేశాడు. ప్రస్తుతం ఆ పాపాల పడగ నీడలో పయనిస్తున్నాడు. ఆ పడగ ఏ క్షణంలోనైనా బుస కొట్టి కాటు వేయవచ్చు. అతని ఆయుష్షు రోజుల్లోనే వుంది.

చెల్లీ! అల్పాయుష్కుణ్ని పెళ్ళిచేసుకుని నిండు నూరేళ్ళ జీవితాన్ని చేజేతులా పాడుచేసుకోకు.

ఆలోచించుకో, మేలుకో, జాగ్రత్తపడు.

ఈ పెళ్ళి నీ పాలిట వురిత్రాడు కాకుండా చూసుకో.

—నీ ప్రియమైన అన్నయ్య,
వల్లకాటి రామనాథం."

అదంతా చదివి ఫణి ముఖం చెమటపట్టింది.
'అమ్మా' అని గావుకేక పెట్టింది.

# 2

వల్లకాటి రామనాథం రాసిన వుత్తరం చదివి విజయ్ తండ్రి అప్పలనాయుడు కంగారుపడలేదు. తాపీగా చుట్ట వెలిగించుకుని గుప్పుగుప్పున పొగవదిలాడు.

సాలోచనగా కాబోయే వియ్యంకుడు వెంకటస్వామి వైపు చూసి "మరి నువ్వు ఏమనుకుంటున్నావ్?" అన్నాడు అప్పలనాయుడు.

"నాకేం తోచడంలేదు. అమ్మాయి దిగులుపడి పోయింది. ఇక మీ చెల్లెలు ఏడుపు మొదలెట్టింది. నాకు బుర్ర తిరిగిపోయి నీ దగ్గరికి పరిగెత్తుకొచ్చాను" అన్నాడు వెంకటస్వామి.

"ఇది ఆకాశరామన్న వుత్తరం" అన్నాడు అప్పల నాయుడు.

"అందులో వల్లకాటి రామనాథం అని వుందిగా!"

"నీ తెలివి తెల్లారినట్లేవుందోయ్ బామ్మర్ది" అని పక-పక నవ్వాడు అప్పలనాయుడు. నవ్వినవ్వి ఆయాసం తీర్చుకుని "ఆకాశరామన్న తమ్ముడే వల్లకాటి రామ నాథం అంటేను" అన్నాడు.

"నాకేమిటో భయంగా వుంది బావా!" అన్నాడు వెంకటస్వామి.

"ఇదంతా మన అపోజిషన్ పార్టీ సుబ్బరాజు రాయించి వుంటాడు."

"సుబ్బరాజు ఎందుకు రాయించుతాడు?"

"ఎందుకేంటి? నువ్వూ నేనూ వియ్యమందితే మరిక ఈ మున్సిపాలిటీ ఛైర్మన్ సీటు అపోజిషన్ వాళ్ళకి దక్కదని భయపడి రాయించి వుంటాడు."

వెంకటస్వామి ఆలోచనలోపడ్డాడు.

"నువ్వేం భయం పెట్టుకోకు. ఇన్నాళ్ళూ మనం విరోధంగా వున్నాం. అయినా ఎలాగో నెగ్గుకొచ్చి ఛైర్మన్ పదవి నిలుపుకొస్తున్నాను. ఇక మనం ఒకటైతే వెయ్యి జన్మలెత్తినా సుబ్బరాజు ఛైర్మన్ కాలేడు. నా తర్వాత మావాడు ఛైర్మన్ కాకతప్పదు. అదుగో అందుకు సుబ్బరాజు ఏసిన ఎత్తు ఇది" అన్నాడు అప్పల నాయుడు.

"అంతేనంటావా?" అన్నాడు వెంకటస్వామి.

"అంతగాక మరింకెంత? ఆ ఉత్తరం చదివితే తెలిసి పోడం లేదా కతంతా! ఎవడో ఈ పెళ్ళి చెడగొట్ట డానికి ఏసిన ప్లానని" గట్టిగా అన్నాడు అప్పలనాయుడు.

వెంకటస్వామి మౌనం వహించాడు. అతని మనసు గందరగోళంగా వుంది. ఆ ఉత్తరం తల్చుకుంటేనే వికారంగా వుంది. అల్లుడు అల్పాయుష్కుడని తెలిసి తెలిసి పిల్లనివ్వడం ఎలా? శుభలేఖలు అచ్చయి పోయాయి. కట్నంలో కొంత అడ్వాన్సుగా ఇచ్చాడు. ఈ పరిస్థితిలో పెళ్ళి ఆపడం ఎలా?

"నీకైతే ఇలా ఉత్తరాలు రాశారు. నాకైతే ఫోన్ చేస్తున్నారు రోజూ!" అన్నాడు అప్పలనాయుడు.

"ఎవరు?"

"ఏమో! ఏ వల్లకాటి రామనాథమో, ఆకాశ రామన్నో? ఎవరని చెప్పగలం?"

"ఏమని చేస్తున్నారు?"

"ఎందుకలే అవన్నీ వింటే బాధపడతావు?"

"ఫరవాలేదు చెప్పు" అన్నాడు వెంకటస్వామి.

"నీ కూతురు మంచిది కాదట. రెండుసార్లు కడుపు తీయించుకుందట" వదలకూడని మాట వదిలాడు.

ఆ మాటలు వింటూనే వెంకటస్వామి ముఖం కోపంతో కందగడ్డ అయింది.

"అవన్నీ నేను నమ్ముతానా! ఎలాగైనా ఈ పెళ్ళి చెడగొట్టాలని వాళ్ళ ఎత్తులు" అన్నాడు అప్పల నాయుడు కుటిలంగా నవ్వుతూ.

అప్పలనాయుడు సుబ్బరాజుతో వైరం గురించి వివరంగా చెప్పాడు. ఈ పెళ్ళి జరిగినందువల్ల ఎక్కువ నష్టం అతనికే గనుక అతనే ఈ కుట్రపన్నాడని ఘంటా పథంగా అప్పలనాయుడు చెప్పాక వెంకటస్వామికి నిజమేననిపించింది.

వెంకటస్వామికి గుండె ధైర్యం వుందిగాని అతని భార్య అనంతలక్ష్మి మాత్రం ముక్కు చీదుకుంటూ, కళ్ళు తుడుచుకుంటూ వుంది. ఈ పెళ్ళిమాత్రం జరిగేదానికి వీల్లేదని పట్టుపట్టింది. ఫణి రాజకుమారి శోకదేవతలా ఏడుస్తూ బెడ్ మీదనుంచి లేవడంలేదు.

అప్పలనాయుడు సరిచెప్పే వెంకటస్వామి సర్దుకున్నాడుగాని వెంకటస్వామి చెప్తే మాత్రం అతని భార్య ససేమిరా సర్దుకోవడంలేదు.

వెంకటస్వామికి ముందు నుయ్యి, వెనుక గొయ్యిలా వుంది. హాల్లో పచార్లు చేస్తున్నాడు ఏం చెయ్యాలో తోచక. అతని భార్య మాత్రం జోరీగలా గొణుగుతూనే వుంది.

"అయితే ఇప్పుడు నన్నేంచేసి చావమంటావు?" అని విరుచుకు పడ్డాడు వెంకటస్వామి అసహనంగా.

"అబ్బాయి జాతకం తీసుకుని రమ్మనండి వాళ్ళ నాన్నని. మన రామశాస్త్రులు చూసి చెప్తాడు. అసలు ముందే జాతకాలు చూసుకోకుండా ముహూర్తాలు పెట్టు

కోవడం మన తప్పు" అంది.

వెంకటస్వామి టెలిఫోన్ ఎత్తి రింగ్ చేశాడు.

అవతల అప్పలనాయుడు పలికాడు.

"నాయుడూ! మీ చెల్లెలు ఒకటే గొడవచేస్తున్న దయ్యా! అబ్బాయి జాతకం తీసుకుని వెంటనే బయల్దేరి రా!" అన్నాడు.

అవతల అప్పలనాయుడు సరేనన్నాడు. రామశాస్త్రిని రమ్మని నౌకరుతో కబురుచేశాడు వెంకటస్వామి.

రామశాస్త్రి తన సరంజామాతో హడావుడిగా వచ్చేశాడు. తర్వాత అప్పలనాయుడూ వచ్చాడు కొడుకు నక్షత్రం, జాతక చక్రం వగైరా తీసుకుని.

"మాడు పంతులూ! ఎవడో మనవంటే గిట్టనోడు అబ్బాయి అల్పాయుష్కుడని వుత్తరం రాసి పడేశాడు అమ్మాయికి. మగవాళ్ళవంటే ధైర్యంగా వున్నాం. ఆడాళ్ళుగదా బెంబేలెత్తిపోతున్నారు. జాగ్రత్తగా చూడు అబ్బాయి జాతకం. సెంట్రల్లో మినిష్టరైపోతాడని అందులో వుంటే...." అన్నాడు అప్పలనాయుడు.

రామశాస్త్రి గ్రహబలం, రాసిఫలితాలు చూస్తూ కూడికలూ, తీసివేతలూ వేస్తూ కూర్చున్నాడు. అంతా సస్పెన్స్ సినిమా చూస్తున్నట్లు నిశ్శబ్దంగా మాటా పలుకూ లేకుండా అతనివంక రెప్పలు కొట్టడం మానేసి చెవులు రిక్కించి కూర్చున్నారు.

ఇంతలో టెలిఫోన్ మ్రోగింది.

వెంకటస్వామి లేచి వెళ్ళి రిసీవర్ ఎత్తి "హలో.... వెంకటస్వామిని మాట్లాడుతున్నాను" అన్నాడు.

అవతల వ్యక్తి చెప్పిన విషయం విని వెంకటస్వామి ముఖం నల్లగా మాడిపోయింది.

"నాయుడూ! రావయ్యా! అక్కయ్య మాట్లాడుతూ వుంది. లీలామహల్ దగ్గర మోటార్ సైకిల్ యాక్సిడెంటయిందట. విజయ్‌ని హాస్పిటల్లో చేర్పించారట" అన్నాడు వెంకటస్వామి రిసీవర్ ఎత్తి పట్టుకుని.

అప్పలనాయుడు ఎగిరిపడి ఒక్క అంగలో టెలిఫోన్ దగ్గరికెళ్ళి రిసీవర్ అందుకున్నాడు.

రామశాస్త్రి దీర్ఘంగా నిట్టూర్చాడు.

"అబ్బాయికి రెండు గండాలున్నాయి. అవి తప్పితే అద్భుతమయిన జాతకం" అన్నాడు.

"మీరు లక్ష చెప్పండి. ఈ సంబంధం నేను చస్తే ఒప్పుకోను" అని గట్టిగా అరిచింది అనంతలక్ష్మి.

"అబ్బ! కాస్త ఆగవే...." అన్నాడు వెంకటస్వామి ఇబ్బందిగా అప్పలనాయుడివంక చూస్తూ.

"ఈ పెళ్ళి చేస్తే నేను వురిపోసుకుని చస్తాను" అని గట్టిగా కేకలేసుకుంటూ నిష్క్రమించింది అనంతలక్ష్మి.

అప్పలనాయుడు టెలిఫోన్ విసురుగా పడేసి పెద్ద పెద్ద అంగలేసుకుంటూ వెళ్ళిపోయాడు. వెంకటస్వామి అతన్ని అనుసరించాడు.

రామశాస్త్రి బొమ్మలా ఒక్కడే హాల్లో కూర్చుండిపోయాడు.

## 3

హాస్పిటల్ స్పెషల్ రూమ్‌లో మూలుగుతూ పడుకుని వున్నాడు విజయ్.

అతని చేతికి పిండికట్టు కట్టివుంది. అక్కడక్కడా ప్లాస్టరు అతికించి వున్నాయి. మోటార్ సైకిల్ యాక్సిడెంట్‌లో అతని కుడిచేతి ఎముక విరిగింది.

వారం రోజులుగా అతను బెడ్ మీద వుంటే ఒక్క సారిగూడా ఫణిరాజకుమారి రానందుకు అతనికి యెంతో బాధగా వుంది. వెంకటస్వామి మాత్రం ఒకటి, రెండు సార్లు వచ్చి పరామర్శించిపోయాడు. కాబోయే అత్తగారు కనీసం తొంగిచూడలేదు.

పెళ్ళి ఇంకా నాలుగురోజులేగా వుంది. అప్పటికి తనచెయ్యి సెట్ రైట్ అవుతుందా?

ఎలా అవుతుంది?

ఒకవేళ పెళ్ళి పోస్టుపోన్ చేస్తారేమో? నాన్న యే సంగతీ చెప్పలేదే?

విజయ్ బుర్రలో రకరకాల సందేహాలు మొలకెత్తుతున్నాయి.

అలాగే ఆఫీసులో కూర్చున్న అప్పలనాయుడి బుర్ర తిరిగిపోతోంది ఆలోచనలతో.

టెలిఫోన్ మ్రోగి అతని ఆలోచనలకు అంతరాయం కలిగించింది.

విసుగ్గా తీశాడు రిసీవర్. పెళ్ళి ఆగిపోయిన సంగతి తెలిసి అడ్డమయిన ప్రతివాడూ ఫోన్ చేసి అడిగేవాడే. చెప్పలేక ప్రాణం పోతోంది అతనికి.

"ఛైర్మన్ గారా! నమస్కారం సార్!"

"నమస్కారం....నమస్కారం"

"అబ్బాయి హాస్పటల్లో వున్నాడుగదా! ఎలావుంది యిప్పుడు?"

"ఫరవాలేదండీ కోలుకుంటున్నాడు."

"కోలుకుంటాడు లెండి. చెయ్యి మాత్రమేగా విరిగింది."

"ఆఁ .... ఏదో దేవుడిదయవల్ల అంతటితో సరి

పోయింది."

"అవును మీరు చేసిన పుణ్యం వూరికేపోతుందా? అన్నట్లు అబ్బాయి కోలుకున్నాక మీ బిజినెస్ వ్యవహారాలకి దూరంగా వుంచండి."

"అంటే...."

"అదే మీ సినిమాహాలు దగ్గరకీ, మీ సిటీబస్సు రూట్లమీదకీ తోలకండి."

"ఏం....ఎందుకలా అంటున్నారు."

"ఎందుకంటే మీవాడి వ్యవహారం బాగోలేదు. ఏదో మోటర్ సైకిల్ యాక్సిడెంటుతో సరిపోయిందనుకుంటున్నారా! ఈసారి ప్రాణానికే ముప్పు కలగొచ్చు...."
నవ్వు వినిపించింది.

ఆ నవ్వు అప్పలనాయుడికి గుండెదడ కలిగించింది.

"ఇంతకీ ఎవరు మీరు?" ఆందోళనగా ప్రశ్నించాడు.

"నేనా వల్లకాటి రామనాధాన్ని."

ఫోన్ పెట్టేసినట్లు క్లిక్‌మని శబ్దం వచ్చింది.

## 4

స్నేహితుడు చెప్పినమాట విని విజయ్ ముఖం కోపంతో యెర్రబడింది.

"నీకు నిజంగా తెలియదా?" అన్నాడు అతను.

"నిజంరా!" అన్నాడు విజయ్.

"గమ్మత్తుగా వుందే!"

"పెళ్ళి పోస్టుపోన్ చేశారేమో అనుకుంటున్నాను గాని...."

"నేనూ ఆశ్చర్యపోయాను. నిజంగా ఫణిరాజకుమారికి మరో సంబంధం చూస్తున్నారు. నిన్ననే పెళ్ళి చూపులు జరిగాయి. ఆ కుర్రాడు హౌస్‌సర్జన్ గుంటూ

రులో. మా చెల్లెలు చెప్పింది నిన్న. తను అక్కడే వుందట. దాదాపు సెటిల్ అయిపోయినట్లే అంది. కట్నం దగ్గరే బేరం జరుగుతున్నదట" అన్నాడు గోపాల్.

"ఎందుకు జరిగి వుంటుంది యిలా?" ప్రశ్నించాడు విజయ్.

"ఏమో! నాకూ అదే అర్థం కావడంలేదు. అయినా మీతో పెళ్ళి ఖాయం చేసుకుని, శుభలేఖలు పంచి పెట్టాక మానుకోవడానికి ఆ వెంకటస్వామికి యెంత ధైర్యం" అన్నాడు గోపాల్.

విజయ్ ముఖం అవమానంతో ప్రజ్వరిల్లుతోంది.

"సారీరా విజయ్! నీకు తెలుసేమోనని ఆ ప్రస్తావన తెచ్చాను" అన్నాడు గోపాల్ బాధను వ్యక్తం చేస్తూ.

"ఎప్పటికయినా తెలియాల్సిందే గదా! ఎన్నాళ్ళు దాస్తారు" అన్నాడు విజయ్.

ఫణిరాజకుమారితో పెళ్ళి ఆగిపోయిందని తెలిసి గుండె ఆగిపోయినట్లయింది విజయ్‌కి. ఇక ఆమె పరాయిదయి పోతున్నదనే వార్త గుండెను దహించి వేస్తోంది. బాధతో మనసు ముక్కలయి పోతోంది. కోపంతో రక్తం సలసలా కాగిపోతోంది.

'ఎందుకిలా జరిగింది?' అనే ప్రశ్న అతని మనసులో కుమ్మరి పురుగులా తొలిచివేస్తోంది.

వస్తూనే విజయ్ వాలకం చూసి అసలు సంగతి తెలిసిపోయింది కాబోలు అనుకున్నాడు అప్పలనాయుడు.

"నాకీ సంగతి యెందుకు చెప్పలేదు?" సూటిగా ప్రశ్నించాడు తండ్రిని.

"ఏ సంగతి?" ఏమీ తెలియనివాడిలా అన్నాడు.

"వాళ్ళతో పెళ్ళి సంబంధం చెడిపోయిందని."

"ఓ....అదా! పోతే పోయింది వెధవ సంబంధం. అది కాకపోతే దాని బాబులాంటి సంబంధం కాళ్ళదగ్గరికి వస్తుంది. అదేమంత ముఖ్యమైన విషయమా మనకు?"

"నీ రాజకీయాలు నా దగ్గర మాట్లాడకు. సూటిగా చెప్పు. ఎందుకు చెడిపోయింది?"

అప్పలనాయుడు కొడుకువంక సీరియస్‌గా చూసి "వాళ్ళు మూర్ఖులు. ఏదో నీకు యాక్సిడెంట్ జరిగిందని భయపడి అశుభం అనుకున్నారు. పోనీ....ఇప్పుడేం కొంప మునిగిందని?" అన్నాడు.

"శుభలేఖలు అచ్చుకొట్టించాక యెవరయినా పెళ్ళి మానుకుంటారా? యాక్సిడెంటు జరిగితే మాత్రం నిశ్చయమయిన పెళ్ళి యెలా ఆగుతుంది? నేను నమ్మను. ఏదో వుంది. నువ్వు దాస్తున్నావు" అన్నాడు విజయ్.

అతనికి రకరకాల అనుమానాలు వస్తున్నాయి. లోగడ తనుచేసిన రంకు వ్యవహారాలు యేవయినా బైటపడి వాళ్ళకు తన సంగతి తెలిసిపోయిందేమోనని.

అప్పలనాయుడు చుట్ట వెలిగించి సీరియస్‌గా వుండిపోయాడు కాసేపు.

తర్వాత వల్లకాటి రామనాథం రాసిన వుత్తరం తీసి చేతికిచ్చాడు.

"అదిరా సంగతి. అది చూసి ఆ పిల్ల, ఆ పిల్ల తల్లీ తెగ భయపడిపోతున్నారు. వెంకటస్వామి తప్పేంలేదు యిందులో. దానికి తగ్గట్టు నీకు యాక్సిడెంట్ జరగడంతో హడలిపోతున్నారు" అన్నాడు అప్పలనాయుడు.

కాసేపు కూర్చొని వెళ్ళిపోయాడు.

విజయ్‌కి ఆ అక్షరాలు చూడగానే జ్ఞాపకం వచ్చింది

పద్మావతి.

'అవును ఆ అక్షరాలు పద్మావతివే' అనుకున్నాడు. పద్మావతి అతని మాజీ ప్రియురాలు. ఆమెపై మోజు తీరగానే మొఖం చాటేశాడు, ఏడాదిక్రితం.

"నన్ను అన్యాయంచేసి నువ్వెలా సుఖపడతావో చూస్తాను" అన్న పద్మావతి చివరిసారి మాటలు చెవుల్లో గింగురుమని మ్రోగాయి.

'ఇదంతా దాని పనే. రాక్షసి! బంగారంలాంటి సంబంధం చెడగొట్టింది' అనుకున్నాడు.

'విజయ్‌తో పేచీ పెట్టుకునే ధైర్యం వచ్చిందా నీకు. నీపని పడతాను' కసిగా అనుకున్నాడు విజయ్.

# 5

విజయ్ చెయ్యి పూర్తిగా నయమైంది. డిశ్చార్జి అయ్యాక అప్పలనాయుడు కొడుకుని ఎక్కడికీ వెళ్ళవద్దని ఆంక్ష పెట్టాడు. మోటార్ సైకిల్ మీద తిరగవద్దని గట్టిగా మందలించాడు.

విజయ్ తండ్రి మనసు అర్థంచేసుకున్నాడు.

'వల్లకాటి రామనాథానికి భయపడుతున్నాడు. వాడెవడో తేల్చేస్తాను' అనుకున్నాడు.

'అలాగేలే' అన్నాడు తండ్రి తృప్తికోసం.

ఒకరోజు అప్పలనాయుడు అర్జెంట్ పని మీద హైదరాబాద్ వెళ్ళాడు. వెళ్ళేటప్పుడు కొడుక్కి మరీ మరీ చెప్పాడు ఇల్లు కదలవద్దని. సినిమాహాలుకి వెళ్ళవద్దనీ, సిటీ బస్సులు ఎక్కవద్దనీ, కావాలంటే కారు వాడుకోమనీ ఎన్నో జాగ్రత్తలు చెప్పి మరీ వెళ్ళాడు.

విజయ్‌కి పద్మావతి సంగతి తేల్చుకోవాలని పట్టుదల పెరిగింది. తండ్రి మాత్రం సుబ్బరాజు మీద అనుమాన

పడుతున్నాడు గాని విజయ్‌కి మాత్రం పద్మావతిమీదే వుంది.

తనను ఎంతో ద్వేషిస్తోంది పద్మావతి. తన చేతిలో మోసపోయింది గనుక తనను నవ్వులపాలు చెయ్యడానికి ప్రయత్నిస్తోంది. ఆమె ఒక కాటన్ మిల్ ఓనరు.

టెలిఫోన్ డైరెక్టరీ వెతికి పద్మావతి ఫ్యాక్టరీకి ఫోన్ చేశాడు. ఎవరో టెలిఫోన్ ఎత్తారు. తనకు పద్మావతి కావాలన్నాడు. మీరెవరని అతను అడిగాడు. తను పద్మావతి బంధువునని చెప్పాడు. కొన్ని నిముషాల తర్వాత పద్మావతి లైనులోకి వచ్చింది.

"గుడ్ మార్నింగ్ పద్మా!"

"గుడ్ మార్నింగ్. ఎవరు?"

"నేను విజయ్‌ని."

"విజయ్‌వా? ఏమిటి సంగతి?"

"ఏం లేదు. ఇంకా నామీద కోపం పోలేదా?"

"నా కెందుకు కోపం?"

"ఎందుకో నాకు తెలుసు. నిన్ను పెళ్ళిచేసుకోలేదని."

"దేశంలో మగాళ్ళు చాలామంది వున్నారు. నేను చేసుకోదల్చుకుంటే క్యూలో నిల్చుంటారు. మైండిట్. అయినా ఫోన్ ఎందుకు చేశావు? నీ పెళ్ళికి ఆహ్వానమా?"

"నా పెళ్ళి ఆగిపోయిందిగా నీ పుణ్యమా అని."

"నీ పెళ్ళి ఆగిపోయిందా? ఎవరో పెళ్ళి అని అన్నారుగాని ఆగిపోయిందని అనలేదే! నేనీ మధ్య వూళ్ళో లేనులే. నిన్ననే వచ్చాను. అయినా నీ పెళ్ళి నా పుణ్యాన ఆగిపోవడం ఏమిటి ఫార్స్‌గా వుందే...." నవ్వు వినిపించింది.

"ఫార్స్‌గానే వుంటుంది. నా గురించి లేనిపోనివి

కల్పించి నాకు కాబోయే వైఫ్‌కి లెటర్ రాశావుగా. నువ్వు అనుకున్నట్లే జరిగిందిలే."

"విజయ్! ఏమిటి నువ్వు అంటున్నది? నేను నీకు కాబోయే వైఫ్‌కి లెటర్ రాశానా? ఇది మరీ తమాషాగా వుంది. నీకు పిచ్చిగాని ఎక్కలేదుగదా!"

"కానాన్నాళ్ళు ఆగితే పిచ్చిగూడా ఎక్కుతుంది. ఎంతో తెలివిగా చేస్తున్నానని నువ్వు అనుకుంటున్నావు గాని నీ దస్తూరి నాకు బాగా తెలుసు. ఆ లెటర్ నువ్వు రాసిందే."

"నో....నువ్వు పొరబడుతున్నావు విజయ్!"

"ఆ లెటర్ నా దగ్గరే వుంది. నీకు చూపిస్తాను కావాలంటే. అప్పుడైనా నిజం ఒప్పుకోక తప్పదు."

"సరే అలాగే చూపించు."

"ఎక్కడికి రమ్మంటావు? మీ ఇంటికి రానా?"

"వద్దు. రాత్రి ఎనిమిది దాటాక మా గెస్టుహౌస్‌కిరా. నీ కోసం ఎదురుచూస్తుంటాను. బైదిబై నీకు డిన్నర్ గూడా అరేంజ్ చేస్తున్నాను. చాలా కాలం తర్వాత కలుసుకుంటున్నాముగదా!...." నవ్వుతూ అంది పద్మావతి.

"గెస్టుహౌస్‌కా! ఎక్కడ అది?"

"ఓ....నీకు తెలీదుగదూ! మా కష్టమర్స్ కోసం ఈమధ్యే కట్టించాం. మా ఫ్యాక్టరీ ఆవరణలోనే వుంది. గేటుదగ్గర మా వాచ్‌మాన్ వుంటాడు చూపిస్తాడులే."

"ఓకే...." అన్నాడు విజయ్.

అవతల టెలిఫోన్ పెట్టేసినట్లు క్లిక్‌మంది.

రాత్రి ఎనిమిదింటివరకూ ఓపికపట్టాలంటే చాలా కష్టమైపోయింది అతనికి. వల్లకాటి రామనాథం రాసిన

లెటర్ భద్రంగా జేబులో పెట్టుకున్నాడు.

అతని మనసులో రకరకాల ఆలోచనలు రేగు తున్నాయి. పద్మావతి మాటలు చూస్తుంటే తనపై ఏమాత్రం కోపం వున్నట్లు లేదు. పైగా డిన్నర్ కి రమ్మని ఆహ్వానించింది. ఆమెకు తనమీద కోపం పోయిందా? లేక ఇదే అదనుగా డిన్నర్ లో ఏదైనా విషం పెట్టి....

విజయ్ శరీరం భయంతో రోమాంచితమయింది.

'ఓహ్! ఆడదాన్ని అంత తేలికగా నమ్మరాదు. తను చేసిన మోసాన్ని అంత త్వరగా మర్చిపోయిందని అను కోవడం తన తెలివితక్కువతనం. తనను మట్టుపెట్టడానికి ప్లాను వేస్తున్నదేమో! లేకపోతే తనను రాత్రిపూట ఎందుకు రమ్మంటుంది? పైగా డిన్నర్ అని ఆహ్వా నించడం....'

'అసలు వెళ్ళకపోతేనో' అని ఆలోచించాడు ఒక దశలో.

'కాని వెళ్ళకపోతే యెలా' అనుకున్నాడు.

ఆలోచనలతోనే కాలం గడిచిపోయింది. ఏడున్నరకి కారు స్వయంగా డ్రయివ్ చేసుకుంటూ బయల్దేరాడు. పద్మావతి తనను మోసగించడానికి అవకాశం ఇవ్వదలచు కోలేదు. 'తను అక్కడ ఏమీ ముట్టుకోకూడదు' అని నిర్ణయించుకున్నాడు. ఎందుకయినా మంచిదని ఆరు అంగుళాల కత్తి ప్యాంట్ జేబులో పెట్టుకొన్నాడు. తగు జాగ్రత్తలలో బయల్దేరాడు.

ఫ్యాక్టరీ గేటు మూసివుంది.

విజయ్ హారన్ కొట్టాడు.

వాచ్ మాన్ చిన్నగేటుతీసి కారుదగ్గరకి వచ్చాడు.

"ఎవరు సార్?" అంటూ దగ్గరకు వచ్చాడు.

"నేనే విజయ్‌ని" అన్నాడు విజయ్.

"సార్ మీరా? రండి, అమ్మగారు మీకోసం ఎదురు చూస్తున్నారు" అన్నాడు వాచ్ మాన్.

అతను విజయ్‌కి గుర్తే. అతని పేరు పెంటయ్య.

పెంటయ్య గేటు తాళంతీసి బార్లా తెరిచాడు. విజయ్ కారు లోపలకు పోనిచ్చి ఒకప్రక్కగా ఆపాడు.

విజయ్ ఫ్యాక్టరీ ఆవరణంతా పరీక్షగా చూశాడు. వందలకొద్ది ఆయిల్ డ్రమ్ములు గుట్టలకొద్ది పేర్చివున్నాయి. దూరంగా ఫ్యాక్టరీలో ప్రతిచోట్ల.... అన్నీచూసి ఒక్క యేడాదిలో బిజినెస్ బాగా ఇంప్రూ చేసిందే అనుకున్నాడు విజయ్.

"ఏం పెంటయ్యా...."

"అయ్యా!"

"ఫ్యాక్టరీ జోరుగా సాగుతున్నదే. రాత్రిళ్ళుగూడా పని సాగుతున్నదే" అన్నాడు.

"ప్రతిసీజను గదయ్యా!" అన్నాడు పెంటయ్య చేతులు నలుపుకుంటూ.

"అమ్మగారు ఎక్కడున్నారు?"

"అదిగోనయ్యా! అదే కొత్తగా కట్టిన ఇల్లు" అంటూ చెయ్యెత్తి చూపించాడు పెంటయ్య.

"అమ్మగారు రోజూ ఇక్కడే వుంటారా?" ప్రశ్నించాడు విజయ్.

"లేదయ్యా! ఎవరన్నా బయటోళ్ళు వస్తే వుంటా వుంటారయ్యా! అమ్మగారు ఇంటికెళ్ళిపోతారయ్యా! ఈ రోజు తమకోసం...." అన్నాడు పెంటయ్య.

"ఇంకా యెవరన్నా వున్నారా? అక్కడ."

"లేదయ్యా! వంటరిగా నే వున్నారయ్యా!" అన్నాడు

పెంటయ్య.

విజయ్ గెస్ట్‌హౌస్ వైపు నడిచాడు.

ఫ్యాక్టరీకి చాలా దూరంలో వుంది గెస్టుహౌస్. దాదాపు రెండువందల గజాలదూరం వుంటుంది అక్కడికి. పెద్ద పెద్ద వేపచెట్లమధ్య అందంగా అధునాతనంగా కట్టబడింది.

చుట్టూ ముళ్ళతీగతో ఫెన్సింగ్ వుంది. ఇనుపగేటు తీసుకొని ఆవరణలోకి ప్రవేశించాడు. క్రోటన్స్ పూల మొక్కలు నీటుగా పెరిగివున్నాయి.

కాలింగ్ బెల్ నొక్కబోయి ఆగిపోయాడు విజయ్.

తలుపు ఓరగా తీసేవుంది. డోర్ కర్టెన్ సన్నగా కనిపిస్తూనే వుంది.

తలుపు నెట్టుకుని లోపలకు ప్రవేశించాడు.

హాలు విశాలంగా వుంది. నాలుగు సోఫాలు, దేకోలం టీపాయ్ అమర్చివున్నాయి. ఒకమూల టేబులుమీద రేడియో వుంది. దానికి ఎదురుగా నిలువెత్తు అద్దం వుంది.

రెండుగదులు కన్పించాయి. ఒకటి తీసివుంది. రెండో గది లాక్ చేసి వుంది.

"పద్మా" అన్నాడు విజయ్.

సమాధానం రాలేదు.

"పద్మా!" అంటూ గదిలోకి వెళ్ళాడు.

అంతే. వెళ్ళినవాడు స్థాణువులా నిలబడిపోయాడు. కళ్ళు పెద్దవిచేసి చూస్తూండిపోయాడు. భయంతో గుండె వెయ్యిమైళ్ళ స్పీడుతో కొట్టుకుంది. కాళ్ళు వణికాయి.

బెడ్ మీద రక్తపు మడుగులో పడివుంది పద్మావతి.

విజయ్‌కి గొంతులో తడి ఆరిపోయింది.

మెదడు మొద్దుబారినట్లయింది. ఏం చెయ్యాలో

తోచలేదు.

అలాగే గుమ్మంలో నిలబడిపోయాడు.

పద్మావతి బెడ్ మీద పడుకుని వుంది. ఆమె గుండెల్లో కత్తి దిగబడి వుంది. రక్తంతో తెల్లటి బెడ్ షీటు ఎర్రగా మారివుంది.

విజయ్ గిర్రున వెనక్కి తిరిగాడు. దాదాపు పరుగు వంటి నడకతో కారుదగ్గరకి చేరుకున్నాడు.

కారుయెక్కి స్టార్టుచేసి హారన్ మ్రోగించాడు. ఎక్కడ్నుంచో వచ్చి పెంటయ్య గేటు తాళంతీసి తెరిచాడు.

"అప్పుడే వెళ్ళిపోతున్నారేం అయ్యా?" నవ్వు ముఖంతో అడిగాడు వాచ్ మాన్ పెంటయ్య.

విజయ్ కి కంగారులో ఏం చెప్పాలో తోచలేదు. మాట్లాడకుండా కారు నడుపుకుని వెళ్ళిపోయాడు.

## 6

విజయ్ ఫ్యాక్టరీనుంచి వెళ్ళిపోయాక అయిదు నిమిషాల తర్వాత క్యారేజి పట్టుకుని మల్లయ్య ఫ్యాక్టరీకి వచ్చాడు. మల్లయ్య పద్మావతి ఇంట్లో పనిచేసే నౌకరు.

చిన్న గేటు తెరుస్తూ "ఏం మల్లయ్యా! క్యారేజ్? అమ్మగారు ఇంటికి రానందా?" నవ్వుతూ అన్నాడు పెంటయ్య.

"ఏమో? ఇద్దరికి భోజనం పంపమని కబురుచేశారు" అన్నాడు ముక్తసరిగా.

మల్లయ్య గెస్టుహౌస్ లోకి వెళ్ళిన కొన్ని నిముషాలకు కెవ్వున కేకలు వేస్తూ పరుగెత్తుకొచ్చాడు. ఆ కేకలు గేటు దగ్గర నిల్చున్న పెంటయ్యకు వినిపించాయి.

కాలుస్తున్న బీడీ అవతలపారేసి కంగారుగా మల్లయ్య వస్తున్నవేపు పరిగెత్తాడు పెంటయ్య.

మల్లయ్య భయంతో వణికిపోతూ కనిపించాడు.

"ఏమిట్రా? ఏం జరిగింది?" ప్రశ్నించాడు వాచ్‌మాన్.

"అమ్మగార్ని ఎవరో చంపేశారు?" మల్లయ్యగొంతు వణుకుతూ వుంది.

వెంటయ్య నిలువునా కంపించిపోయాడు.

క్షణాలలో కార్చిచ్చులా ఫ్యాక్టరీలో పనిచేస్తున్న వర్కర్లందరికీ ఆ వార్త తెలిసిపోయింది. ఫ్యాక్టరీలో పని ఆగిపోయింది. అంతా గెస్టుహౌస్ ముందు గుమిగూడి వున్నారు.

పోలీస్ వ్యాన్ వచ్చింది.

ఇన్‌స్పెక్టర్ కృష్ణమూర్తి తన బలగంతో దిగాడు.

పద్మావతి దగ్గరికెళ్ళి చూశాడు.

నిండా పాతికేళ్ళు లేవు ఆమెకు. ఎర్రగా బొద్దుగా వుంది. ముఖాన బొట్టులేదు. మెడలో సన్నటి గోల్డు లాకెట్ వుంది.

మెడమీద గాయంనుంచి కారిన నెత్తురువల్ల బెడ్ మీద దుప్పటి తడిసింది. గుండెల్లో కత్తి దిగివుంది.

హంతకుడు ముందు మెడమీద పొడిచాడు. తర్వాత గుండెలో పొడిచాడు.

ఆమె ప్రాణం ఇంకా పోలేదు. చావు బతుకులమధ్య కొట్టుకులాడుతోంది.

వెంటనే ఆమెను వానులో ఆస్పత్రికి తరలించాడు.

డాక్టర్స్ ఆమెను బ్రతికించడానికిప్రయత్నిస్తున్నారు. ఆమె బ్రతుకుతుందా? లేదా? అనే విషయం చెప్పడం కష్టం అన్నారు. ఇరవయినాలుగు గంటలు గడిస్తేగాని ఏ సంగతీ తేలదు అన్నారు.

వాచ్‌మాన్ చెప్పిన విషయాలను బట్టి మునిసిపల్ ఛైర్మన్ అప్పలనాయుడుగారి అబ్బాయి విజయ్ ఎనిమిది గంటల ప్రాంతంలో ఫ్యాక్టరీకి వచ్చాడనీ, గెస్టుహౌస్ లోకి వెళ్ళి కొన్ని నిమిషాల తర్వాత తిరిగివచ్చాడనీ, కారులో వెళ్ళిపోయాడనీ తెలిసింది.

అప్పలనాయుడు వూళ్ళోలేడు. ఇన్‌స్పెక్టర్ కృష్ణమూర్తి విజయ్‌ని అరెస్టుచేసి స్టేషన్‌కి తీసుకొచ్చాడు.

"నన్ను నమ్మండి ఇనస్పెక్టర్. నేను వెళ్ళేసరికే ఆమెను యెవరో పొడిచారు. నాకు భయంవేసి తిరిగి వచ్చేశాను" అన్నాడు విజయ్.

"తిరిగి వచ్చినవారు మాకు రిపోర్టు ఎందుకివ్వలేదు?" ప్రశ్నించాడు ఇనస్పెక్టర్.

విజయ్ వెంటనే సమాధానం చెప్పలేకపోయాడు.

"మీకు రిపోర్టు చెయ్యాలనే ఐడియా తట్టలేదు. ఆ నెత్తురు చూసేసరికి నేను అప్ సెట్ అయ్యాను. కంగారుగా వచ్చేశాను" అన్నాడు నెమ్మదిగా.

"అసలు మీరు ఆ సమయానికి అక్కడికి యెందుకు వెళ్ళారు?"

"స్వంత పనిమీద వెళ్ళాను."

"రాత్రిపూటా?"

"ఆఁ....ఆ సమయానికి రమ్మని ఆమె చెప్పింది."

"అయితే ఆమె మీకు బాగా పరిచయస్తురాలే నన్నమాట."

"అవును సార్. ఆమె నా క్లాస్‌మేటే. మీతో అబద్ధం యెందుకు చెప్పాలి. ఒకప్పుడు మేమిద్దరం పెళ్ళి చేసుకోవాలనుకొన్నాము" అంటూ జరిగిన కథంతా ఇనస్పెక్టర్‌కి చెప్పాడు విజయ్.

వల్ల కాటి రామనాథం పేరున రాసిన లెటర్ కూడా ఇనస్పెక్టర్ కి చూపించాడు.

అంతా విని ఇనస్పెక్టర్ నిట్టూర్చాడు.

"సారీ! మిష్టర్ విజయ్. నేను మీమీద కేసు పెట్టక తప్పదు. పరిస్థితులు అలా వున్నాయి. ఆ సమయంలో మీరు అక్కడికి వెళ్ళడం అదిచూసిన సాక్షులు వున్నారు. ఈ స్టేజిలో నేనేం చెయ్యలేను" అన్నాడు.

విజయ్ ముఖం విచారంలో మునిగింది.

"అదికాదు సార్! మీరు కేసును జాగ్రత్తగా ఇన్వెస్టి గేట్ చెయ్యండి. ఆమెకు యెవరయినా శత్రువులు వున్నారేమో? ఆమె బంధువులు ఎవరయినా ఈ అఘాయిత్యం చేశారేమో?" అన్నాడు విజయ్.

"ట్రై చేస్తాను" అన్నాడు ఇనస్పెక్టర్.

## 7

విజయ్ మర్డర్ కేసులో ఇరుక్కున్నాడనే మెసేజ్ రాగానే నిప్పులు తొక్కిన కోతిలా గెంతులేస్తూ వచ్చాడు అప్పలనాయుడు హైదరాబాద్ నుండి.

"నీకు బుద్ధుందా లేదా? ఇల్లు కదలొద్దని చిలక్కి చెప్పినట్లు చెప్పిపోయాను. పొయ్యి పొయ్యి ఆ మర్డర్ కేస్ లో ఇరుక్కున్నావ్! ఛీ.... నా పరువు తియ్యడానికి పుట్టినట్లున్నావు" అంటూ తిట్టిన తిట్టు తిట్టకుండా అరగంట సేపు తిట్టాడు అప్పలనాయుడు కొడుకుని.

విజయ్ ముఖం కందగడ్డలా పెట్టుకొని తిట్లవర్షంలో తడుస్తూ కూర్చున్నాడు.

బెయిలుమీద కొడుకుని విడుదల చేయించి తీసుకొచ్చాడు గాని, లోలోపల హడలిపోసాగాడు. తనకు ఏదో దుర్దశ ప్రారంభమయిందని అనుకున్నాడు. కొడుక్కి

శిక్ష పడుతుందో ఏమో? ఆ వల్లకాటి రామనాథం జోస్యం నిజమవుతుందా? ఉరిశిక్ష పడుతుందా?

అప్పలనాయుడికి ఇంట్లో కాలు నిలవలేదు. లాయర్ ఇంటికి పరుగెత్తాడు. కొడుకుని ఈ కేసులోనుంచి యెలా తప్పించాలా అని ఒకటే ఆలోచనతో పిచ్చివాడిలా తనవున్న అప్పులచుట్టూ తిరుగుతూ మంతనాలు సాగిస్తున్నాడు.

పద్మావతిని పొడిచిన కత్తిమీద వేలిముద్రలు దొరకలేదు. అంటే హంతకుడు గ్లొవ్స్ వుపయోగించి వుంటాడు.

అపోజిషన్ పార్టీ సుబ్బరాజుకి ఇదే అదనుగా యీ మర్డర్ కేసు గురించి చిలవలు పలవలు అల్లి తన సంపాదకత్వంలో నడుస్తోన్న లోకల్ పేపరు "ప్రజాగొంతు"లో ప్రచురించాడు. హంతకుడు విజయ్‌మీద పోలీసులు కేసు పెట్టారని జిల్లా మొత్తం పాకిపోయింది.

వెంకటస్వామితో పెళ్ళి సంబంధం చెడిపోవడంకంటె కొడుకు మర్డరు కేసులో ఇరుక్కోవడం అప్పలనాయుడి రాజకీయ జీవితానికి దెబ్బ తగిలింది.

'ప్రజాగొంతు'లో సుబ్బరాజు సంపాదకీయంలో మున్సిపాలిటీ తీరు తెన్నులమీద నిశితంగా విమర్శించాడు. చేర్మన్ కొడుకు తండ్రి అధికారాన్ని తనే చెలాయిస్తున్నాడనీ, టౌన్‌లో అతనొక గూండాగా తయారయ్యాడనీ, ఆఖరికి హత్యలు చెయ్యడానికిగూడా వెనుదియ్యడము లేదనీ రాశాడు.

"ఏదో గౌరవంగల కుటుంబం అని తొందరపడి పిల్లనివ్వాలనుకున్నాను. తీరా శుభలేఖలు అచ్చయ్యాక తెలిసింది వాడొక రౌడీముండాకొడుకని. అందుకే ఆ సంబంధానికి సలాంపెట్టి వేరే సంబంధం చూసుకొన్నాను"

అని వెంకటస్వామిగూడా అక్కడక్కడా అన్నట్లు అప్పలనాయుడికి తెలిసి కో[illegible]తో పెద్దపులిలా గాండ్రించాడు.

ఏమయితేనేం విజయ్ అదృష్టంవల్ల పద్మావతికి తెలివి వచ్చి[illegible] నెమ్మదిగా కోలుకొంది. ఆమెకు మాట్లాడే శక్తి వచ్చి[illegible]

"నన్ను పొడిచింది మోహన్‌రావు" అని స్టేట్‌మెంటు ఇచ్చింది పద్మావతి.

మోహన్‌రావు ఆమె ఫ్యాక్టరీలో ఎక్కౌంటెంటుగా పనిచేస్తూన్నాడు. బికాం పాసయ్యాడు. సుమారు పాతికేళ్ళ వుంటాయి అతనికి. ఇంకా పెళ్ళికాలేదు.

అతను పద్మావతిని పెళ్లి చేసుకోమని సతాయిస్తున్నాడు. ఆమె మాత్రం పెళ్ళికి ఒప్పుకోవడంలేదు. అంతే కాదు ఆమాట ఎత్తితే డిస్మిస్ చేస్తానని బెదిరించింది. దూరంగా వుంచింది. ఆ కసితో ఆతను సమయం చూసి కత్తితో పొడిచి పారిపోయాడు.

ఉప్పెనలో నుంచి బయటపడిన వాడిలా వూపిరిపీల్చుకున్నాడు అప్పలనాయుడు.

కొడుకుని వ్యాపారంలోకి దించితే తెలివి తక్కువతనంవల్ల యేదయినా గొడవ తెచ్చుకోవచ్చు. అదీగాక వల్లకాటి రామనాథం విజయ్‌ని బిజినెస్‌లోకి పంపవద్దని హెచ్చరించి వున్నాడు. ఎన్నో ఆలోచించి ఆఖరికి తాతయ్య అండ్ తాతయ్య టొబాకో కంపెనీలో అసిస్టెంటు బయ్యర్ వుద్యోగానికి ట్రై చేశాడు.

అప్పలనాయుడితో తాతయ్యకున్న పరిచయంవల్ల పొగాకు గురించి విజయ్‌కి యేమీ తెలియకపోయినా

వుద్యోగం ఇవ్వడానికి అంగీకరించాడు. ఆ వుద్యోగం కూడా ఆ వూళ్ళోకాదు. దాదాపు టౌనుకి ఏభైమైళ్ళ దూరంలోవున్న చిలకాపురంలో. అదొక చిన్న టౌన్. బాగానే వుంటుంది అనుకున్నాడు అప్పలనాయుడు.

మర్నాడు దశమి. మంచిరోజు. తాతయ్యా అండ్ తాతయ్యా టొబాకో కంపెనీ ఆఫీసుకెళ్ళి అపాయింటుమెంటు ఆర్డరు తీసుకొని చిలకాపురం వెళ్ళి వుద్యోగంలో చేరమని అప్పలనాయుడు కొడుకుతో చెప్పాడు.

తండ్రి చెప్పినట్లే టొబాకో కంపెనీ ఆఫీసుకు వెళ్ళాడు విజయ్. అక్కడ తాతయ్యా లేడు. అపాయింటుమెంటు ఆర్డర్సు టైపుచేశాక తాతయ్యా వాటిమీద సంతకాలు చెయ్యలేదట. పైగా ఆఫీస్ కాపీమీద క్యాన్సిల్ అని రాశాడుట. అదంతా మేనేజర్ చెప్పాడు విజయ్‌కి.

ఉద్యోగం ఇస్తానని నమ్మకంగా చెప్పినవాడు యిలా యెందుకు చేశాడో విజయ్‌కి అర్థంగాలేదు. ముఖం నల్లగా మాడ్చుకుని వచ్చేశాడు విజయ్.

జరిగిందంతా తెలుసుకొని అప్పలనాయుడు తాతయ్యా కోసం యింటికి వెళ్ళాడు. తాతయ్యా ఇంట్లోనే వున్నాడు.

"రావయ్యా! నాయుడూ" అంటూ ఆహ్వానించాడు.

నాయుడికి తాతయ్యామీద కోపంగా వుంది.

"మా వాడికి గతిలేక నిన్ను వుద్యోగంలో పెట్టుకోమని ప్రాధేయపడలేదు. కొన్నాళ్ళు ఈ వూళ్ళోలేకుండా వుంటే ఏ గొడవా వుండదని అనుకున్నాను. వాడి జాతకము బాగోక పెళ్ళి ఆగిపోయింది. కేసులో యిరుక్కుని బయటపడ్డాడు" అన్నాడు అప్పలనాయుడు.

తాతయ్యా నవ్వి "నామీద కోపం వచ్చినట్లుందే" అన్నాడు.

"కోపంకాదు. అసలు సంగతి చెప్పావు" అన్నాడు.

"అదంతా నువ్వు నాకు చెప్పావుగదా! చెప్పాకనే గదా మీ వాడికి వుద్యోగం ఇవ్వడానికి ఒప్పుకున్నాను. నిజానికి ఆ వుద్యోగం యెంతో అనుభవం వున్నవాడికి యివ్వాలి. మీవాడికి పొగాకు ఎట్లావుంటుందో తెలియక పోయినా ఎందుకిస్తానన్నాను? నీమీద అభిమానం వుండ బట్టేగదా?" అన్నాడు తాతయ్య.

"మరి ఇస్తానని చెప్పి నువ్వు చేసిందేమిటి?" నిష్టూరంగా అన్నాడు అప్పలనాయుడు.

"నన్నేం చెయ్యమంటావ్? నాకు అప్పుడే చావాలని లేదు" అన్నాడు తాతయ్య.

అప్పలనాయుడు వులిక్కిపడ్డాడు.

"ఏమిటి నువ్వనేది?" ఆశ్చర్యంతో ప్రశ్నించాడు.

"మీ వాడికి వుద్యోగం ఇస్తే వారం లోపల చంపుతానని బెదిరించాడు. ఇప్పుడు చెప్పు? మీ వాడికి వుద్యోగం ఇచ్చి నన్ను చావమంటావా? నా సీట్లో నువ్వుంటే యేం చేస్తావ్? చావడానికి సిద్ధపడతావా?" గంభీరంగా అన్నాడు తాతయ్య.

"మా వాడికి వుద్యోగం ఇస్తే వారంలోపల నిన్ను చంపుతానని బెదిరించాడా? ఎవడు వాడు?"

"ఎవడో నాకేం తెలుసు? తన పేరు వల్లకాటి రామనాథం అన్నాడు."

అప్పలనాయుడికి ఆ పేరు వింటూనే ముఖం కళ తప్పింది.

"ఎవడయ్యా వాడు? వాడికీ నీకూ విరోధం ఏమిటి' అని ప్రశ్నించాడు తాతయ్య.

వాటికి సమాధానం అప్పలనాయుడికి తెలిస్తేగదా చెప్పడానికి?

# 8

నీలిమబార్‌లో ఒంటరిగా కూర్చుని పీటర్ స్కాట్ విస్కీ ఫుల్ బాటిలు ముందుపెట్టుకొని త్రాగుతూ ఆలోచిస్తున్నాడు విజయ్.

ఎవడీ కల్లకాటి రామనాథం?

తనను యెందుకిట్లా వెంటాడుతున్నాడు?

పద్మావతి యింకా హాస్పిటల్లోనే ట్రీట్‌మెంటు తీసుకుంటున్నది. ఆమెను అనుమానించడం బుద్ధితక్కువ పని.

తనకు గుర్తులేని శత్రువు యెవడో వున్నాడు.

విజయ్ తలలో ఆలోచనలు గిరగిరా తిరుగుతున్నాయి. తనుచేసిన దుర్మార్గాలు జ్ఞప్తికి తెచ్చుకోడానికి ప్రయత్నం చేస్తున్నాడు.

నీలిమబార్ మేడపైన కూర్చున్న విజయ్‌కి రోడ్డుమీద వెళుతున్న జనం కనిపిస్తున్నారు. కార్లు, రిక్షాలు వేగంగా పోతున్నాయి.

రాత్రి తొమ్మిది దాటింది.

ఆ రోడ్డులో వున్న సినిమాలు వదలినట్లున్నారు. జనం గుంపులు గుంపులుగా పుట్టలు పగిలినట్లుగా రోడ్డు నిండి పోయారు. పావుగంటపాటు ప్రవాహంలా కదిలారు జనం.

రెండో ఆట సినిమాకు వెళ్ళేవాళ్లు సరదాగా నడిచి పోతున్నారు. జంటలు జంటలుగా కొందరు, గుంపులు గుంపులుగా కొందరు.

పీటర్ స్కాట్ బాటిల్ సగం ఖాళీ అయ్యింది. విజయ్ ముందున్న టీపాయ్ మీద నాన్ వెజిటేరియన్

డిష్లెష్ పాతవిపోయి క్రొత్తవి వస్తున్నాయి.

విజయ్ సిగరెట్ వెలిగించి పొగ కిటికీలోనుంచి వదుల్తూ రోడ్డువైపు దృష్టిసారించి వచ్చేపోయేవారిని చూస్తున్నాడు. మత్తు బాగా తలకెక్కింది. కళ్ళు మూతిలుపడుతున్నాయి బరువుగా.

ఒక్కసారిగా విజయ్ కళ్ళు ఆశ్చర్యంతో పెద్దవి అయ్యాయి.

రోడ్డుమీద ఒంటరిగాపోతున్న ఆమెను రెప్పకొట్టకుండా అదేపనిగా చూశాడు.

ఆమె ఎత్తుగా, దానికితగ్గ లావుతో, ఆలివ్ గ్రీన్ కలర్ నైలెక్స్ చీర, అదే రంగు బ్లౌజుతో తలవంచుకుని అడుగులు వేస్తోంది.

'అవును ఆమె అచ్చు అలాగే వుంది' అనుకున్నాడు.

అతనికి ఆ రోజు గుర్తుకొచ్చింది.

ఆ రోజు....షుమారుగా మూడు నెలల క్రితం.... విజయ్ తను సిటీబస్‌లమీద సూపర్ విజన్‌కి వెళ్ళాడు.

ఇరవై రెండో నెంబర్ సిటీ బస్సులో ఆమెను చూసి గుండెల్లో అలజడి బయలుదేరింది. కళ్ళు త్రిప్పుకోలేనంత అందంగావుంది ఆమె.

ఆమె చాల ఎత్తుగావుంది. అంత ఎత్తు ఆడవాళ్ళని అతను ఎప్పుడూ చూళ్ళేదు. పాత హిందీ సినిమాల్లో నూతన్ అంత ఎత్తు వుందామె. అతన్ని బలంగా ఆకర్షించడానికి బహుశా అదొక కారణమై వుండొచ్చు.

సూపర్ విజన్ సంగతి మర్చి ఆమెకు ఎదురు సీట్లో కూర్చుని పిచ్చివాడిలా చూడసాగాడు. ఇరవై రెండో నెంబర్ సిటీబస్ లేడీస్ పాలిటెక్నిక్ వరకూ వెళ్తుంది. ఆ కాలేజీ టౌన్‌కి దాదాపు రెండుమైళ్ళ దూరంగా

వుంది. అక్కడే హాస్టల్ గూడా వుంది.

అప్పుడు సాయంకాలమైంది. విజయ్ అప్పటికి రెండు బీరుసీసాలు త్రాగివున్నాడు. మత్తు మత్తుగా వుంది మనసు. ఆ మత్తు మనసులో బలంగా నాటుకుపోయింది కోరిక. ఆమెను పొందాలనే కోరిక త్రాచులా బుసలు కొట్టింది.

ఆమె ఆ కాలేజీ స్టూడెంట్ కాదు. అందులో ఎవరి కోసమో వచ్చివుంటుంది. అందుకే ఆమె కండక్టర్ని వివరంగా అడుగుతూవుంది పాలిటెక్నిక్ హాస్టల్ ఎంత దూరం వుందని.

ఇంకొక్క ఫర్లాంగులో పాలిటెక్నిక్ కాలేజీ, హాస్టల్ వచ్చేస్తాయి. ఆ స్టేజిలో అంతా దిగిపోయారు. ఆమె ఒంటరిగా వుంది.

విజయ్ మనసులో ఒక ఆలోచన మెరుపులా మెరిసింది. డ్రైవర్ని బస్సు ఆపమన్నాడు. ఒక చెట్టు ప్రక్కనే బస్సు ఆపాడు డ్రైవర్. అందులో ఇంకా కండక్టర్, క్లీనర్ మాత్రమే వున్నారు.

వాళ్ళు బస్సు దిగారు. విజయ్ వాళ్ళకి చెప్పాడు దూరంగా పొమ్మని. ఎవరైనా వచ్చి అడిగితే ఆ తర్వాత తనెవరో తెలియదని చెప్పమన్నాడు. డ్రైవర్ ముందు అందుకు ఒప్పుకోలేదు. కాని వుద్యోగంలోనుంచి తీసేస్తానని బెదిరిస్తే చేసేదేంలేక దిగిపోయాడు.

అప్పుడు విజయ్ ఆమెను రాక్షసంగా మానభంగం చేశాడు. ఆమెను ఆ తర్వాత హాస్టల్ దగ్గర దించి వచ్చేశారు బస్ స్టాఫ్.

అప్పటివరకూ మధ్యలో వెయిట్ చేస్తూ రోడ్డువారగా నిల్చునివున్నాడు విజయ్.

ఆ తర్వాత స్టాఫ్ ముగ్గురికీ మూడువందల నోట్లు ఇచ్చి తన గురించి ఎవరికీ చెప్పవద్దని హెచ్చరించాడు.

ఆమె మాత్రం అవమానంతో దహించుకుపోయింది. ఆ రాత్రే రైలుక్రిందపడి ప్రాణాలు తీసుకుంది.

ఆమె శవాన్ని పాలిటెక్నిక్ కాలేజీ స్టూడెంట్ రాగిణి గుర్తించింది. రాగిణి అక్క లలిత ఆమె. చెల్లెల్ని చూడ్డానికి వెళ్తుండగా విజయ్ చేతిలో శీలం కోల్పోయింది.

లలిత ఆత్మహత్య చేసుకోవడానికి కారణం ఆమెను మానభంగం చెయ్యడంవల్లనే అని పోస్టుమార్టంలో వెల్లడైంది.

కాని ఎవరో అంతుబట్టలేదు. పోలీసులు ఇరవై రెండో నెంబర్ బస్సుస్టాఫ్‌ని ప్రశ్నించారు కాని ప్రయోజనం లేకపోయింది.

లలిత అన్న ప్రతాప్ ఆ తర్వాత అదే వూరికి బదిలీ మీద వచ్చాడు. అతను ఒక గవర్నమెంట్ ఆఫీసులో పనిచేసేవాడు.

అతను వచ్చాక తన చెల్లెలిమరణానికి కారణం ఎవరో తెలుసుకోవాలని ఎంతో ప్రయత్నించాడు. బస్సుస్టాఫ్‌కి డబ్బుగూడా ఇస్తాననీ అతను ఎలా వుంటాడో చెప్పమన్నాడు. కాని తమకి ఏమీ తెలియదని బుకాయించారు.

లలిత పర్సులో వున్న సిటీబస్ టికెట్టునిబట్టి ఆమె ఆ బస్సులోనే వచ్చిందని పోలీసులకు అనుమానం వచ్చింది. కాని ఆమె హాస్టల్ దగ్గర దిగి వెళ్ళిపోయిందని కండక్టర్ గట్టిగా చెప్పాడు.

అలా ఆ కేసులో తప్పించుకున్నాడు విజయ్.

ఒకవేళ లలిత అన్న ప్రతాప్ గాని వల్లకాటి రామనాథం పేరుతో తనని బాధించడం లేదుగదా?

ప్రతాప్ కి తనే లలితను చెరిచాడని ఎలా తెలిసింది? ఎలా తెలుస్తుంది?

ఆ రోజు బస్సులో వున్న స్టాఫ్ లో ఎవరైనా చెప్పి వుంటారా?

విజయ్ తల ఆలోచనలతో పగిలిపోతోంది.

# 9

మర్నాటినుంచి ప్రతాప్ పనిచేస్తున్న ఆఫీసు దగ్గర కాపు వేశాడు విజయ్. అతని చర్యలన్నీ గమనించసాగాడు. అతని ఇల్లుగూడా తెలుసుకున్నాడు.

కాని అతని దినచర్య అనుమానాస్పదంగా లేదు. అతను వుదయం తొమ్మిదింటికి ఆఫీసునుంచి బయల్దేరతాడు. ఇక సాయంకాలం ఆఫీసు వదిలాక పేకాట ఆడి ఏ పదింటికో ఇంటికి జేరుకుంటాడు.

ప్రతాప్ ని పూర్తిగా అనుమానించకుండా గూడా వుండడానికి వీల్లేదు. ఫోన్ ద్వారా బెదిరించడానికీ, వుత్తరాల ద్వారా హడలగొట్టడానికి బైటపడాల్సిన పనిలేదు. అతను తన చర్యల ద్వారా పిచ్చివాడిని చెయ్యడానికి ప్రయత్నిస్తున్నాడు. తనకి మనశ్శాంతిలేకుండా చేసి చివరకు ఏదో ఒక రోజున తనని మర్డర్ చేస్తే?

విజయ్ గుండె ఆగిపోయినట్లయింది.

అతను ఒంటరిగా ఆలోచనలో పిచ్చెక్కిపోతున్నాడు. అసలు తన అనుమానాలు ఆధారాలులేనివి. ప్రతాప్ కి తనే అతని చెల్లెల్ని బలవంతంగా చెరిచాడనే సంగతి తెలుసా? లేదా?

అతనుకాక ఇంకెవరు తనపై ఇంత పగపట్టి వుంటారు?

ప్రతాప్ చదువుకున్నవాడు. తన సంగతి తెలిసి ఇలా వల్లకాటి రామనాథం పేరుతో హెడలగొట్టేస్తున్నాడేమో? ఆ విధంగా పగతీర్చుకుంటున్నాడేమో?

తను చేసిన దుర్మార్గానికి సాక్షులు ముగ్గురే.

కండక్టర్ తిరుపతి, క్లీనర్ శివయ్య, డ్రైవర్ సింహాచలం. వాళ్ళనే కనుక్కుంటే?

వాళ్ళు నిజం చెప్పరని తెలిసినా తన మనశ్శాంతి కోసం కండక్టర్ని, క్లీనర్ని ఏకాంతంగా అడిగాడు. వాళ్ళు దేవుళ్ళమీద, అమ్మా అయ్యలమీద పెళ్ళాం బిడ్డమీదా ప్రమాణాలు చేశారు. తాము ఆ రోజునుంచి ఎవరితోనూ ఏమీ చెప్పలేదన్నారు.

డ్రైవర్ సింహాచలం మాత్రం అంతా విని, "మీ అనుమానం నిజమే" అన్నాడు.

విజయ్ కళ్ళు ఆనందంతో మెరిశాయి.

"మీకు తెలియదుగాని మన కండక్టర్ తిరుపతి వట్టి డబ్బు మనిషి. వాడే వెయ్యిరూపాయలకు లొంగిపోయి గుట్టు రట్టు చేశాడు" చెప్పాడు.

"నిజమా?"

"నాకు అంతా తెలుసు. మీరు ఎక్కడా బైట పడకండి. ఇదంతా ఆ ప్రతాప్ చేయిస్తున్నాడు. తను మాత్రం తెర వెనుక వున్నాడు."

"ఎవరితో?"

"జగన్ అని ఒకడున్నాడు. డబ్బిస్తే ఎంతపనైనా చేస్తాడు."

"ఎక్కడుంటాడు వాడు?"

"వాడికి మీరు ఎక్కువ డబ్బిస్తే తనని నియమించిన ప్రతాప్ నే మర్డర్ చేసేస్తాడు. జగన్ కి నీతి నియమాలు

ఏమీ లేవు."

"నాకంతా అయోమయంగా వుంది."

"భయపడకండి. జగన్ నాకు తెలుసు. చీకటిపడ్డాక డబ్బు తీసుకుని రండి. రేపే ప్రతాప్ శవం ఏ లారీ క్రిందనో పడి నజ్జునజ్జయిపోతుంది."

"ఎంత తీసుకురమ్మంటావు?"

"పదివేలు తీసుకురండి. మర్డర్ చేయాలిగదా!" అన్నాడు సింహాచలం.

"అలాగే!....ఎన్నింటికి రమ్మంటావు?"

"ఏడింటికి రండి. నేను రెడీగా వుంటాను" అన్నాడు సింహాచలం.

# 10

సింహాచలం మోటారుసైకిల్ నడుపుతుంటే, విజయ్ వెనుక కూర్చున్నాడు.

టౌన్ దాటిన రెండు మైళ్ళ తర్వాత చిన్న కొండ వుంది. ఆ కొండమీద ఒక గుడివుంది.

కొండ దిగువ బండి ఆపాడు సింహాచలం.

"అతను ఇంతదూరంలో ఈ ఏకాంత ప్రదేశంలో ఎందుకుంటున్నాడు?" ప్రశ్నించాడు విజయ్.

సింహాచలం నవ్వి "భలేవారు సార్! ఖూనీలు చేసేవాడు జనం మధ్య వుంటే బ్రతకనిస్తారా?" అన్నాడు.

తర్వాత ఇద్దరూ కొండపైకి ఎక్కారు.

సింహాచలం బ్యాట్రీలైటుతో దారి చూపుతూవుంటే విజయ్ ఎక్కుతున్నాడు.

కొండపైకి ఎక్కారు. దూరంగా షుమారు మైలు దూరంలో ఒక పల్లెటూరు వుంది. దీపాలు మినుక్కు మినుక్కుమని వెలుగుతున్నాయి.

గుడి చిన్నదే.

"పదండి సార్!" అన్నాడు సింహాచలం.

విజయ్ గుమ్మం దాటాడు.

మెడమీద గట్టిగా దెబ్బపడింది. బోర్లాపడ్డాడు. పడ్డ వాడిని లేవకుండా పెడరెక్కలు విరిచికట్టాడు సింహాచలం. కదలకుండా కాళ్ళు కట్టేసి ఒక మూల కూర్చోబెట్టాడు.

విజయ్ గట్టిగా కేకలు పెడుతున్నాడు.

సింహాచలం తాపీగా బీడీ ముట్టించి "ష్!....అరవకురా బద్మాష్! అరిచినా నీ నోరు నొప్పి తప్ప పలికే దిక్కులేదు. అందుకే దేవుణ్ణి ప్రార్థించుకో. ఆఖరి ఘడియలు దగ్గరికొచ్చాయి" అన్నాడు.

"ఒరేయ్ సింహాచలం! నమ్మించి మోసం చేస్తావురా!" కోపంతో పళ్ళుకొరికాడు విజయ్.

"మరి నమ్మకుండా మోసం ఎలా చేస్తారురా బేవకూఫ్."

"నీకు నేనేం ద్రోహం చేశాను. చెప్పు నన్ను ఎందుకు మోసం చేశావ్?"

"చెప్తా బే!....చెప్తా!....అన్నీ చెప్తా!వల్లకాటి రామనాథం అంటే ఎవడో కాదురా!.... నేనే...." అన్నాడు సింహాచలం.

"నువ్వా!...."

"ఆఁ.... నేనే...."

"ఒరేయ్! సింహాచలం. ఎందుకురా నన్నిలా బాధిస్తున్నావ్? చెప్పు నీకెంత డబ్బు కావాలో!"

"నాకు డబ్బు కాదురా కావాల్సింది. నీ ప్రాణం!"

"ఎందుకు? నీకు నేనేం అన్యాయం చేశాను."

"నువ్వు ఎందరికి ఎన్ని అన్యాయాలు చేసావో నీకు గుర్తులేదా? చెల్లెల్ని చూడ్డానికి ఆశగా వెళ్తున్న లలితను దారుణంగా బస్సులోనే చెరిచావే!"

"అది తప్పే. నేను ఒప్పుకుంటున్నాను."

"తప్పు ఒప్పుకుంటే సరిపోదురా! దానికి శిక్ష అనుభవించాలి.... ఈ గొడవంతా ఎందుకు నిన్ను నేను ఎందుకు బాధించానో.... ఎందుకు చంపదల్చుకున్నానో చెప్తాను విను.

లలిత తన చెల్లెల్ని చూడ్డానికి వెళ్తున్నప్పుడు నువ్వు ఎలా మానభంగం చేసి ఆమె జీవితాన్ని నాశనం చేశావో! అలాగే.... నా చెల్లెలు.... నా కోసం టౌన్‌కి వచ్చింది సంవత్సరం క్రితం నన్ను కలుసుకోవడానికి. దాన్ని ఎవడో దుర్మార్గుడు మాయమాటలు చెప్పి నేను తనకి తెలుసనీ ఇల్లు మారాననీ నమ్మించి ఒక పాడుబడిన ఇంటికి తీసుకెళ్ళి చెరిచాడురా! అది అవమానం భరించలేక జరిగిందంతా ఉత్తరం రాసి రైలు క్రిందపడి చచ్చిపోయింది.

అప్పట్నుంచీ చూస్తున్నా.... దాన్ని చెరిచినవాడు చిక్కితే కసితీరా చంపాలని. కాని దొరకలేదు. ఇన్నాళ్ళ తర్వాత నువ్వు అదే తరహాలో లలితను మానభంగం చేశావు. లలితగూడా రైలు క్రిందపడి చచ్చిపోయింది. ఆ రోజునే నిర్ణయించుకున్నా నువ్వే నా చెల్లెల్ని గూడా చెరిచినవాడివని...."

"నో.... సింహాచలం.... నో.... నేను కాదు నీ చెల్లెల్ని చెరిచింది."

"కాదు.... నువ్వే...."

"సింహాచలం.... కాదు. నువ్వు పొరబడుతున్నావు.

నీ చెల్లెల్ని మోసంచేసి చెరిచింది నేను కానే కాదు. నన్ను వదిలెయ్!....నువ్వు కోరినంత డబ్బు ఇస్తాను" విజయ్ ఆక్రోశిస్తున్నాడు ప్రాణభయంతో.

సింహాచలం వికటంగా నవ్వాడు.

"నిన్ను వదలాలా?....అది కల్ల. నువ్వు విషపురుగువి... నిన్ను వదిలితే ఇంకెందరి జీవితాలని నాశనం చేస్తావో?... నా చెల్లెల్ని చెరిచింది నువ్వు కాకపోయినాసరే....లలితే నా చెల్లెలు అనుకుంటున్నా!....లలితను చెరిచినందుకైనా నిన్ను చంపుతాను. అప్పటికిగాని నా గుండెలోని మంటలు చల్లారవు...."

అంటూ సింహాచలం చటుక్కున ఆరంగుళాల కత్తి తీసి విజయ్ గుండెల్లో కసితీరా పొడిచాడు.

అంతే—

విజయ్ హృదయవిదారకరమైన చావుకేక ఆ కొండల్లో ప్రతిధ్వనించింది.

—:ఐపోయింది:—

# కోటీశ్వరుని హత్య!

## టెంపోరావ్

వాలిగారు పడకకుర్చీలో కూర్చుని చుట్ట కాలుస్తూ ఏదో చూస్తున్నారు. అప్పుడే గదిలోకొచ్చి నేనాయన ఎదురుగా నిలబడ్డాను.

"గిరీ, మనం వెంటనే వెళ్ళాలి," అన్నాడాయన.

"ఎక్కడికి?" ప్రశ్నించాను.

తన చేతిలో వున్న కాయితాన్ని ఆయన నాకిచ్చారు. టెలిగ్రామ్! వేగంగా చదివాను. వెంటనే నెల్లూరువచ్చి ఒక హత్యకేసులో తనకు సహాయపడమన్నాడు ఇన్‌స్పెక్టర్ సుబ్బారావు.

టెలిగ్రామ్ చదివి వాలిగారివైపు చూశాను.

"ఏదో పెద్ద హత్యకేసయితేగాని సుబ్బారావు నాకు టెలిగ్రామ్ యివ్వడు. మరో పావుగంటలో కారులో వెళ్దాం," అన్నారాయన.

XYZ కారులో నెల్లూరు చేరుకున్నాం. పాతబడిన పోలీస్ స్టేషన్ ముందు కారు ఆపాను. మమ్మల్ని చూసి

ఒక కానిస్టేబుల్ లోపలకు పరుగెత్తాడు. పెద్ద అంగల్లో ఇన్‌స్పెక్టర్ సుబ్బారావు కారు దగ్గరకొచ్చి వాలిగారికి నవ్వుతో నమస్కరించాడు.

"సుబ్బారావు భాయ్, ఎలా వున్నావు?" అడిగాడు వాలిగారు.

"అంతా బాగానే వుంది సార్. వెంటనే వచ్చినందుకు మీకు నా ధన్యవాదాలు. మీ కారులో నేను వస్తాను. జీప్ వెనకనే వస్తుంది."

ఇన్‌స్పెక్టర్ నన్ను విష్ చేసి వెనుక సీటుమీద కూర్చొని తలుపు మూశాడు. కారును పోనిచ్చాను. వెనుకనే పోలీస్ జీప్ వస్తోంది.

పక్కకు తిరిగి వాలిగారు వెనుక కూర్చున్న ఇన్‌స్పెక్టర్ వంక చూశారు.

"హత్య గురించి ముఖ్య విషయాలు చెప్పు!"

"హత్యచేయబడిన వ్యక్తి ప్రముఖ పారిశ్రామికవేత్త కతుల బలరామ్. ఆయన పేరు మీరు వినేవుంటారు" అని ఇన్‌స్పెక్టర్ ఆగాడు.

"ప్రొసీడ్!" అన్నారు వాలిగారు.

ఎలా కారును పోనివ్వాలో నాతో చెప్పి ఇన్‌స్పెక్టర్ వాలిగారివేపు తిరిగాడు.

"క్రితం రాత్రి పది తర్వాత యీ హత్య జరిగుండాలి. ఆయన ఆరో భార్య సుమలతను తాళ్ళతో మంచానికి కట్టేశారు. భర్తను చంపుతుంటే ఆమె యేమీ చెయ్యలేని స్థితిలో వుండవలసి వచ్చింది. హత్య జరిగిన గదిలో అన్నీ అలాగే వున్నాయి. ఏ వస్తువులనూ కదల్చవద్దని నేను వుత్తరువిచ్చాను. సుమలతను మాత్రం కట్లువిప్పి విడుదల చేసాం" అన్నాడు సుబ్బారావు.

ఎడం వైపుకు తిప్పి కారును పోనిచ్చాను. పెద్ద గేటు యెదురుగా కనిపిస్తోంది. కోట సింహద్వారంలా వుంది. గేటుపక్కన ఒక వాచ్ మన్, పోలీసు కానిస్టేబులు నిలబడి వున్నారు.

గేటు తెరవబడింది. కారును లోపలకు పోనిచ్చాను. సిమెంటు గోడు. గోడు కిరువైపులా పూల మొక్కలు. దూరంలో నీలిరంగు మేడ కనిస్తోంది. వివిధరకాల చెట్లు కాంపౌండులో అగుపిస్తున్నాయి. కత్తుల బలరామ్ కోటీశ్వరుడయి వుండాలి.

పోర్టికోలో కారాపాను. వాలిగారూ, ఇన్ స్పెక్టర్ సుబ్బారావూ దిగారు.

"ఆ పార్కింగ్ ప్లేస్ లో కారాపి రండి," అన్నాడు ఇన్ స్పెక్టర్ నాతో.

కారును పోనిచ్చి పార్కింగ్ ప్లేస్ లో ఆపి, దిగాను. పోలీస్ జీప్ పక్కనే ఆగింది. ముగ్గురు కానిస్టేబుల్సు కిందకు దూకేరు.

పోర్టికోలోంచి వరండామీదుగా ముందు హాల్లోకి వెళ్ళాను. చుట్టపొగ వదల్తూ వాలిగారూ, ఇన్ స్పెక్టర్ సుబ్బారావు హాల్లో వున్నారు.

పెద్దహాలు. అందమయిన సోఫాలు నలభై పైన హాల్లో వున్నాయి. గోడలకు ఆయిల్ పెయింటింగ్సు అమర్చబడి వున్నాయి.

"రండి లోపలకు," అన్నాడు సుబ్బారావు.

ఇన్ స్పెక్టర్ వెనకనే వాలిగారు లోపలకి వెళ్ళారు. వాళ్ళను వెంబడించాను. ఒక గదిముందు కానిస్టేబుల్ కాపలావున్నాడు. అతడు అటెన్షన్ తో శల్యూట్ చేశాడు. వాళ్ళు గదిలోకి వెళ్ళారు. వెనకనే నేను

నడిచాను.

పెద్ద పడగ్గది. గదిలో రెండు ఫ్యాన్‌లు తిరుగుతున్నాయి. లైట్లు వెలుగుతున్నాయి. గోడవారగా ఎత్తయిన మంచం వుంది. మంచంమీద రెండు ఫోమ్ పరుపులు, చక్కటి తలగడలు. పైన పర్చిన వెల్వెట్ దుప్పటి మెరుస్తోంది.

మంచానికి దూరంలో నేలమీద పడున్న వ్యక్తిని వాలిగారు పరీక్షిస్తున్నారు. అతడి వయస్సు యాభయిపైన వుంటుంది. పొడుగ్గా, సన్నగా వున్నాడు. టెర్లీన్ పాంటు, స్లాకు ధరించాడు. అతడు వెల్లికిలా పడి వున్నాడు.

అతడిని పరీక్షగా చూస్తూ వాలిగారి పక్కనే నుంచున్నాను. అతడి మెడ నరికివేయ బడింది. నేలను కప్పిన తివాసీమీద విపరీతంగా రక్తంపడి నిండిపోయింది.

శవం పక్కనే కత్తి పడుంది. కత్తికి ఎర్రటి పిడి! కత్తిమీద రక్తం మరకలు స్పష్టంగా కనిపిస్తున్నాయి.

అంతవరకూ వంగిచూసిన వాలిగారు లేచి ఇన్‌స్పెక్టర్ వంక చూశారు.

"ఈగద యెవరిది?"

"ఇది సుమలత పడగ్గది సార్."

"అమ్మాయి ఎక్కడుంది?"

"పక్కనున్న భర్త గదిలో ఆమె నిద్రపోతూ వుండాలి. ఇదంతా చూడ్డం మూలంగా ఆమె మెదడుకు షాక్ సంభవించింది. సెడేటివ్ యిచ్చి డాక్టరు ఆమెను ప్రక్కగదిలో పడుకోబెట్టారు," అన్నాడు సుబ్బారావు.

"భర్త కళ్ళముందు మరణించడం భారత స్త్రీకి పెద్ద

షాకే" అన్నారు వాలిగారు.

వాలిగారు గది నాలుగువైపులా తిరిగి అంతా పరికిస్తున్నారు. ఒక రోజ్‌వుడ్ టేబులుమీద వాట్ 69 స్కాచ్ విస్కీ బాటిలు వుంది. పక్కనే రెండు గ్లాసులు వున్నాయి. వాటివైపు చూస్తూ వాలిగారు ఆగారు. విస్కీ బాటిల్లో సగం పైన మత్తుద్రవం వుంది.

"ఈ గదిలోకి వచ్చిన యిద్దరూ ఆ గ్లాసుల్లో విస్కీ పోసుకొని తాగి పారిపోయారుట. అదంతా సుమలత నాతో చెప్పింది" అన్నాడు సుబ్బారావు.

"జరిగినదంతా అమ్మాయి నీతో చెప్పిందన్నమాట."

"చెప్పింది సార్. ఆమె నిద్రలోంచి మేల్కొన్నది, గదిలో చప్పుడు విని. మంచం పక్కనున్న స్విచ్‌లు నొక్కింది. గదిలోని లైట్లు వెలిగాయి. బీరువా ప్రాంతంలో వున్న ఇద్దరు మనుషులవైపు ఆమె గాభరాగా చూసింది.

ఆమె కెవ్వున అర్చింది. పక్క గదిలో వున్న భర్త ఆమె కేక విని వచ్చాడు. ఒకతను ఆమెను కదలకుండా పట్టుకున్నాడు. రెండో అతను గోడకు వేళ్ళాడుతోన్న కత్తినితీసి బలరామ్‌గారి మెడను నరికేశాడు. ఆయన అరుస్తూ కిందపడ్డారు."

"ఇంట్లోవున్న నౌఖర్లు యేమయ్యారు?" అడిగారు వాలిగారు, మంచం కాలు ప్రాంతంలో వున్న నైలాన్ తాడువైపు చూస్తూ.

"గూర్ఖా వాచ్‌మన్ గేటుముందు వుంటాడు. తోట పనిచేసే నాగులు, సోములు వాళ్ళ కుటుంబాలతో వెనుక నిర్మించబడిన క్వార్టర్సులో వుంటారు. ఈ భవనంలో సుమలత ఆమె భర్త మాత్రం వుంటారు. వంటామె ఆది

లక్ష్మి డైనింగ్ హాల్లో పడుకుంటుంది. ఆమె నిద్రపోతే ఒకంతట లేవదు."

హత్యకు ఉపయోగించిన కత్తిమీదకు మళ్ళింది వాలిగారి దృష్టి.

"ఆ కత్తి ఎవరిది?"

"అది బలరామ్ తాతగారి కత్తిట. ఎంతకాలంనుంచో అది గోడమీదున్న మేకుకు వేళ్ళాడుతూ వుండేదట."

ఒక కానిస్టేబుల్ గదిలోకొచ్చి యినస్పెక్టర్‌తో ఏదో తగ్గు స్వరంలో చెప్పాడు.

"వాలిగారూ, సుమలత మేల్కొన్నదట. ఆమె ఏ స్థితిలోవుందో చూసి వస్తాను," అని యినస్పెక్టర్ సుబ్బారావు పరుగెత్తాడు.

గదిలో క్షణకాలం నిశ్శబ్దంగా వుంది. చుట్టపొగ వదులుతూ వాలిగారు నలువైపులా చూస్తూ ఆలోచిస్తున్నారు. ఆయన దగ్గరగా జరిగాను.

"దొంగతనం కోసం ఈ హత్య జరిగిందంటారా?" అడిగాను.

"దొంగకు అడ్డుపడితే చంపడానికి వెనుదీయడు!" అన్నారాయన క్లుప్తంగా.

"ఈ భవనంలోకి దొంగలు ఎలా ప్రవేశించారో?"

"అది మనం కనుక్కోవాలి!"

గబగబా యిన్‌స్పెక్టర్ సుబ్బారావు గదిలోకొచ్చాడు.

"డాక్టర్ ఆమెతో వున్నారు. అరగంట తర్వాత మీరు ఆమెతో మాట్లాడవచ్చని డాక్టర్ అన్నారు," అని ఇనస్పెక్టర్ సుబ్బారావు చెప్పాడు.

"మంచిది," అని వాలిగారు తలాడించారు.

సుమలత వయసు యిరవైఐదు వుంటుందేమో! కాని ఆమె యిరవై రెండేళ్ళ స్త్రీలా కనిపిస్తోంది.

సోఫాలో కూర్చొని వున్న ఆమెను చూడగానే నా గుండె వేగంగా కొట్టుకోసాగింది. ఆమె చాలా అందంగా వుంది. పొట్టిగా, పచ్చగా అప్పుడే వికసించిన పువ్వులా వుందామె. ఏదో బాధ ఆమె మొహంలో గోచరిస్తోంది.

ఆమె మా అందర్కీ నమస్కరించి కూర్చోమంది. ఎదురుగా వున్న సోఫాలో కూర్చున్నాం. ఇది బలరామ్ పడగ్గది. హత్య జరిగిన గది పక్కనే వుంది.

వాలిగారు ఆమెవంక కొంతసేపు మౌనంగా చూశారు.

"అమ్మాయి, ఏం జరిగిందో చెప్పు!" అన్నారాయన.

"నేను చూసినదంతా ఇన్‌స్పెక్టర్‌కి చెప్పాను. మళ్ళీ చెప్పడం దేనికి?" అందామె.

"అంతా చూసిన నువ్వు చెప్పడం మంచిది. నీ భర్తను ఎవరు హత్యచేశారో తెల్సుకోడానికి వుపయోగ పడ్తుంది" అన్నారు వాలిగారు.

గది చాలా విశాలంగా వుంది. మూలంలో పెద్ద మంచం. ఎత్తయిన పరుపు. గదిలో స్టీల్ బీరువాలు, రోజ్‌వుడ్ టేబుల్, టీపాయ్ వగైరాలున్నాయి. గోడకున్న మేకుకి టెన్నిస్ రాకెట్ వేళ్ళాడుతోంది.

"వాలిగారూ, నిన్న రాత్రి పదింటికల్లా నేను నిద్ర పోయాను. ఏదో చప్పుడై లేచాను. గదిలో చీకటిగా వుంది. నా పరుపు పక్కనే వున్న స్విచ్‌లు నొక్కాను. వెంటనే లైట్లు వెలిగాయి. తెరిచిన బీరువాముందు నిలబడి వున్న యిద్దరు మనుషుల్ని చూసి గాభరాగా అర్చాను. మంచంమీదనుంచి కిందకు దూకాను. ఒకతడు పరుగెత్తు కొచ్చి నన్ను పట్టుకొని నోరు నొక్కేశాడు. కాస్సేపట్లో

ఆయన పక్క తలుపు తెర్చుకుని నా గదిలోకొచ్చారు. నన్ను పట్టుకున్న మనిషివైపు ఆయన కోపంగా చూశారు. 'రాస్కెల్, ఆమెను వదులు!' అని ఆయన అర్చారు. గోడవారగా ఆయన వెనకనున్న రెండోమనిషి మేకుకు వేళ్ళాడుతున్న కత్తిని చేతిలోకి తీసుకున్నాడు. గట్టిగా అరవాలనుకున్నాను. కాని అరవలేని స్థితిలో వున్నాను."

ఆమె కళ్ళు మూసుకుంది. జాలిగా ఆమెవైపు చూస్తూ వుండిపోయాను. ఆమె కళ్ళమ్మట కన్నీళ్ళు కారుతున్నాయి.

"అమాంతంగా అతడి చేతిలోని కత్తి ఆయన మెడ మీదకు బలంగా దిగింది. ఆయన అరుస్తూ కిందపడ్డారు. అటుపైన వాళ్ళిద్దరూ నన్ను మంచం కాలుకి నైలాన్ తాడుతో కట్టేశారు. నోట్లో గుడ్డలు కుక్కేశారు. నిస్సహాయంగా కూర్చుని జరిగినదంతా చూస్తూ వుండిపోయాను. బీరువాలోని నగలు, డబ్బు, వెండి పాత్రలు నల్లటి తోలు బాగ్‌లో పడేసుకుని లిక్కర్ కాబినెట్ దగ్గరకు వెళ్ళారు. అక్కడవున్న విస్కీ బాటిల్సు, రెండు గ్లాసులను టేబుల్ దగ్గరకు తెచ్చారు. అరగంటపైదాకా విస్కీ సేవిస్తూ నిలబడ్డారు. అటుపైన బాగ్ పట్టుకుని వెళ్ళిపోయారు."

"వాళ్ళు ఎటువైపు వెళ్ళారు?"

"ఆయన గదిలోకి వెళ్ళారు. అక్కడినుంచి ఎలా బయటకు పోయారో నాకు తెలియదు" అందామె.

"బాత్‌రూమ్ తలుపు తెరిచి వాళ్ళు బయటకు పోయారు, సార్. ఆ తలుపు యింకా తెరిచే వుంది" అన్నాడు ఇన్‌స్పెక్టర్ సుబ్బారావు.

వాలిగారు లేచారు. యటాచ్డ్ బాత్‌రూంలోకి

ఆయన వెనకనే వెళ్ళాను. తలుపు తెరిచివుంది. అటువైపు నున్న తోట కనబడింది.

"ఇలా వాళ్ళు పోయారు సార్," అన్నాడు ఇన్‌స్పెక్టర్.

ఘుగ్గురం తిరిగి పడగ్గదిలోకి వచ్చి సోఫాల్లో కూర్చున్నాం.

వాలిగారు ఆలోచిస్తూ చుట్టపొగ వదుల్తున్నారు.

"అటువైపునుంచే వాళ్ళు భవనంలో ప్రవేశించి వుండాలి." అన్నారాయన.

"అవును సార్," అన్నాడు ఇన్‌స్పెక్టర్ సుబ్బారావు.

వాలిగారి చూపు ఆమె వైపు వెళ్ళింది.

"అటుపైన ఏం జరిగింది?"

"నా నోట్లోని గుడ్డపీకల్ని మెల్లిగా బయటపడేసి గట్టిగా అరవసాగాను. రెండు నిముషాల తర్వాత ఆది లక్ష్మి గదిలోకొచ్చింది. నన్ను, ఆయన శవాన్ని చూసి ఆమె హడలిపోయింది. వెంటనే పోలీసు రిపోర్టివ్వమన్నాను. నా గదిలోంచే ఆమె ఫోన్ చేసింది. పోలీసులు పావుగంటలో వచ్చారు. నన్ను తాళ్ళనుంచి బయటకు తీశారు."

ఇన్‌స్పెక్టర్ సుబ్బారావు సోఫాలోంచి లేచి మా ఎదురుగా వచ్చాడు.

"కదలకుండా ఆమెను కట్టేశారు. చేతులు వెనక్కి విరిచి కట్టారు. ఆమెను కట్టిన తాడు యింకా అక్కడే వుంది," అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"చూశాను." అన్నాడు వాలిగారు.

ఆరిపోయిన చుట్టను ఆయన లైటర్‌తో వెలిగించారు.

ఆయన సూటిగా ఆమెవైపు చూశారు.

"అమ్మాయి వాళ్ళిద్దర్నీ వర్ణించగలవా?"

"ఆయన్ని హతమార్చి నతడు పొడుగ్గా, బలంగా వున్నాడు. గిరిజాల జుత్తు నల్ల పాంట్, స్పోర్ట్స్ బనియన్ వేసుకున్నాడు. మధ్యలో వెడల్పయిన బెల్టు. నన్ను పట్టుకున్నతను కుర్రాడు. వయస్సు యిరవై వుంటుందేమో. అతనూ పొడుగ్గా వున్నాడు. సన్నటి మనిషి. అతడు పాంట్ టీషర్టు ధరించాడు. అతడికీ బెల్టుంది. ఇద్దరూ నల్లగా వున్నారు."

"దాన్నిబట్టి వాళ్ళెవరో మనం వూహించవచ్చు!" అన్నాడు సుబ్బారావు.

"ఎవరు వాళ్ళు?"

"గజదొంగ బాజీప్రసాద్, అతడి కొడుకు తాజీ ప్రసాద్. ఈ ప్రాంతంలో వాళ్ళు చాలా దొంగతనాలు చేశారు, చేస్తున్నారు. వాళ్ళకోసం పోలీసులు వెతుకుతున్నారు" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

ఇన్‌స్పెక్టర్ సుబ్బారావు లేచాడు. టేబుల్ మీద పాత దిన పత్రికలు ఎత్తుగా పేర్చబడి వున్నాయి. అక్కడకు వెళ్ళి వెతికి ఒక పత్రిక తీసుకొని వచ్చి వాలిగార్కి చూపించాడు.

"ఈ ఫోటో చూమండి!"

వాలిగారూ, నేనూ ఫోటోవంక చూశాం. బాజీ ప్రసాద్, తాజీ ప్రసాద్ పక్కపక్కనే నిలబడివున్నారు. సుమలత వర్ణించినట్లే వున్నారిద్దరూ!

వాలిగారు ఎందుకో విచిత్రంగా నవ్వారు.

"ఈ యిద్దరూ ఏ వూరివాళ్ళు?"

"బాజీ ప్రసాద్ యింతకుముందు మూడు, నాలుగు

సార్లు జైలుకి వెళ్ళాడు. కాని జైల్లో ఎక్కువరోజులు వుండలేదు. బయటకు పారిపోయాడు. పెద్దవాడైన కొడుకు కూడా తండ్రితో కలిసి పనిచేస్తున్నాడని మాకు సమాచారం అందింది. వాళ్ళిద్దరూ యీ వూరి వాళ్ళే."

"బాజీ ప్రసాద్ భార్య ఎక్కడుంది?"

"ఆమె యిదే వూర్లో వుంది. వాళ్ళను గురించి తన కేమీ తెలియదంటుంది. ఆమె మంచిది. ఆమెకు దైవ భక్తి ఎక్కువ. ఒక సి. ఐ. డి. యిరవై నాలుగ్గంటలూ ఆమెను గమనిస్తూ వుంటాడు. కాని యింతవరకూ మాకు ఏమీ తెలియలేదు," అన్నాడు సుబ్బారావు.

చుట్టపీలుస్తూ వాలిగారు సోఫాలోంచి లేచి ఆమె ముందుకు వెళ్ళారు.

"అమ్మాయి, నీకు బలరామ్‌తో ఎలా పరిచయ మయింది?"

"అదంతా పెద్ద కథ సార్," అందామె.

"అదంతా నువ్వు చెప్తే నేను వింటాను," అని వాలి గారు ఇన్‌స్పెక్టర్ వైపు తిరిగారు.

"సుబ్బారావు భాయ్, నువ్వు నీ పని కానీ! శవాన్ని పోస్టుమార్టమ్‌కు పంపు. విస్కీ బాటిల్ మీద, గ్లాసుల మీద, కత్తి పిడిమీద వేలిముద్రలు ఉన్నాయేమో చూడమను," అన్నాడాయన.

"అంతా చేయిస్తాను సార్," అని యిన్‌స్పెక్టర్ పక్క గదిలోకి వెళ్ళిపోయారు.

## 3

సుమలత విచారవదనంతో మావైపు చూసింది.

"వాలిగారూ, బొంబేలో బలరామ్ గారితో నాకు

పరిచయమయింది. నేను హిందీ సినిమాల్లో చిన్న పాత్రలు ధరిస్తూ ఉండేదాన్ని. అన్నయ్యా, అమ్మ తప్ప నాకెవ్వరూ లేరు. అన్నయ్య ఆర్మీలో చేరిపోయాడు. సినిమాల్లో నటించి ఆ ఆదాయంతో మేం జీవించేవాళ్ళం. బలరామ్‌గారు నన్ను పెళ్ళాడ్తానన్నారు. పేదరికంతో నాకు విసుగెత్తిపోయింది. సినిమా రంగంలో చిన్న పాత్రలు వేస్తూ పదిమందికి తలొంచి జీవించడంకంటె ఒక వ్యక్తికి భార్యనై ఉండడం మంచిదనిపించి ఒప్పుకున్నాను. పెళ్ళయినాక నేను ఆయనతో యిక్కడికి వచ్చేశాను."

"నీ తల్లి ఏమయింది?"

"ఆరునెలల క్రితం ఆమె చనిపోయింది."

"నీ అన్న నీకు ఉత్తరాలు రాస్తూ ఉంటాడా?"

"అన్నతో పూర్తిగా బంధం తెగిపోయింది. అన్నయ్య ఎక్కడున్నాడో, ఏమయినాడో తెలియదు. అమ్మ పోయినపుడు కూడా అతడు రాలేదు."

"బలరామ్‌తో నీ జీవితం సుఖంగా సాగేదా?"

ఆమె వెంటనే జవాబివ్వలేదు. మావైపు మౌనంగా చూసింది.

"ఈడూ జోడూ కలియని సంసారం మాది. ఆయన మొదట్లో నన్ను బాగా చూసేవారు. ఆరునెలల తర్వాత నేను పాతదాన్నయిపోయాను! ఆయన తాగుడులో మునిగి తేల్తూ జీవించేవారు. ఆయనకు జీవితంలో చాలా ప్రియమయినది—అల్కహాల్!"

"తాగుడులో అతడు నిన్ను కొట్టేవాడా?"

"అంతపని ఎన్నడూ చెయ్యలేదు. క్షణంలో ఆయనకు కోపం వచ్చేది. ఆ సమయంలో ఆయనకు దూరంగా

ఉండేదాన్ని."

"మీ పెళ్ళయి ఎంత కాలం అయింది?"

"రెండేళ్ళయింది—"

"నువ్వు అతడి ఆరో భార్యవని విన్నాను. అతడి ఐదుగురు భార్యలు ఏమయ్యారు?"

"ముగ్గురు మరణించారని విన్నాను. ఇద్దర్ని ఆయన డైవర్స్ చేసేశారు."

"ఆయనకు సంతానం లేదా?"

"లేదు."

ఆమెవైపు వాలిగారు సూటిగా చూశారు.

"అమ్మాయి, నాకు తెలిసినంతమటుకు బలరామ్ కోటీశ్వరుడు. అతని ఆస్తి నీకే వెళ్తుందా?"

"ఆయన భార్యనుగా? నాకు గాక మరెవరికి వెళ్తుంది?" అమె విచిత్రంగా ప్రశ్నించింది.

"అతడు వీలునామా రాశాడా?"

"నాకు తెలియదు. రాసినట్లు ఆయన చెప్పలేదు. అడ్వకేటు చంద్రంగార్ని అడిగితే తెలుస్తుంది."

"నీ భర్తకు ఎవరేనా శత్రువులున్నారా?"

"నాకు తెలియదు. అటువంటివేమీ ఆయన నాతో మాట్లాడేవారుకాదు. నిజం చెప్పాలంటే ఏ విషయం గురించీ ఆయనతో మాట్లాడలేము. ఆయన ఎప్పుడూ నిషాలో ఉండేవారు."

"అతడు యింతకుముందు తాగేవాడా?"

"మునుపు తక్కువగా తాగివుండొచ్చు. ఈ మధ్య తాగుడు ఎక్కువైంది," అందామె.

"గదిలోకొచ్చిన ఆ యిద్దరు దొంగలూ ఎంత పట్టుకు పోయారో చెప్పగలవా?"

"చెప్పలేను సార్. వాళ్ళు నా ఒంటిమీదున్న నగలు తీసుకుపోలేదు. బీరువాలో ఉన్నవి పట్టుకు పోయారు. ఎంత డబ్బు పట్టుకుపోయారో నేను చెప్ప లేను. నా బీరువాలో ఎంత డబ్బుందో నాకే తెలియదు." అందామె.

వాలిగారు మాట్లాడలేదు. చుట్టపొగ వదుల్తూ ఆమె వైపు చూస్తున్నారు.

"వాలిగారూ, ఇంట్లో ఎంత బంగారముందో నాకు తెలియదు. నా గదిలోని బీరువాల్లో ఎన్నో ఆభరణాలు ఉంటాయి. నోట్ల కట్టలు కుప్పలుగా పడుంటాయి. అదంతా పరీక్షగా చూసే తీరిక నా కెన్నడూ లేదు," అందామె.

"అమ్మాయి సముద్రంలోని నీళ్ళను ఎవరు కొలవ గలరు?" అన్నారు వాలిగారు చిరునవ్వుతో.

ఆయన గుమ్మంవైపు వెళ్తూ ఎందుకో ఆగి ఆమెవంక తీవ్రంగా చూశాడు.

"అమ్మాయి గత రాత్రి యీ భవనంలో ప్రవేశించి నీ భర్తను హతమార్చిన వాళ్ళిద్దరికోసం నేను అన్వే షిస్తాను. అది నీ కిష్టమేగా?"

ఆమె వాలిగారివంక సూటిగా చూసింది. నీళ్ళతో నిండిన కళ్ళను తుడుచుకుంది.

"వాలిగారూ, బలరామ్‌గారు నా భర్త. ఆయన యిలా హత్య చేయబడినందుకు నేనెంతగానో విచా రిస్తున్నాను. వాళ్ళిద్దర్నీ మీరు పట్టుకుంటే నేనెంతో సంతోషిస్తాను. ఆయన ఆత్మకు శాంతి చేకూర్తుంది," అందామె.

వాలిగారు పెద్ద అంగల్లో పక్కగదిలోకి వెళ్ళిపోయారు. వెనకనే వేగంగా వెళ్ళాను.

# 4

సుమలత పడగ్గదిలో శవం లేదు. ఇన్‌స్పెక్టర్ సుబ్బారావు వాలిగారివైపు వచ్చాడు.

"శవాన్ని పోస్టుమార్టమ్‌కి పంపించాను. ఆ గ్లాసుల మీద, కత్తిపిడిమీద వేలిముద్రలు లేవు!" అన్నాడతను.

వాలిగారు మెల్లిగా మంచం దగ్గరకి వెళ్ళారు. మంచం కాలుకు కట్టబడి వున్న నైలాన్ తాడును పరీక్షించారు. కొన్ని గుడ్డపీలికలు తివాసీమీద పడున్నాయి. ఈ గుడ్డ పీలికలు ఎక్కడ నుంచి వచ్చాయి? మంచం మీదున్న తలగడ వైపు ఆయన చూపు వెళ్ళింది. తలగడ గలేబు ఒకవైపున చింపబడి వుంది.

వాలిగారు వెనక్కి తిరిగి స్టీలు బీరువాల దగ్గరకు నడిచారు. ఒక బీరువాను తెరిచారు. అందులో పట్టుచీరలు, ఖరీదయిన దుస్తులు వున్నాయి. ఆయన రెండో బీరువాను తెరిచి చూశారు.

నోట్లకట్టలు యెన్నో వున్నాయి. కొన్ని అరలనిండా నగలున్నాయి.

"దొంగలు పూర్తిగా దోచుకుపోలేదు!" అన్నారాయన నాకేసి చూస్తూ.

"అంతా మొయ్యలేక వదిలేశారేమో!" అన్నాను.

లిక్కర్ కాబినెట్ దగ్గరకు వెళ్ళారాయన. గాజు తలుపుగుండా లోపలున్న బాటిల్స్ వైపు చూశారు. స్కాచ్ విస్కీ బాటిల్స్! బ్రాందీ బుడ్డీలు! జిన్, బీర్ బాటిల్సుకూడా వున్నాయి.

ఏదో ఆలోచన తట్టి ఆయన వేగంగా పక్కగదిలోకి

వెళ్లారు. సుమలత సోఫాలో కూర్చుని కునికిపాట్లు పడుతోంది.

"అమ్మాయి, సారీ, నిన్ను డిస్టర్బ్ చెయ్యవలసి వచ్చింది!" ఆమె కనురెప్పలు చిట్లిస్తూ మావైపు చూసింది.

"లిక్కర్ కాబినెట్ నీ గదిలో వుంది. అతను నీ గదిలో కూర్చుని తాగేవాడా?"

"ఆయన యిష్టమొచ్చినచోట కూర్చుని తాగేవారు. నా గదిలో ఆయన తాగడం ప్రారంభిస్తే నే నాయన గదికిపోయి కూర్చునేదాన్ని. లేకపోతే తోటలో తిరిగేదాన్ని."

"ఆ నైలాన్ తాడు ఎవరిది?"

"మాదే. ఒకచుట్ట టేబుల్ మీద వుండేది. దాన్ని వాళ్ళు తీసుకున్నారు."

"వాళ్ళ చేతులకు గ్లవ్స్ వున్నాయా?"

"లేవు సార్."

"వెళ్ళిపోయేముందు వాళ్ళు గ్లాసులనూ, కత్తిపిడినీ తుడిచేశారా?"

"మీరు అడిగితే గుర్తొచ్చింది. తుడుస్తూంటే నేను చూశాను."

వాలిగారు ఆమెవైపు సూటిగా చూశారు.

"వాళ్ళు యెంతపట్టుకెళ్ళారో మనకు తెలియదు కాని చాలా వదిలేశారని తెలుసు!"

"నేనున్న పరిస్థితిలో బీరువాలు తెరిచి ఎంతపోయిందో చూసే అవకాశం నాకు దొరకలేదు సార్" అందామె దీనంగా.

"వంటామె యెంతకాలం నుంచి యిక్కడ పని

చేస్తోంది?"

"నే నిక్కడ కొచ్చాక ఆమెను పనిలో పెట్టాను."

"ఆమెకూడా బొంబేనుంచి వచ్చిందా?"

"బొంబేలో ఆమె నాకు తెలుసు. నేనే ఉత్తరం రాసి రప్పించాను."

"పడుకునే ముందు అన్ని తలుపులూ మూసివున్నాయో లేదో యెవరు చూస్తారు?"

"నేనే చూస్తాను."

"నిన్న రాత్రి తలుపులన్నీ మూసివున్నాయా?"

"నేను స్వయంగా చూశాను. అన్నీ మూసి వున్నాయి."

"అయితే దొంగలు యెలా లోపలకు వచ్చారు?"

ఆమె కాస్సేపు ఆలోచిస్తూ వుండిపోయింది.

"ఆయన బాత్‌రూమ్‌లోంచి తలుపు తెర్చుకుని తోట లోకి వెళ్ళివుంటారు. తిరిగి వచ్చేటప్పుడు తలుపు మూసి గడియలు వేయడం మర్చిపోయి వుండొచ్చు. అలా అంతకు ముందు యెన్నిసార్లో జరిగింది."

"అప్పుడు యేం చేసేదానవు?"

"నాకు మెలుకువస్తే వెళ్ళి తలుపులను మరోసారి చూసేదాన్ని. ఈ విషయం ఆయనతోకూడా చెప్పాను. దొంగలంటే ఆయన భయపడేవారు కాదు. 'దొంగలకు కావల్సింది డబ్బేగా. పట్టుకుపోనీ!' అనేవారు."

"ఈ దొంగలు డబ్బుతో తృప్తిపడలేదు. అతడి ప్రాణాన్ని తీసుకున్నారు" అన్నారు వాలిగారు.

"గదిలోకొచ్చిన ఆయన్ని చూసి వాళ్ళు భయపడి పోయారు. భయంవలనే వాళ్ళాయనని హత్యచేశారని నా అభిప్రాయం" అందామె సైకియాట్రిస్టులా.

చిరునవ్వుతో ఆయన ఆమెవైపు చూశారు.

"అమ్మాయి, బాగా చెప్పావు. వయస్సులో చిన్న దానివైనా నీ బుర్ర పెద్దది," అని ఆయన వెనక్కి తిరిగారు.

"వాలిగారూ!" పిల్చిందామె.

ఆయన ఆగి ఆమెవైపు చూశారు.

"ఇవాళ యింట్లో వంట చేయొద్దని ఆదిలక్ష్మితో చెప్పాను కాని కాఫీ అందర్కి సిద్ధంగా వుంచమన్నాను. మీరూ, గిరిగారూ, ఇన్‌స్పెక్టర్ గారూ డైనింగ్ హాల్లోకి వెళ్ళి కాఫీ సేవించండి!" అందామె.

"అమ్మాయి, థాంక్స్! వెళ్తాం" అన్నారాయన.

## 5

డైనింగ్ హాలు బ్రహ్మాండంగా వుంది. విశాలమైన టేబుల్ వారనున్న కుర్చీల్లో ముగ్గురం కూర్చున్నాం. టేబుల్ మీద ఫార్మైకాషీట్ చక్కగా అమర్చబడింది. తళతళ మెరుస్తోంది.

ముప్ఫయిఐదేళ్ళ వయస్సులో వున్న ఒక స్త్రీ పెద్ద ప్లేటు తెచ్చి మా ముందు పెట్టింది. ప్లేటులో కేక్స్, బిస్కట్లు వగైరా వున్నాయి. ఆమె వెళ్ళిపోయింది. కాస్సేపయ్యాక తిరిగి వచ్చింది. కప్పులు, సాసర్లు, ఒక కెటిల్లో కాఫీ డికాక్షన్, మరో కెటిల్లో పాలు, పంచదార, కొన్ని చెంచాలు పెట్టి వెళ్ళిపోయింది.

ఆదిలక్ష్మి అంటే ముసల్దయి ఉంటుందని అనుకున్నాను. కాని ఈమె ముసలిది కాదు. పొడుగ్గా, బలంగా వుంది. గోచీ పోసి మరాఠీ వారిలా చీర కట్టుకుంది. సిగ చుట్టుకుంది. నుదురుమీద పెద్ద బొట్టు. చేతికి బంగారం గాజులు. మెళ్ళో ఒంటిపేట గొలుసు. ఆమెది కోల

ముఖం. పెద్ద కళ్లు.

"ఇక్కడ నా పని పూర్తయినట్లే!" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

వాలిగారు రెండు కేక్స్ తిని, బిస్కట్‌లను అందు కున్నారు. క్రాక్‌జాక్ బిస్కట్లను నేను ఆకలితో నమిలే స్తున్నాను.

"సుబ్బారావుభాయ్, నా పని యింకా ప్రారంభం కాలేదు" అన్నారు వాలిగారు నవ్వుతూ.

మూడు కప్పుల్లో డికాక్షన్ పోసి, కాఫీ కలిపాను. వాలిగారు కప్పును అందుకున్నారు. దూరంలో గుమ్మం ముందు నిలబడి వున్న ఆదిలక్ష్మి వంక చూస్తూ ఆయన కాఫీ తాగసాగారు. ఏదో పనున్నట్లు ఆమె వెనుదిరిగి వెళ్ళిపోయింది.

"గిరీ, మనం ఆదిలక్ష్మితో మాట్లాడాలి" అన్నా రాయన.

"ఆమెను పిలవనా?" అడిగాను.

"వద్దు" అని వాలిగారు టేబుల్ని వేళ్ళతో కొట్టారు. కాస్సేపట్లో ఆదిలక్ష్మి మా ముందు కొచ్చింది. ఆమెవైపు ఆయన సూటిగా చూశారు.

"అమ్మాయి, నిన్న రాత్రి నువ్వు ఏం చూశావు?"

"ఏవో అరుపులు విని నేను లేచాను సార్, మెల్లిగా అమ్మగారి గదిలోకి వెళ్ళాను. అక్కడి దృశ్యాన్నిచూసి భయపడిపోయాను. మంచం వారగా అమ్మగారు కింద కూర్చుని వున్నారు. ఆమెను తాళ్ళతో బిగించి కట్టేశారు. తాళ్ళు విప్పాలని దగ్గరకు వెళ్ళాను. ఆమె పోలీసులకు ఫోన్ చెయ్యమన్నారు. చేశాను. పావుగంటలో వాళ్లు వచ్చారు" అంది ఆదిలక్ష్మి.

"గదిలో కొచ్చిన ఆ యిద్దర్నీ నువ్వు చూడలేదన్న మాట!"

"వాళ్ళను గురించి ఆమె చెప్పాక కిటికీలోంచి తోట లోకి చూశాను. చంద్రకాంతిలో రెండు ఆకారాలు నాకు దూరంలో కనిపించాయి. వాళ్ళను ఆపే శక్తి లేక వూరుకున్నాను."

"వాచ్‌మన్‌తో చెప్పితే అతడు ఆపేవాడుగా?"

"వంటమనిషికి ఆ ఆలోచనలు యెలా తట్టుతాయి సార్! అమ్మగారు చెప్పివుంటే అలా చేసేదాన్ని."

"వాళ్ళిద్దరూ యెటువైపు కనిపించారు?"

"దక్షిణం వేపు సార్!"

"బలరామ్ అప్పుడప్పుడు తలుపులు తెర్చి మూయడం మర్చిపోయేవాడా?"

"ఎన్నిసార్లో మర్చిపోయారు సార్. అమ్మగారు వెళ్ళి తలుపులు మూసొచ్చేవారు."

"అమ్మ గదిలోకి నువ్వు యెలా వెళ్ళావు? తలుపు తెర్చివుందా?"

"వెనుకవైపున్న తలుపును ఆమె దగ్గరగా మూసి ఉంచుతారు. ఆమె పిలిస్తే మేలుకొని నేనూ వెళుతూ వుంటాను."

"అమ్మాయి నీకు బొంబేలో తెలుసా?"

"చాలాకాలం నుంచి తెలుసండి. ఆమె తల్లికి అనారోగ్యంగా వున్నపుడు నేను వంటచేసి పెట్టేదాన్ని. బలరామ్‌గార్ని పెళ్ళాడి ఆమె యీ భవనంలోకి వచ్చారు. ఉత్తరం రాసి నన్ను రప్పించారామె" అంది ఆదిలక్ష్మి.

"నమ్ముకున్న వాళ్ళకు సహాయపడడం మానవధర్మం" అన్నారు వాలిగారు.

కాఫీ తాగడం ముగించి వాలిగారు కుర్చీలోంచి లేచారు. డైనింగ్ హాల్లోంచి హాత్య జరిగిన గదివేపు నడిచారు. గది వెనుక తలుపు దగ్గరగా మూసివుంది. ఆయన తలుపును తోశారు. యటాచ్డ్ బాత్ రూమ్ గుమ్మం సమీపంలో వుందా వెనుక తలుపు.

"ఆదిలక్ష్మి యీ గుమ్మంలోంచే లోపలకు వెళ్ళి వుంటుంది!" అన్నారు వాలిగారు.

"అవును సార్!" అన్నాడు ఇన్ స్పెక్టర్.

గుమ్మం దాటి వాలిగారు గది నలువైపులా చూశారు. తీవ్రంగా ఆలోచిస్తూ వుండిపోయారు.

ఎలక్ట్రిక్ బెల్ శబ్దం విని ఇన్ స్పెక్టర్ బయటకు పరుగెత్తాడు. వాలిగారూ, నేనూ ముందు హాల్లోకి నడిచాము. ఇన్ స్పెక్టర్ సుబ్బారావు ఒక వ్యక్తితో మాట్లాడుతున్నాడు. అతడు పొట్టిగా, లావుగా వున్నాడు. ఖరీదయిన సూటు ధరించాడు.

"ఈయన అడ్వకేట్ చంద్రంగారు. బలరామ్ గారి లీగల్ అడ్వయిజర్" అని అతడినీ వాలిగార్కి సుబ్బారావు పరిచయం చేశాడు.

"వాలిగారు! మీ పేరు తెలియనివారుండరు యీ లోకంలో!" అన్నాడు చంద్రం ఆయనకు నమస్కరిస్తూ.

వాలిగారు అతడివైపు చిరునవ్వుతో చూశారు.

"చంద్రం భాయ్. నువ్వు చాలా ఆలస్యంగా వచ్చావు!" అన్నారాయన.

"నేను ఊళ్ళో లేను సార్. ట్రెయిన్ దిగి యింటి కొచ్చి యీ వార్త విన్నాను. వెంటనే యిక్కడి

కొచ్చాను."

వాలిగారు చుట్టపొగ పీల్చి వదులుతూ క్షణకాలం మౌనంగా వున్నారు.

"బలరామ్ యేదయినా వీలునామా రాశాడా?"

"నేను రాయమన్నాను, కాని ఆయన రాయలేదు. బలరామ్‌గారికి బద్ధకం ఎక్కువ! ఏ పనీ తొందరగా చెయ్యరు!" అన్నాడు చంద్రం.

"అతడి ఆస్తి ఎవరికి కెళుతుంది?"

"సుమలత అతని భార్య. ఆమెకే వెళుతుంది."

వాలిగారు మాట్లాడలేదు. ముందు వాళ్ళతో పచార్లు చేస్తూ వుండిపోయారు.

"మీరు నన్ను క్షమించాలి. నేను సుమలతతో మాట్లాడాలి" అన్నాడు చంద్రం.

"గో ఎ హెడ్!" అన్నారు వాలిగారు.

ఆలోచిస్తూ వాలిగారు బయటకు తోటలోకి నడిచారు. ఆయన్ని నేను వెంబడించాను. ఇన్‌స్పెక్టర్ సుబ్బారావు నా వెనకనే వున్నాడు.

సూర్యుడు ప్రకాశిస్తున్నాడు, కాని కిరణాల్లో అంతగా వేడి లేదు. నాగులు, సోములు, తోటలో పని చేస్తున్నారు. వాలిగారు వాళ్ళ సమీపంలో ఆగారు.

"నాగులు, సోములు మీ రేనా?" అడిగారాయన.

"అవునయ్యా!" అన్నారు వాళ్ళు.

"క్రితం రాత్రి మీకు ఏవేనా అరుపులు వినపడ్డాయా?"

"లేదు సార్!" అన్నారు వాళ్ళు.

"మీరు తొందరగా నిద్రపోతారా?"

"పొగల్లా ఎద్దుల్లా పనిచేస్తాం. పెందరాళే భోజనం

చేసి నిద్రపోతాం" అన్నాడు నాగులు.

"వాడు నాటుసారా తాగి తొంగుంటాడు సార్!" అన్నాడు సోములు.

"నువ్వు తాగవా?" అడిగారు వాలిగారు.

"వాడూ నాలాగే తాగుతాడయ్యా!" అన్నాడు నాగులు.

"బలరామ్ గురించి మీరు యేం చెప్పగలరు?"

"ఆయనకు కోపం ఎక్కువ సార్. ఆయ నెప్పుడూ నిషాలో వుంటారు. కోపం వస్తే మమ్మల్ని కొడతారు. కొట్టిన మరు నిమిషంలో ఆయన పదిరూపాయలు యిచ్చి ఏదేనా కొనుక్కోమంటారు!" అన్నాడు సోములు.

"సుమలత ఎటువంటిది?" అడిగా రాయన.

"ఆమె అంతగా మాతో కలవదు సార్. మమ్మల్ని తిట్టదు, కొట్టదు. ఆమె లోకం ఆమెది" అన్నాడు నాగులు.

వాలిగారు తోటలో నడవసాగారు. ఇంటికి దక్షిణం వేపున ముగ్గురం నడుస్తున్నాం. కొంచెం దూరం వెళ్ళాక ఒక మడుగు మాకు కనిపించింది. అందులోని నీళ్ళ వేపు చూస్తూ నిల్చున్నాను.

వాలిగారు మడుగు దగ్గరగా వెళ్ళారు. తడినేల మీదున్న జోళ్ళ ముద్రలు చూసి ఆయన ఇన్‌స్పెక్టర్ వేపు చూశారు.

"సుబ్బారావుభాయ్, లోపలకు మునిగి యీ మడుగులో యేదేనా వాళ్ళు పారేశారేమో మనం కనుక్కోవాలి" అన్నారాయన.

"ఇందులో వాళ్లు ఏం పారేస్తారు సార్?" అన్నాడు ఇన్‌స్పెక్టర్ సుబ్బారావు.

"చూశాక నీకు తెలుస్తుంది" అన్నా రాయన క్లుప్తంగా.

## 6

హోటల్ మిడ్లాండ్ లోని రూమ్ నెంబరు 30 లో వాలిగారు పడకకుర్చీలో కూర్చుని దిన పత్రికను చూస్తు న్నారు. ఆయన కెదురుగా సోఫాలో కూర్చుని నేను రీడర్స్ డైజస్టు చదువుతున్నాను.

ఇన్ స్పెక్టర్ సుబ్బారావు వుషారుగా గదిలో కొచ్చాడు. "వాలిగారూ, ఆ మడుగులో ఏదో వుండ వచ్చు అని మీరు యెలా ఊహించారు?" అడిగాడు ఇన్ స్పెక్టర్.

వాలిగారు గంభీరంగా నవ్వారు.

"సుబ్బారావుభాయ్ వాళ్ళిద్దరూ పట్టుకు పారిపోయిన నల్లటి లెదర్ బాగ్ దొరికిందా?"

"గుడ్ గాడ్ అదెలా వూహించారు?"

వాలిగారి చెయ్యి తలమీదకు వెళ్ళింది.

"మైడియర్ ఫ్రెండ్, యిక్కడున్న బ్రెయిన్ సెల్స్ నాకు ఎంతో చెప్తూ ఉంటాయి! చాలామంది వాటిని ఉపయోగించరు!" అన్నారాయన.

సుబ్బారావు నా పక్కనే సోఫాలో కూర్చున్నాడు.

"వాలిగారూ, మడుగులో లెదర్ బాగ్ దొరికింది. అందులో ఎన్నో నగలూ, కొన్ని వెండి పాత్రలూ వున్నాయి."

"డబ్బు లేదా?"

"నోట్లు లేవు సార్. డబ్బును వాళ్ళు పట్టుకుపోయి వుంటారు. ఈ బాగ్ కోసం వాళ్ళు మళ్ళా వచ్చేవారు. ఎందుకో భయపడి వాళ్ళు ఆ బాగ్ ను మడుగులో పడేసి

వుండాలి," అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"సుబ్బారావు భాయ్, ఈ దొంగలు విచిత్రంగా ప్రవర్తించారు. వాళ్ళు ఉపయోగించినవన్నీ యింట్లో దొరికినవే!"

అర్థంకానట్లు సుబ్బారావు ఆయనవైపు చూశాడు.

"సుమలతను బాధించిన నైలాన్ తాడు యింట్లోదే. బలరామ్‌ని చంపిన కత్తి గదిలో వున్నదే. ఆ లెదర్ బాగ్, అందులోని నగలు అన్నీ బలరామ్ యింటికి చెందినవే. దాన్నిబట్టి ఆలోచిస్తే ఏ ఆయుధాలూ లేకుండా ఆ దొంగలు యింట్లోకి ప్రవేశించారు అని పిస్తుంది. సుబ్బారావు భాయ్, దొంగతనం చేయదల్చిన వాడు బోడి చేతుల్తో వెళ్ళడు!"

"యూ ఆర్ రైట్, వాలిగారూ," అన్నాను.

"ఈ దొంగలు మూర్ఖులై ఉండాలి సార్," అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"నువ్వు పొరబడ్తున్నావు. బాజీ ప్రసాద్, తాజీ ప్రసాద్. మూర్ఖులు కారు. ఈమధ్య ఎన్నో దోపిడీలు వాళ్ళు విజయవంతంగా సాగించారు. వాళ్ళను గురించి పత్రికల్లో ఎంతో వచ్చింది. వేలకువేలు దోచుకుని వాళ్ళు పారిపోగల్గారు. అటువంటి ఆరితేరిన దొంగలు బలరామ్ యింట్లో ప్రవేశించి పెద్దపెట్టున దోచుకోకుండా ఎందుకు పారిపోయారు?" వాలిగారు ప్రశ్నించారు.

"ఇది సరైన ప్రశ్నే, సార్," అన్నాడు సుబ్బారావు.

"బలరామ్‌ని చంపి, ఆమెని బంధించి అంత తతంగం చేసి చివరకి లెదర్ బాగ్‌ను ముసుగులో పారేసి వాళ్ళు పోతారా?" అడిగారు వాలిగారు.

"అయితే యీ దొంగతనం వాళ్ళు చెయ్య లేదంటారా?"

వాలిగారు మాట్లాడలేదు. సీలింగ్ వైపు చూస్తూ మౌనంగా వుండిపోయారు.

"సుమలత వాళ్ళను బాగా వర్ణించింది. దినపత్రికలోని ఫోటో చూపిస్తే 'అలాగే వున్నారు', అందామె."

వాలిగారు నవ్వారు.

"ఈ మధ్య ఎక్కడ దొంగతనాలు జరిగినా అందరూ వాళ్ళనే వర్ణిస్తున్నారనుకుంటాను," అన్నారు వాలిగారు.

ఇన్‌స్పెక్టర్ సుబ్బారావు ఆయనవంక సూటిగా చూశాడు.

"వాలిగారూ, యీ దొంగతనం చేసినవాళ్ళు బాజీ ప్రసాద్, తాజీ ప్రసాద్ కాదని మీ నమ్మకమా?"

"వాళ్ళిద్దరూ యింతవరకూ ఎవరినైనా చంపారా?"

"లేదు," అన్నాడు సుబ్బారావు.

"బలరామ్ బలమైనవాడు కాదు. అతడిని చంపవలసిన అవసరంలేదు. సుమలతనూ, అతడినీ కూడా తాళ్ళతో కట్టిపడేసి దొంగలు పని ముగించుకుని పోవచ్చు. మరో విషయం! డబ్బుకోసం దొంగతనం చేసేవాళ్ళు దొంగి లించిన సొత్తును ఏ మడుగులోనో పారేయరు? ఇదంతా సిల్లీగా వుంది! మైడియర్ ఫ్రెండ్! యీ దొంగతనం చేసినవాళ్ళు కావలసింది డబ్బుకాదు, బలరామ్ ప్రాణం!" అన్నారు వాలిగారు గంభీరంగా.

ఇన్‌స్పెక్టర్ సుబ్బారావు ఆశ్చర్యపోతూ చూశాడు.

"మీరు చెప్పింది నిజమేననిపిస్తోంది!" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

వాలిగారు పడక కుర్చీలోంచి లేచారు. గదిలో

కొంతసేపు పచార్లుచేసి మా కెదురుగా ఆగారు.

"బలరామ్ హత్య ఎలా, ఎందుకు జరిగిందో కొంత వరకు నాకు తెలుసు. మరి కొంత సమాచారం నాకు కావాలి. అటుపైన పూర్తిగా నిజం తెలుస్తుంది," అన్నారు వాలిగారు.

"వాలిగారూ మీ రెవర్ని అనుమానిస్తున్నారు?"

"అందర్నీ అనుమానిస్తున్నాను. హత్య సమయంలో నువ్వు అక్కడుంటే నిన్నూ అనుమానిస్తాను" అన్నారు వాలిగారు నవ్వుతూ.

ఇన్ స్పెక్టర్ సుబ్బారావు సోఫాలోంచి లేచాడు.

"వాలిగారూ, ఏదో తేల్చి నాకు సహాయపడండి. పనులున్నాయి, వెళ్ళొస్తాను సార్," అన్నాడతను.

"సుబ్బారావు భాయ్, ఇదంత తొందరగా తేలదు. సరైన సమయం వచ్చినదాకా మనం వేచివుండాలి," అన్నారు వాలిగారు.

# 7

రోజులు గడిచిపోతున్నాయి. కాని వాలిగారి పరిశోధన ఏ మాత్రం ముందుకు పోలేదు. ఆయన అప్పుడప్పుడు ఫోన్ చేసి బొంబేలోని ఇన్ స్పెక్టర్ డోంగ్రేతో మాట్లాడేవారు.

నెల్లూరులో యింకా ఎంతకాలం వుండాలో, అని నేననుకునేవాడిని.

ఆనాడు ఆదివారం. వాలిగారు ముస్తాబై "రా, గిరీ," అన్నారు.

ఇద్దరం కారువైపు నడిచాం. కారును సుమలత యింటికి పోనిచ్చాం. వాలిగారు మౌనంగా కూర్చున్నారు. ఇన్ని రోజుల తర్వాత ఆమె యింటికి ఆయన ఎందుకు

వెళ్తున్నారు? ఏదేనా ఆయన కనుక్కున్నారా?

ఒక్కోసారి ఎంత అడిగినా ఆయన జవాబివ్వరు. ఆయన చెప్పాలని నిశ్చయించుకున్నదాకా మనం వేచి ఉండవలసిందే!

పార్కింగ్ ప్లేస్‌లో కారాపి దిగాను—వాలిగారు కారు పక్కనే నిలబడి నలువైపులా చూశారు—తోట పనిచేసేవాళ్ళు ఎక్కడా కనపడ్డంలేదు. గూర్ఖామాత్రం గేటుముందు వున్నాడు—

కనుచూపు మేర చెట్లు, పూలమొక్కలు కనిపిస్తు న్నాయి. భవనం ముందునుంచి చూస్తే ప్రహరీ గోడ కనపడదు. అది చాలా దూరంలో వుంది.

ముందు వరండా మీద నడిచి వాలిగారు గుమ్మంవైపు నడిచారు. ముందు గుమ్మం తలుపు మూసి ఉంది. వేళ్ళతో ఆయన తట్టారు.

తలుపు తెరవబడింది. మా ఎదురుగా సుమలత నిలబడి ఉంది!

"రండి, కూర్చోండి," అందామె.

వాలిగారూ, నేను సోఫాలో కూర్చున్నాం. మా కెదురుగా సోఫాలో ఆమె ఆశీనురాలైంది.

ఆమె వైపు పరీక్షగా చూశాను. తెల్లటి చీర, జాకెట్‌లో ఆమె మల్లెపువ్వులా కనిపిస్తోంది. ఒంటిమీద ఎక్కువగా నగలులేవు. నుదురుమీద తిలకంలేదు.

"అమ్మాయి, ఎలా ఉన్నావు?"

ఆమె అదోలా నవ్వింది.

"వాలిగారూ, ఏంచెప్పను? ఆయన పోయాక నా భర్త విలువను నేను గుర్తించగలాను. ఆయక అనేక కంపెనీలను ఫోన్‌లో మాట్లాడ్తూ నడిపేవారు. ఎప్పుడో

గాని ఆఫీసుకు వెళ్ళేవారు కాదు. ఇప్పుడు ఆ కంపెనీల మేనేజర్లు నన్ను చంపుకుతింటున్నారు. రోజుకు 200 ఫోన్ కాల్స్! ఇదంతా ఆయన ఎలా చూసేవారో!" అందామె.

"అమ్మాయి, నువ్వు నీరసంగా కనిపిస్తున్నావు. కొంత కాలంపాటు చల్లటి ప్రదేశానికి వెళ్ళి విశ్రాంతి తీసుకోడం మంచిది," అన్నాడు వాలిగారు.

"మా డాక్టర్ గారు కూడా అదే చెప్పారు. త్వరలో కాశ్మీర్ వెళ్ళాలి అనుకుంటున్నాను. ఇంత హఠాత్తుగా ఆయన హత్యచేయబడ్డం నా మెదడుకు షాక్ గా పరిణమించింది. ఈ యింట్లో రాత్రిళ్ళు నిద్రబట్టడంలేదు. విస్కీ బాటిల్ చేత్తో పట్టుకుని ఆయన తిరుగుతున్నట్లు అనిపిస్తోంది!"

ఆమె కళ్ళు నీళ్ళతో నిండాయి. చీరచెంగుతో ఆమె కళ్ళు తుడుచుకుంది.

"అమ్మాయి, నువ్వు చిన్నవయస్సులో ఉన్నావు. అందగత్తెవు. ఇప్పుడు కోట్లు నీ చేతిలో వున్నాయి. ఎక్కడికెళ్ళినా నువ్వు జాగ్రత్తగా వుండాలి!"

"వాలిగారూ, మీరు చెప్పింది నిజమే. ఆయన ఉన్నప్పుడు నేను చీకూ చింతాలేకుండా బ్రతికేదాన్ని."

వాలిగారు ఆమెవంక నవ్వుతూ చూశాడు.

"పోయిన నగలన్నీ దొరికాయని విన్నాను," అన్నారు.

"వాటిని చూసి నేనే ఆశ్చర్యపోయాను. ఆ దుర్మార్గులు తొందరపడి ఆయన ప్రాణం తీసుకున్నారు!" అందామె.

ఆదిలక్ష్మి ట్రేతో హాల్లోకొచ్చింది. టీపాయిమీద

ఆమె ట్రే పెట్టి వెళ్ళిపోయింది. ఆమెవైపు వాలిగారు పరీక్షగా చూస్తూ ఉండిపోయారు.

"ప్లీజ్, కాఫీ తీసుకోండి!" అంది సుమలత.

"కాశ్మీర్ ప్రయాణం ఎప్పుడు?" అడిగారాయన కాఫీ కప్పును తీసుకుంటూ.

"రెండు మూడు రోజుల్లో వెళ్తాను. శ్రీనగర్‌లో ఆయనకు పెద్ద భవనం వుంది. మా పెళ్ళయినాక మూడు నెలలు ఆ భవనంలో ఉన్నాం."

"కూడా ఎవర్నైనా తీసుకెళ్ళడం మంచిది!"

"ఎవరున్నారు నాతో రాడానికి? ఈ రోజుల్లో ఎవర్నీ నమ్మలేం. ఆదిలక్ష్మిని తీసుకెళ్తే కాస్త వండి పడేస్తూ ఉంటుంది," అందామె.

"గుడ్," అని ఆయన సోఫాలోంచి లేచారు.

ఆమె మా వెనకనే వరండా మీదకు వచ్చింది.

"వాలిగారూ, మళ్ళా మనం ఎప్పుడు కల్సుకుంటామో తెలియదు. నా భర్త హత్యకేసులో మీరుపడ్డ శ్రమకు థాంక్స్," అందామె.

"డోంట్ బాదర్! నేను కూడా రేపు మద్రాస్ వెళ్ళిపోతున్నాను. ఇక్కడుండి చేయగల్గినది ఏమీ లేదనిపిస్తోంది." అన్నాడాయన.

"అవును, నిజమే," అందామె.

వాలిగారు కూర్చున్నాక కారును గేటువైపు పోనిచ్చాను.

# 8

పాకింగ్ ముగించి గుమ్మంవైపు చూశాను. ఇన్స్పెక్టర్ సుబ్బారావు సగర్వంగా గదిలోకొచ్చి వాలిగారి ముందుకు నిలబడ్డాడు.

"వాలిగారూ, సెన్సేషనల్ న్యూస్! రేపీపాటికి ప్రతి దిన పత్రికలోనూ యీ వార్త ఉంటుంది!" అన్నాడతను ఉద్రేకంతో.

"బలరామ్ హంతకులు దొరికారా?" అడిగారు వాలిగారు.

"అవును, సార్. ట్రంక్ రోడ్డుమీద ఒక బస్సును ఆపి వాళ్ళిద్దరూ పాసింజర్లనుంచి డబ్బు దోచుకుంటున్నారు. వాళ్ళ చేతుల్లో టాయ్ పిస్టల్సు ఉన్నాయి. ఈ రహస్యం బస్సులోని వాళ్ళకు తెలియదు. అదృష్టవశాత్తూ జీప్‌లో అటువైపు నేను వస్తున్నాను. జీప్ ఆపి వాళ్ళను ఎదిరించి, బెదిరించి అరస్టుచేసి స్టేషన్‌కు చేర్చాను. సుమలత వర్ణించినట్లే ఉన్నారు వాళ్ళు. వాళ్ళను చితకబాది నిజం ఒప్పుకునేటట్లు చేశాను. బలరామ్‌ని వాళ్ళే చంపారు. నాముందు ఒప్పుకున్నారు," అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"నీ టార్చర్‌కి భయపడి చెయ్యని నేరాన్ని వాళ్ళు ఒప్పుకున్నారేమో!" అన్నారు వాలిగారు నవ్వుతూ.

"వాలిగారూ, నాలుగు దెబ్బలుపడితేగాని ఎవ్వరూ నిజం చెప్పరు!"

"సుబ్బారావు భాయ్, గుడ్‌లక్! బలరామ్ హంతకులు తటాలున నీముందు వచ్చిపడ్డారు. అందుకు సంతోషించి వాళ్ళమీద కేసు బనాయించు!"

"మీరొకసారి వచ్చి వాళ్ళతో మాట్లాడ్డం మంచిది!"

"నేను రావడంవల్ల లాభించదు. అయినా రాడానికి నాకు అభ్యంతరంలేదు," అన్నారు వాలిగారు.

"ప్లీజ్, రండి."

జీప్ వెనక నే కారును పోనిచ్చాను. పోలీస్ స్టేషన్

ముందు కారును ఆపారు.

ఇన్‌స్పెక్టర్ సుబ్బారావుతో వాలిగారూ, నేనూ లోపలున్న గదిలోకి వెళ్ళాం. ఊచలగదిలో వున్న వాళ్ళిద్దరివైపూ వాలిగారు చూశారు.

వాళ్ళ శరీరాలమీద యెన్నో గాయాలు వున్నాయి. చర్మాన్ని చెక్కేసిన సూచనలు కనిపిస్తున్నాయి. కాలుతున్న సిగరెట్‌ని అక్కడక్కడ అంటించిన బొబ్బలు అగుపిస్తున్నాయి.

వాళ్ళవైపు వాలిగారు జాలిగా చూశారు. "బలరామ్‌ని హత్యచేసినట్లు మీరు ఒప్పుకున్నారా?" ప్రశ్నించారు వాలిగారు.

"బ్లేడుతో చర్మాన్ని చెక్కుతూంటే ఒప్పుకోక ఏం చేస్తాం సార్?" అన్నాడు ఒకతను.

"మాకేం తెలీదంటే యింకా బాధపడాలి. అన్నిటికీ ఒప్పేసుకున్నాం" అన్నాడు రెండోవాడు.

వాలిగారు చుట్టపొగ వదుల్తూ ఇన్‌స్పెక్టర్ సుబ్బారావు వంక చూశారు.

"సుబ్బారావ్ భాయ్, యీ రోజుల్లో దేశమంతటా పోలీసులకు చాలా చెడ్డపేరు ఏర్పడింది. పోలీసులు రేప్ కేసుల్లో యిరుక్కుంటున్నారు. నువ్వు వాళ్ళను అమానుషంగా టార్చర్ చేయించావు. ప్రజాస్వామ్యంలో ఇటువంటి పోలీసు పద్ధతులకు తావులేదు. ఇటుపైన ఇటువంటి హింసాకాండలు జరగనీకుండా చూడు!" హెచ్చరించారు వాలిగారు గంభీరంగా.

ఇన్‌స్పెక్టర్ సుబ్బారావు ముఖంలో నెత్తురు చుక్కలేదు. "డాక్టర్ని పిలిపించి వాళ్ళకు ట్రీట్‌మెంటు యిప్పించు! ప్రజల రక్షణకోసం పోలీసుశాఖ వుద్భవిం

చింది. అమాయకులను పీడించడానికి కాదు!"

"వాలిగారూ, వీళ్ళు బస్సును ఆపి డబ్బు దోచుకుంటున్నారు. అది నిజం. నేను స్వయంగా చూశాను," అన్నాడు ఇన్ స్పెక్టర్.

"ఆ నేరంమీద వాళ్ళను అరెస్టు చేసి, కేసు పెట్టవచ్చు. తగు విధంగా వాళ్ళకు శిక్ష పడుతుంది" అన్నారాయన.

వాలిగారూ, నేనూ బయటనున్న కారు దగ్గరకు నడిచాం. ఇన్ స్పెక్టర్ సుబ్బారావు మా వెనకనే వచ్చాడు. చుట్ట పీలుస్తూ వాలిగారు సీటుమీద కూర్చున్నారు.

"వాలిగారూ, బలరామ్‌గారి హత్యకేసు అలా ఫైల్లో పడుండవలసిందేనా?" అడిగాడు సుబ్బారావు.

"సుబ్బారావ్ భాయ్, వసంతం వచ్చిందని తొందరపడి ఒక కోయిల ముందే కూసిందట. నువ్వూ అలా తొందరపడకు. బలరామ్ హంతకులు త్వరలో నాకు దొరుకుతారు. నిజంకోసం మనం కొంతకాలం నిల్చుని వుండాలి" అన్నారు వాలిగారు.

"అలాగే సార్," అన్నాడు ఇన్ స్పెక్టర్.

కారును పోనిచ్చాను. పక్కన కూర్చున్న వాలిగారు నా వైపు ఓరగా చూశారు.

"గిరీ, హోటల్ నుంచి వెంటనే మద్రాస్ పోదాం," అన్నారాయన.

ఆయన మాటలు విని ఆశ్చర్యపడ్డాను.

"ఈ కేసును వదలుకున్నట్టేనా?" అడిగాను.

"మద్రాస్‌నుంచి కాశ్మీరు వెళ్దాం. ఆ శీతల ప్రదేశంలో నా బుర్ర అఖండంగా పనిచేస్తుంది."

తృప్తిపడ్డాను. కాశ్మీర్ అని ఆయన అనగానే నా

మెదడులో ఎన్నో దృశ్యాలు ప్రత్యక్షమయ్యాయి. సుమలత కూడా కాశ్మీరు వెళ్తోంది. అక్కడా మెను కల్సుకో వచ్చు.

కాని మరో ఆలోచన నా హృదయాన్ని పీకుతోంది. వాలిగారు కాశ్మీరు యెందుకు వెళ్తున్నారు? ఆయన సుమలతను అనుమానిస్తున్నారా?

హోటల్ కాంపౌండ్‌లో కారు ఆపాను. ఇద్దరం కిందకు దిగాం.

"సెటిల్ ది హోటల్ బిల్, పోదాం," అన్నారాయన.

# 9

కాశ్మీర్!

సూర్యుడు ప్రకాశిస్తున్నాడు కాని చల్లగావుంది. శ్రీనగర్‌లోని రోడ్డమ్మట నడుస్తున్నాను. మూడు పెగ్గుల స్కాచ్ విస్కీ నన్ను వుషారుతో నింపింది.

పార్కుకు దూరంగా వున్న ఆ భవనం వైపు నడిచాను. గేటుముందు గూర్ఖా పచార్లు చేస్తున్నాడు. "శంకర్ భవన్" అని పెద్ద అక్షరాల్లో చెక్కబడివుంది.

గేటుముందు ఆగాను. గూర్ఖా వైపు నవ్వుతూ చూశాను.

"బలరామ్‌జీ వచ్చారా?" అడిగాను హిందీలో.

"వాళ్ళు యివాళ రాత్రి వస్తారు" అన్నాడతను.

వెనక్కు తిరిగాను.

"నీకేం కావాలి?" అడిగాడతను.

"కొత్త కాశ్మీరుసిల్కు చీరలు వాళ్ళకు చూపించాలి," అన్నాను.

గూర్ఖా బీడీనిపీల్చి తన పనిలో నిమగ్నుడయ్యాడు.

నేను వెనుదిరిగి వేగంగా వెళ్ళిపోయాను.

హోటలు రిసిల్ ముందుహాల్లోకి వెళ్ళాను. రూమ్ నెంబర్ 20 వైపు కదిలాను. తలుపుమీద తట్టాను.

"కమిన్!" అందో కంఠం లోపలనుంచి.

తలుపు తోసుకొని లోపలకు వెళ్లాను. పడకకుర్చీలో వాలిగారు కూర్చునివున్నారు. పక్కనున్న టీపాయిమీద స్కాచ్ విస్కీ బాటిల్, ఒక గ్లాసు, సోడావున్నాయి.

ఆయన నోట్లో చుట్ట వెలుగుతోంది. బుగ్గమీసాలు, ఆయన కళ్లు ఆ క్షణంలో భయంకరంగా వున్నాయి.

"వాళ్లింకా రాలేదు. ఈ రాత్రికి వస్తారు" అన్నాను.

"గుడ్. అంతవరకూ ఎంజాయ్ గిరీ!" అన్నారు వాలి గారు.

ఆయనకు నమస్కరించి సమీపంలో వున్న నా రూమ్ నంబరు 25 వైపు వేగంగా అడుగులేశాను.

* * *

రోడ్డు దీపాలు వెల్గుతున్నాయి. అతడు యింపాలా కారును పోనిస్తున్నాడు. చాలా చలిగావుంది. పక్క కూర్చున్న యువతి అతడి ఒళ్ళోకి ఒరిగిపోయింది.

అతడి ఎడం చెయ్యి ఆమెమీద వాలింది.

"లతా!" అన్నాడతను.

"రహీమ్!" అందామె.

"ఇంటికి పోదామా?"

"తొందరగా పోనీ! వెచ్చగా రొజాయికింద పడు కుందాం," అందామె.

కాస్సేపట్లో కారు గేటువైపు తిరిగింది. గూర్ఖా తలుపు తెరిచాడు.

"ఎవర్నీ లోపలకు రానివ్వకు" అందామె.

"జీ, సర్కార్," అన్నాడు గూర్ఖా.

కారు పోర్టికోలో ఆగింది. వాళ్లిద్దరూ దిగి లోపలకు వెళ్లారు. అతడు లైటు స్విచ్‌ని నొక్కాడు. ఫ్లోరసెంటు లైటు వెల్గింది. ఆమె తలుపు మూసింది.

నవ్వుతూ పడగ్గదిలోనికి వెళ్ళిపోయింది. అతడు కాసే పయ్యాక పడగ్గదిలో ప్రవేశించాడు. అద్దం ముందు ఆమె నిలబడి వుంది.

ఆమె ధరించిన వులెన్ కోటును తీసేసింది. ఖరీదయిన ప్రింటెడ్ సిల్కుచీరలో వుందామె. రహీమ్ చేతులు వెనుకనుంచి ఆమెను చుట్టేశాయి.

"డార్లింగ్!"

"మైడియర్," అని ఆమె వెనక్కు తిరిగింది.

వాళ్ళ పెదిమలు ఆవేశంతో హత్తుకుపోయాయి. ఆమె అతడివైపు తిరిగింది. చేతుల్ని అతడివెనక పెనవేసింది.

రహీమ్ మళ్ళా ఆమెను ముద్దెట్టుకున్నాడు.

"రహీమ్, ఐ లవ్ యూ!" అందామె.

"నీకోసం ఏదయినా చేస్తాను, లతా!" అన్నాడు రహీమ్ ఉద్రేకంతో.

కిటికీలకు కప్పిన కర్టెన్‌లు రెపరెపలాడాయి. ఇద్దరూ కిటికీవైపు చూశారు.

"దయ్యాల్లో నీకు నమ్మకముందా?" అడిగిందామె.

"దయ్యాలూ గియ్యాలూ లేవీ లోకంలో! బలరామ్‌గాడి దయ్యం యిక్కడికొచ్చి నిన్ను పీడిస్తుందని భయపడకు!" అన్నాడతను.

పడగ్గదిలోని లైటు ప్రకాశవంతంగా వెలుగుతోంది. కర్టెన్ వెనుకనుంచి వాలి భయంకర రూపం వాళ్ళవైపు

కదిలింది.

వాలిని చూసి ఆమె కెవ్వున అర్చింది. మరో కర్టెన్ వెనుకనుంచి నేను బయటకొచ్చి వాలిగారి పక్క నిల బడ్డాను.

నేలమీద ఆమె కుప్పలా కూలిపోయింది. ఆమెపక్క నున్న యువకుడి మొహంలో నెత్తురు చుక్క లేదు.

వాలిగారు అతడివైపు తీక్షణంగా చూశారు. "మిస్టర్ ఆదిలక్ష్మి!" అన్నారాయన.

నేను త్రుళ్ళిపడ్డాను. వాలిగారి మాటలు విన్నదాకా అతడు ఆదిలక్ష్మిగా నటించినతనని నేననుకోలేదు. అతడి వైపు పరీక్షగా చూశాను. సందేహం లేదు. వంటామె ఆదిలక్ష్మిగా ఇంతకాలం బలరామ్ యింట్లో పని చేసిన వ్యక్తి అతనే!

వాలిగారు చుట్ట పొగపీల్చి వదలుతూ వాళ్ళవైపు చూశారు.

"అమ్మాయి, నెల్లూరులో చీకట్లో చిందులాడాను. శ్రీనగర్ వెలుతురులో నన్ను తికమకలు పెట్టిన కేసుకు సొల్యూషన్ దొరికింది," అన్నారు వాలిగారు.

సుమలత కోపంగా వాలిగారివైపు చూసింది.

"నేను నా భర్తను చంపానంటారా?" అడిగిందామె.

"నువ్వు చంపలేదు కాని హంతకుడిని కప్పిపుచ్చావు!" అర్చారు వాలిగారు.

"ఆదిలక్ష్మిగా యితడు నటించి వుండొచ్చు. అయినా నా భర్తను చంపితే యితడికేముస్తుంది?"

వాలిగారు కొంతసేపు నిశ్శబ్దంగా వుండిపోయారు. ఆమెవైపు సూటిగా చూశారు.

"బలరామ్‌ను ఎందుకు హత్య చేయవలసి వచ్చిందో

యిప్పుడు నాకు అర్థమైంది! బొంబేలో నువ్వు రహీమ్‌ని ప్రేమించావు. మీరిద్దరూ కలిసి తిరిగేవారు. ఇదంతా ఇన్‌స్పెక్టర్ డోంగ్రే నాకు చెప్పాడు. ఇంతలో నీకు బలరామ్‌తో పరిచయమైంది. మీ ప్రేమ బలరామ్ కోట్లను వదులుకోలేకపోయింది. బలరామ్‌ని పెళ్ళాడావు. రహీమ్‌ని ఆదిలక్ష్మి వేషంలో నీ యింటికి తెప్పించుకున్నావు. తప్పతాగి పడుండే బలరామ్‌కి యిదంతా తెలియదు. నువ్వు తలుపు తెర్చివుంచేదానవు. రహీమ్ రాత్రిళ్ళు నీ గదిలోకొచ్చి నిన్ను అనుభవించేవాడు.. బలరామ్ ధనం నీ ప్రియుడు రహీమ్ సంపర్కం—అన్నీ నీకు లభిస్తున్నాయి!"

వాలిగారు ఆగారు. రహీమ్ నేలమీద ఆమె పక్కనే కూర్చున్నాడు.

"ఆనాటి రాత్రి బలరామ్ నీ గదిలోకొచ్చి లైట్ ఆన్ చేశాడు. మీరిద్దరూ పరుపుమీద మరో లోకంలో వున్నారు. గోడకు వేళ్ళాడుతున్న కత్తి తీసుకుని బలరామ్ మీ వైపు వచ్చాడు. ఆదిలక్ష్మిగా నటిస్తూన్న రహీమ్ అతడివైపు దూకి, బలరామ్ చేతిలోని కత్తిని లాక్కుని అతడి మెడను నరికేశాడు. బలరామ్ నేల కూలాడు. తర్వాత ఆ హత్యను కప్పిపుచ్చడానికి మీ బుర్రలు పనిచేశాయి. బాజీ ప్రసాద్, తాజీ ప్రసాద్ ఎన్నో దొంగతనాలు చేశారని మీకు తెలుసు. పత్రికల్లో వాళ్ళ ఫోటోలను మీరు చూశారు. ఇదంతా వాళ్ళిద్దరూ చేసినట్లు కల్పించడానికి మీరు తాపత్రయపడ్డారు. ఆ రెండు గ్లాసుల్లోనూ విస్కీ పోసుకుని తాగింది మీరే! బలరామ్‌ని హత్యచేయవలసి వచ్చింది. ఆ స్థితిలో మీలో చెలరేగే భయాన్ని పోగొట్టుకోడానికి మీరు

విస్కీ తాగారు. కొన్ని నగలు లెదర్ బాగ్‌లో పడేసి ఆ బాగ్‌ను సమీపంలో వున్న మడుగులో పడేసివచ్చాడు రహీమ్. రహీమ్ నిన్ను తాళ్ళతో కట్టేసి పోలీసులకు ఫోన్ చేశాడు, ఆదిలక్ష్మిలా!"

గదిలో లైట్ వెల్గుతోంది. వాళ్ళిద్దరూ తలల వాల్చేసి కూర్చున్నారు. ఆరిపోయిన చుట్టను వాలిగారు లైటర్‌తో వెలిగించారు.

"ఆదిలక్ష్మి నీ ప్రియుడు రహీమ్ అని ఎవ్వరూ గుర్తించరని మీరు భావించారు. ఇన్‌స్పెక్టర్ సుబ్బారావు నా సలహా కోరాడని మీరు కలగనలేదు!" అన్నారు వాలిగారు గంభీరంగా.

వాలిగారు నా వైపు తిరిగారు.

"గిరీ, పోలీస్ కమీషనర్ నక్వీకి ఫోన్ చేసి, నా పేరు చెప్పి వెంటనే యిక్కడకు రమ్మను!"

గదిలో వున్న ఫోన్ దగ్గరకు పరుగెత్తాను. నక్వీతో మాట్లాడి వాలిగారి దగ్గరకు తిరిగొచ్చాను.

"ఆయన వెంటనే వస్తానన్నారు," అన్నాను.

"గిరీ, నువ్విక్కడే వుండు! వాళ్ళు కదలకుండా చూడు," అని వాలిగారు చుట్ట పీలుస్తూ, తళ-తళ మెరిసే కళ్ళతో ముందు హాల్లోకి వెళ్ళిపోయారు.

నేలమీద కూర్చున్న వాళ్ళిద్దరివైపు చూస్తూ జేబులోంచి పాకెట్ తీసి, సిగరెట్ వెలిగించాను.

—: ఐపోయింది :—

# (పదకొండవ భాగము)

ఎలాగో అనగలిగాడు చివరికి. "ఎస్ డార్లింగ్. హి ఈజ్ డెడ్."

"అతను నా తండ్రి కాదు!"

భయంకరమైన నిశ్శబ్దంలో కూలిపోయాడు రాణా.

"నాకు చెప్పాడు రాణా! నేను ఆయన్ని చంప బోయే ముందు. నేను ఆయనకి పుట్టలేదట" బిగ్గరగా ఏడ్వ సాగింది లూసీ వణుకుతున్న శరీరంతో, "ఆయన పోయి నందుకు నాకు జాలిమాత్రం ఉంది అంతే. కాని ఒక తండ్రి మరణించినపుడు కూతురికి కలిగే దుఃఖం నాలో కలగడంలేదు. ఏమిటి రాణా కారణం? నేను యింకా.... పిచ్చిదాన్నా?" ఆమె తటాలున వెనక్కి జరిగి, రాణా ముఖంలోకి పరీక్షగా చూసింది "టెల్ మీ రాణా! యామ్ ఐ స్టిల్ ఇన్ సేన్?"

"నో డార్లింగ్...." ఆమె ముఖాన్ని రెండు చేతుల్లో తీసుకుంటూ అన్నాడు రాణా. "ఆ దుఃఖపు కెరటం నిన్ను తర్వాత తాకుతుంది. చాల దురదృష్టకర సంఘ టనల పరంపర వల్ల నువ్వు అల్సిపోయావ్ ....నీ మెదడు నిన్ను రక్షిస్తోంది....త్వరలో పితృవియోగపు బాధ నీలో ప్రవేశిస్తుంది.... దానికోసం వెతకొద్దు."

గట్టు తెగిన ప్రవాహంలా, లూసీ వెక్కి వెక్కి ఏడుస్తూ, తటాలున అతని కౌగిట్లో తలదాచుకుంది.

వెక్కిళ్ళతో, ఆమె సున్నితమైన దేహం బలహీనంగా ఎగిసెగిసి పడుతోంది.

"ఐ లవ్డ్ హిమ్....ఆయన్ను ఎంతగానో ప్రేమిం చాను.... నేను చేసిన ఘాతుకాన్ని తల్చుకుంటూ, ఏమీ

ఎరుగనిదానిలా ఎలా జీవించగలను రాణా? ఒక తండ్రిని హత్య చేసిన...."

"అది నీ తప్పు కాదు లూసీ .... యువర్ నాట్ రెస్పాన్సిబుల్!"

"అండ్ యూ రాణా! నిన్ను కూడా హతమార్చడానికి ప్రయత్నించాను. నన్ను క్షమించగలవా?"

"ఐ టోల్డ్ యు హనీ! దానికి బాధ్యురాలవు నువ్వు కాదు. విష మేఘం!"

తేలిగ్గా అంది లూసీ "యూ మై రియల్లీ ఆల్ రైట్ రాణా? యూ మై రియల్లీ బెటర్?"

"ఎస్, ఆఫ్ కోర్స్ యు ఆర్! నీకు ప్రమాదం పూర్తిగా తప్పిపోయింది. యిక నువ్వు గతాన్ని మర్చిపోడంలో నేను పూర్తిగా సాయపడతాను. నాకు నమ్మకం ఉంది లూసీ! త్వరలో అన్నీ మరువగల్గుతావ్.... యిద్దరం హాయిగా జీవిస్తాం....జీవితమంతా."

తర్వాత ప్రశాంతంగా యిద్దరూ చాలాసేపు కబుర్లు చెప్పుకుంటూ ఉండిపోయారు. రాణా మాటలు లూసీకి కొత్త ధైర్యాన్నిచ్చాయి....ఓదార్పునిచ్చాయి....ఆశలు చిగురింపచేసాయి....

చివరికి, అడిగింది లూసీ. "యిప్పుడేం జరుగుతోంది రాణా?"

"నన్ను మళ్ళీ వెనక్కి పంపిస్తున్నారు, విష మేఘం నుండి మైక్రోప్లాస్మాను సేకరించడానికి."

ఆమె ముఖంలో రంగులు మారాయ్. "ఎందుకు? నువ్వే ఎందుకు వెళ్ళాలి? జులేఖా చెప్పింది ఉన్మాదానికి కారణభూతమైన మైక్రోప్లాస్మా గురించి. కాని నిన్ను ఎవరు పంపుతున్నారక్కడికి? నువ్వే ఎందుకు వెళ్ళాలి?"

క్లుప్తంగా రాణా అంతా చెప్పాడు, జరిగిన సంఘటనల గురించీ, తనకు వ్యాధిసోకే ప్రమాదం లేకపోవడం గురించీ, అలాగే ఆమెక్కూడా ఆ ప్రమాదం లేదని చెబుతూ.

రాణా అంతా చెప్పాడు ఆమెకు. వ్యాధి గురించి, వ్యాధి పుట్టుపూర్వోత్తరాల గురించీ....

ఉదయపుటనుభవం గురించి కొంతమాత్రమే చెప్పాడు రాణా, ఆమెలో భయాన్ని రేకెత్తించడం యిష్టంలేక.

ఆందోళనగా, ఆ విషయాలన్నీ విన్నది లూసీ, గుండెల్లో గూడు కట్టుకున్న భయంతో, ఒకవైపు నమ్మలేక అపనమ్మకంతో.

వారి సంభాషణకు అంతరాయం కలిగించింది జులేఖా, అలసటను దాచుకుంటూ చిరునవ్వుతో ప్రవేశిస్తూ—

“ఆమెపై మరికొన్ని పరీక్షలు జరపాలి రాణా! విశ్రాంతికూడా ఆమెకు చాలా అవసరం.... ఇన్‌స్పెక్టర్ మీతో ఏదో చెప్పాలట.”

అతి త్వరలో తిరిగి వచ్చేస్తానని ప్రమాణం చేస్తూ రాణా లూసీని ముద్దాడాడు.

తిరిగి మృత్యుముఖంలాంటి విషమేఘంలో ప్రవేశించవద్దనీ, తనప్రక్కనే వుండిపొమ్మనీ, తను పూర్తిగా కోలుకునేదాకా వుండి, దగ్గరుండి తీసుకెళ్ళమనీ, చెప్పాలని లూసీ యెంతో ఆరాటపడింది.

కాని తన ప్రయత్నం నిరర్థకం అని ఆమె గ్రహించింది. లక్షలాది ప్రజల ప్రాణాలు, అతనిపై ఆధారపడి వున్నాయని యిప్పుడామెకు తెలుసు.

సైన్సు యెంత అభివృద్ధి చెందినప్పటికీ, ప్రపంచం యింకా మనిషిపై ఆధారపడి వుందని తెల్సు .... కేవలం ఒక్క మనిషిపై—

ఇన్స్పెక్టర్ రైనా, బయట కారిడార్‌లో యెదురు చూస్తున్నాడు. "నిన్ను తిరిగి విషమేఘంలో ప్రవేశించమని వాళ్ళు కోరుతున్నారు" చెప్పాడు రాణాకు. "కాల్షియం క్లోరైడ్ యింకా చల్లుతున్నారు, వందలాది టన్నులు....తగ్గినట్లు కనిపిస్తోందట. విషమేఘం బాగా విడిపోగానే, లోపల ప్రవేశించడానికి నువ్వు అక్కడ వుండాలట."

తలూపాడు రాణా.

"ఆల్‌రైట్, లెటస్ గో."

హెలికాప్టర్—నాసిక్ పట్టణం పొలిమేరల్లో వారిని దింపింది. ఎదురుగా జీపులు, ట్రక్కులు ఆగివున్నాయి. వాటివద్ద నిలబడి వున్నారు ప్రొఫెసర్ అశ్వత్థామ, ఆర్మీ అండర్ సెక్రటరీ రణధవే, లెఫ్టినెంట్ జనరల్ ప్రచండసేన్‌లు.

దూరంగా సాయంకాలపు ఆకాశంలో ఓ తేలికరకం విమానం శబ్దం చేసుకుంటూ క్రిందుగా ఎగురుతూ పంటపొలాలమీద క్రిమిసంహారక మందు జల్లినట్లు, కాల్షియం క్లోరైడ్‌ని విషమేఘంమీద చల్లుతోంది....

రణధవే ముందుకు వచ్చాడు చేయిచాస్తూ, "వాలియంట్ ఎఫర్ట్ దిస్ మోర్నింగ్ మిస్టర్ రాణా!" అన్నాడు రాణాతో కరచాలనం చేస్తూ.

విషాదంగా నవ్వాడు రాణా. "సారీ! పంజరంలో పక్షిని తేలేకపోయాను."

"నథింగ్ టు వర్రీ—బెటర్ లక్ నెక్స్ట్ టైమ్!"

అంతలో ప్రచండ సేన్ వారిద్దరిమధ్యకు వచ్చి, ముక్కు-సూటిగా అన్నాడు. "మీరు మళ్ళీ ప్రయత్నించాలి మిస్టర్ రాణా! మీరు ఆ శాంపిల్ పట్టుకురావడం చాల చాలా ముఖ్యం."

"ఎస్ రాణా!" తలూపాడు అండర్ సెక్రటరీ, "నిరాశా నిస్పృహాలు భరించలేక, సాహసించి యిద్దరు వలంటీర్లను విష మేఘంలోకి పంపాం, సంరక్షక దుస్తులు ధరింపజేసి! ఆర్మీస్కౌట్ వెహికల్ యిచ్చి పంపాం. గంటక్రితం వాళ్ళనుండి రేడియో మెస్సేజిలు ఆగి పోయాయి."

"సో, యిటీజ్ అవ్ టుయూ నౌ" అన్నాడు ప్రచండ సేన్.

"జంటిల్మెన్!" మధ్యలో కలుగజేసుకుంటూ వారి వద్దకు వచ్చాడు అశ్వత్థామ. "ప్రస్తుతానికి రాణా చేయ గలిగిందేమీ లేదు. విష మేఘం పై ప్రభావాన్ని చూపిస్తుం డటంచేత—కాల్షియం క్లోరైడ్ చల్లే కార్యక్రమాన్ని నిలుపుదల చేయడాన్కి వీలులేదు. రాణా ప్రస్తుతం ఆ దట్టమయిన కాల్షియంక్లోరైడ్ కాంసన్ట్రేషన్‌లో ప్రవే శించలేడు. దురదృష్టవశాత్తూ, యింకా అనుకున్నంత మేరకు విష మేఘాన్ని చెల్లాచెదురు చేయలేకపోయాం. కొద్ది సేపట్లో చీకటి పడబోతుంది. ఇది అతని లక్ష్యానికి మరీ అపాయకరం" అన్నాడు దృఢంగా.

"కానీ, వేలాదిమంది ప్రాణాలు పందెంలో పణంగా వున్నాయి."

"సరిగ్గా చెప్పావు. అందుకే రాణా అంత విలువయిన వ్యక్తి మనకు. అతని ప్రాణాలతో అనవసరమయిన రిస్కులు తీసుకోలేం — ముఖ్యంగా యిప్పుడు అక్కడ

'యిద్దరు పిచ్చివాళ్ళు' తిరుగుతున్నారని మనకు ఖచ్చితంగా తెలిసివుండీ కూడా."

"బట్ వుయ్ డోంట్ నో, దట్ ...."

"ఎస్. ఉయ్ డునో" అశ్వత్థామ కోపంగా అన్నాడు. "మీ ఒత్తిడివల్ల ఆ యిద్దరు వలంటీర్లూ లోపలికి వెళ్ళడం జరిగింది మిస్టర్ ప్రచండసేన్. మీ ప్రతిపాదనకు వ్యతిరేకంగా నేను సలహా యిచ్చాను. బట్ యు డిడింట్ లిసన్! ఇప్పుడు రాణా తన జీవితాన్ని రిస్క్ తీసుకోడాన్ని నేను సహించను. మీ తప్పుడు జడ్జిమెంట్ కారణంగా.... మొత్తం ఆపరేషన్ కంతటికీ అతను యెంతో కీలకమైన వ్యక్తి."

"అలాగని అసమర్థులా యేమీ చేయకుండా చేతులు ముడుచుకుని కూర్చోలేం," అన్నాడు రణధవే ఉద్రేకంగా.

"మనం ఇప్పుడు ఏమీ చేయబోవటంలేదు. సప్లయిస్ ఉన్నంతవరకూ, రాత్రి అంతా పొగమంచుమీద స్ప్రేయింగ్ కార్యక్రమం కొనసాగుతుంది. ఉదయానికల్లా చుట్టూ వున్న మేఘం కరిగిపోయి అసలైన మైక్రోప్లాస్మాను క్లియర్‌గా చూడగలుగుతాం, రక్షణగావున్న పొగమంచు మాయమైతే .... అవసరమయినప్పుడు పిలువబడతాడని చెబుతూ, ఈలోపుగా రాణాను నిద్రపోవడాన్కి ప్రయత్నించవలసిందిగా సలహాయిస్తున్నాను."

* * *

తెల్లవారుఝామునే, ఇన్‌స్పెక్టర్ రైనా యిచ్చిన ట్రీట్‌మెంటుకి నిద్రలేవక తప్పలేదు రాణాకి.

రాత్రంతా రాణా, శ్మశానం కోసం వెతుక్కుంటూ వెళ్ళే శవం ఊరేగింపులావున్న అధికారుల వాహనాల

హడావిడిని గమనిస్తూ—గంటల తరబడి గడిపాడు.

చివరిగా, ఎలాగో నిద్రలోకి జారుకోగలిగాడు.

మధ్యలో ఓసారి మాత్రం నిద్రాభంగమైంది. కేకలు వినబడినప్పుడు! కారణం....

ఇంతకుముందు విషమేఘంలో 'ప్రవేశించిన' యిద్దరు వలంటీర్ల 'మృతదేహాలు' దొరికాయి.

ఉన్మాదుల బారినుండి తమను తాము రక్షించుకోవడానికి ముందు జాగ్రత్తగా యివ్వబడ్డ తుపాకులతో, ఆ యిరువురు ఒకరినొకరు కాల్చుకొని చచ్చిపోయినట్లు తెలిసింది.

నిద్ర మళ్ళీ ఆవహించింది రాణాని, ఆ కల్లోలం కొంచం తగ్గిన వెంటనే.

ఇన్‌స్పెక్టర్ 'రైనా' మాటలు విని తత్తరపడ్డాడు రాణా. ఏమిటని మళ్ళీ అడిగాడు, మత్తు వదలగొట్టుకోడానికి కళ్లు రుద్దుకుంటూ—

"విషమేఘం వెళ్ళిపోయింది బ్రదర్" అన్నాడు రైనా ప్రతిమాట వత్తి పలుకుతూ.

"అది....మాయమయింది."

* * *

అంధకారం....

ఆరుబయలు ప్రదేశం....

సుబేదార్ సికిందర్ ఏడడుగుల ఎత్తులో, ఏటవాలుగా వున్న గట్టుదిగుతూ, బూటుకాలికి చెట్టువేరు అడ్డుపడడంతో, ముందుకి తూలిపడ్డాడు.

అతని చేతిలోని టార్చిలైట్ జారిపడి క్రిందకు దొర్లుకుంటూ పోయింది.

ఎదురుగా చీకట్లోంచి పకపకా నవ్వులు వినిపించాయి,

"చుప్ రహో సాలే! ఇధర్ ఆవ్!" అరిచాడు సికిందర్ కోపంగా, పడిపోయిన టార్చిలైట్ అందుకుంటూ.

టార్చిలైట్లు వెలిగిస్తూ యిద్దరు సిపాయిలు ముందుకు వచ్చారు, "మాఫ్ కర్నా సాబ్!" అన్నాడు గంభీరత నటిస్తూ పొడుగాటి సిపాయి సంగా.

"మిమ్మల్ని డ్యూటీలో వున్నప్పుడు తాగమని ఎవడు చెప్పాడ్రా?"

"ఫిర్ ఏక్ బార్, మాఫ్ కర్నా సాబ్! రెండురోజుల నుంచీ చేసే పనిలేదు. బోరుకొట్టి మందు దిగించాం!" అన్నాడు వినయంగా రెండో సిపాయి భోలా.

"నా మెత్తని తనాన్ని అలుసు తీసుకొని పిచ్చివేషాలేస్తున్నారు తాగుబోతు కొడకల్లారా. ఇంకోసారి డ్యూటీలో వున్నప్పుడు తాగి వాగేరంటే కాప్టెన్ కి రిపోర్టు చేస్తాను, పదండి" హూంకరించాడు సికిందర్.

ముగ్గురూ నడవసాగారు....

"సుబేదార్ సాబ్! మనం ఇక్కడికి ఎందుకు వచ్చినట్లు? ఇక్కడేంలేదు రైలు పట్టాలుతప్ప" వ్యాఖ్యానించాడు సంగా.

"ఈ గ్రౌండ్స్‌లో ప్రతి అంగుళం వెతకమని ఆర్డర్స్" కఠినంగా అన్నాడు సికిందర్, తుప్పు పట్టిన రైలుపట్టాల మీద టార్చిలైటు కాంతి ఊపుతూ.

"అది ఈపాటికి ఎక్కడికో పోయి వుంటుంది. రెండు రోజుల్నుంచీ ఈ ప్రాంతాల్లో వెతుకుతున్నాం...." అన్నాడు భోలా నీరసంగా.

"విషమేఘం వెళ్ళిపోయిందని 'వాళ్ళు' అనుకుంటున్నారు. మనం ఇక్కడ వున్నది నిర్ధారణ చేయడానికి."

"వాళ్ళేదో చల్లారుకదా సాబ్? దానివల్ల పూర్తిగా

కరిగిపోయి వుంటుంది. హైనా?" అన్నాడు భోలా, ఒ త్రిడి చేస్తూ.

"చెప్పాను కదరా చిడియా. వాళ్ళు అలా అనుకుంటున్నారు. కాని అది విచిత్రంగా మాయమైంది. వాళ్ళు రోజంతా స్ప్రే చేస్తూనే వున్నారు. ఆ మందు చక్కగా పనిచేస్తుంది కూడా. కాని అకస్మాత్తుగా అది అక్కడ లేదు—విష మేఘం మధ్యభాగంలోని పదార్థం."

"ఆ మధ్యలో ఉన్నదేమిటి సాబ్? భయంకరమైన నల్లి కాదు కదా!"

"కాదు. మనిషిని పిచ్చివాడ్ని చేసే వ్యాధి. అది పూర్తిగా మాయమయిందని వాళ్ళకు నిర్ధారణకావాలి."

"బాప్ రే! అది మనకు ప్రమాదం కదా?" నోరెళ్ళ బెట్టాడు సంగా.

"గభ్రావ్ మత్. మనం దానిలోకి ప్రవేశించనక్కర లేదు. అది కనబడగానే రిపోర్టు చేయాలి అంతే!"

భోలా ఆశ్చర్యంగా అడిగాడు. "సుబేదార్ సాబ్! ఇది యుద్ధం కాదుగదా? మనకు ఈ రైఫిళ్ళు యెందుకిచ్చారు?"

"పిచ్చివాళ్ళు దారికడ్డం బడితే—ఆత్మరక్షణ కోసం"

"ఈ అంధకారంలో పిచ్చివాళ్ళా? సుబేదార్ సాబ్! కొంచెంసేపు ఎక్కడయినా కూర్చుందాం. తిరిగి తిరిగి కాళ్ళు పీకుతున్నాయి" ఆక్రోశించాడు సంగా.

"నోర్మూసుకొని నావెంట రండి. కాప్టెన్ చూస్తే నన్ను చంపుతాడు."

రైలుపట్టాల మధ్యగా నడవసాగాడు సుబేదార్ సికిందర్ స్లీపర్స్‌మీద, టార్చిలైట్ కాంతివేస్తూ....

"అకస్మాత్తుగా యిప్పుడు రైలువస్తే మనమేమౌతాం

సాబ్?" భోలాకి అనుమానం వచ్చింది.

"త్రాగుబోతు ప్రేలాపన కట్టిపెట్టండి. ఈ రైల్వే లైను ఇప్పుడు ఉపయోగంలో లేదు. దీనిమీద మొలిచిన గడ్డినీ, తుప్పుపట్టిన రైలుపట్టాలను చూస్తే తెలియడం లేమూ?"

ముగ్గురూ ముందుకు నడుస్తున్నారు, పట్టాలకి యిటూ అటూ వున్న ఎత్తయిన గట్లమీద టార్చిలైట్ వేసి పరీక్షిస్తూ.

కొంతసేపయింతర్వాత అడిగాడు సంగా "సికందర్ సాబ్! ఆ విషమేఘం మధ్యలో 'మెరుపు'కి కారణమేమిటి?"

"నేను చెప్తాను" అందుకొన్నాడు భోలా, "ఏదో పుస్తకంలో చదివానుయార్! అణుధార్మిక....ఆఁ! రేడియేషన్ అయ్యుండాలి" అన్నాడు పొట్టిసిపాయి భోలా గర్వంగా.

"ఎవరు చెప్పారు అది 'రేడియేషన్' అని?" సికిందర్ ఆగి వెనక్కి తిరిగి వాళ్ళవైపు చూశాడు.

"అవకాశం వుంది, సాబ్!" భోలా కళ్ళు ఆనందంతో మెరుస్తున్నాయి. "అది మెరుస్తోందని మన సైంటిస్టులు చెబుతున్నారు. దానికి మనిషి మెదడును చెదపట్టించే గుణం వుంది. అది రకరకాల ప్రదేశాలకు కొట్టుకపోతూ వుంటుంది. దాన్ని మనవాళ్ళు ఆపలేకపోతున్నారు. వీటి అన్నిటి ఆధారంగా నేను ఊహించాను."

"అలాగా! అయితే రేడియేషన్ సముద్రంలోంచి యెలా వస్తుందిరా కమీనే?"

"అలాంటి కట్టుకథలు నమ్మడానికి ప్రభుత్వం మీమీద ఆధారపడుతుంది."

"నోరు సంబాళించుకోరా భోలా! మిలిట్రీ జైల్లోకి పోతావ్!"

"కోపగించకండి సాబ్! ఇక పదండి."

ముగ్గురూ ముందుకు నడవసాగారు.

వెనగ్గా నడుస్తున్న భోలా, తన తెలివితేటల్ని మళ్ళీ ఏకరువు పెట్టసాగాడు సంగాకు. "ఈపని సైంటిస్టులే చేసివుండాలి. ఏ తారాపూర్ అణుకేంద్రాలలోనో ప్రేలుడు జరిగివుండాలి. ఆ రహస్యాన్ని దాచడం కోసం ఈ కట్టుకథలు....ఏమంటావ్?"

"ఠీక్ హై ప్రొఫెసర్!" అన్నాడు సంగా ఉత్సాహంగా, "భావ్‌నగర్‌లో భూమి కంపించడానికి కారణం కూడా ఆటమిక్ ప్రేలుడు అయివుండాలి."

"బక్వాస్ బంద్ కరో—భోలా? మన ఎదురుగా పెద్ద టన్నెల్ వుంది" అన్నాడు యెదురుగా నల్లటి ఆకారం వైపు చూస్తూ సికిందర్.

"కాస్సేపు అక్కడ రెస్టు తీసుకుందాం!" అన్నాడు ఆత్రంగా సంగా.

"ఎప్పుడో నా తుపాకీతో మిమ్మల్నిద్దర్నీ కాల్చి చంపుతాను సైతాన్‌కి బచ్చే!" అసహనంగా కేకపెట్టాడు సుబేదార్.

అర్ధచంద్రాకారంలో ఉంది సిమెంటు టన్నెల్ ఎత్తుగా.

లోపల గుహలా వుంది....

టన్నెల్ ముఖద్వారంలో సంగా, భోలా చతికిలబడ్డారు, దూరంగా చుట్టుపక్కల సెర్చింగ్ చేస్తున్న సైనికులకి కనబడకుండా.

సంగా అగ్గిపుల్ల వెలిగించి చెయ్యి అడ్డం పెట్టుకొంటూ

తన సిగరెట్ ముట్టించుకొని, భోలా సిగరెట్ వెలిగించాడు.

"ఓహ్ సారీ సుబేదార్ సాబ్" అన్నాడు సంగా, కంగారుగా మండే అగ్గిపుల్ల సికిందర్ వైపు చూపుతూ.

"నెవర్ మైండ్" అని సిగరెట్ తన అగ్గిపెట్టెతో ముట్టించుకున్నాడు సుబేదార్.

సంభాషణ మళ్ళీ రేడియేషన్ మీదకు మళ్ళింది ... యిక వారి ధోరణి భరించలేకపోయాడు సికిందర్. "మీరిక్కడే ఏడవండి. నేను లోపల చూసివస్తాను. తర్వాత వెనక్కిపోదాం" అన్నాడు విసుగ్గా.

"ఠీక్ హై సుబేదార్ సాబ్!" అన్నారిద్దరూ ముక్తకంఠంతో. సికిందర్ టార్చిలైట్‌తో, గుహలాంటి టన్నెల్‌లోకి ప్రవేశించాడు.

* * *

టన్నెల్ పొడవుకి విసుపోయాడు సికిందర్.

ఎంతసేపు నడిచినా దాని చివరిభాగం కనబడ్డంలేదు అతనికి. టార్చిలైట్ కాంతిలో చెమ్మగా రాతినేల కనబడుతోంది. ఒకచోట ఆగి, వెనక్కి తిరిగి చూశాడు సుబేదార్.

ఇప్పుడు భోలా, సంగాల ఉనికిని తెలిపే టార్చిలైట్లు అతనికి కనబడటంలేదు.

బహుశా—తను టన్నెల్‌లో మలుపు తిరగడంవల్ల అనుకున్నాడు సికిందర్.

తను మలుపు మధ్య వుండి వుండాలి.

ముందు దారి, వెనుకదారి కనబడ్డంలేదు.

అకస్మాత్తుగా లఘుశంక తీర్చుకోవాల్సిన అవసరం

గుర్తుకొచ్చింది సికిందర్ కి.

రైఫిల్ గోడవారగా పెట్టి, టార్చిలైట్ నంకలో పెట్టుకొని పాంటు గుత్తాలు విప్పుకోసాగేడు సుబేదార్.

సరిగ్గా అప్పుడే....

తన కాళ్ళకు సన్నని తీగల్లా చుట్టుకుంటున్న పసుపు రంగు పొగను గమనించలేదు సికిందర్.

కొద్దిక్షణాల్లోనే ఆ పొగమంచు దట్టంగా మారి, మెల్లగా పైకిలేచింది, అతన్ని కప్పేస్తూ.

* * *

"సుబేదార్ వెళ్ళి చాలా సేపయింది" వ్యాఖ్యానించాడు సంగా, వేళ్ళు కాలుతున్నా, సిగరెట్ ఆఖరి దమ్మును లాగడానికి ప్రయత్నిస్తూ.

"అలా చేస్తే తొందర్లోనే కాన్సర్ తో చస్తావ్!" హెచ్చరించాడు భోలా. "సిగరెట్ ఆఖరి ముక్కలో నికోటిన్ ఎక్కువ వుంటుంది." భుజాలెగరేశాడు సంగా నిర్లక్ష్యంగా.

ప్రక్కకు తిరిగి, పొలికేక పెట్టాడు భోలా, "జల్దీ ఆవ్ సుబేదార్ సాబ్! క్యాకరె హోతుమ్...."

"సుబేదార్ 'ఈ' విషయాన్ని చాలా సీరియస్ గా తీసుకుంటున్నాడు కదూ?" అన్నాడు సంగా.

"కాప్టెన్ ప్రమోషన్ కోసం" చెప్పాడు భోలా.

"పొగమంచు సంగతేమిటంటావ్ భోలా?" అడిగాడు మళ్ళీ సంగా, ఒక్కో టాపిక్ మీదా భోలా నాలుగైదు, అభిప్రాయాలు చెప్పగలడని తెలిసి—

"నహీ మాలూమ్ యార్! వాతావరణ కాలుష్యం వల్ల కూడా యిలాంటి ప్రమాదం ఏర్పడొచ్చు. ఫ్యాక్టరీలు చెత్తనంతా నదుల్లో పారబోయడంవల్ల చేపలు చచ్చి

పోయి, తేలడంలాంటి సంఘటనలు పేపర్లలో చదివే వుంటావ్. ఈసారి ఏదో ఫాక్టరీ, చైతన్యంతా ఆకాశంలో వదిలివుండాలి, గాస్ కాని, విషవాయువు కాని."

భోలా తన కొత్త షేరీని సవరించుకుంటుండగా—విషమేఘం గుహలోనుండి చీకట్లో ఎవరికీ కన్పించకుండా ఆయిద్దరివైపు పాక్కుంటూ రావడాన్ని ఎవరూ గమనించలేదు.

ఆ పొగలోంచి ఓ ఆకారం, రైఫిల్ ముందుకు సాచి వేగంగా వస్తోంది....

రెండు టార్చిల కాంతిలో కూర్చున్న యిద్దరివైపు, ఆ వ్యక్తి గబ-గబా నడుస్తున్నాడు.

అతని చంకలోని టార్చి, యింతకుముందు టన్నెల్ లోని రైలుపట్టాల మధ్యగా పడిపోయింది.

క్షణాల్లో అతను భోలా, సంగా వద్దకు చేరుకున్నాడు.

"కిధర్ గయే సాబ్? అభీతక్...."

ఆ ప్రశ్న వినబడలేదు అతనికి.

అతను నెమ్మదిగా రైఫిల్ పైకెత్తి, బారెల్ ని ఒకడి నుదుటికి ఆన్చాడు.

వెనువెంటనే ట్రిగ్గర్ నొక్కాడు.

ఆ గుహలో 'ఢాం'....అంటూ పేలిన రైఫిల్ శబ్దం 'రెండో' వ్యక్తి పొలికేక, పెద్దగా ధ్వనించాయి.

నిశ్చేష్టుడై, శిలాప్రతిమలా నిలబడిపోయాడు భోలా, పొగలు కక్కుతున్న రైఫిల్ కేసి చూస్తూ.

మరుక్షణం తేరుకుని, చీకట్లో గోడవారగా నిలబెట్టిన తన రైఫిల్ మర్చిపోయి గుహద్వారంనుండి బయటికి పరిగెత్తాడు భోలా, వెర్రిగా అర్చుకుంటూ.

ప్రాణ భయంతో, బిక్క చచ్చిపోతూ, పరిగెడుతూ, పది అడుగుల ఎత్తులో ఉన్న గట్టు ఎగబ్రాకసాగాడు. భోలా.

అదే అతను చేసిన పొరపాటు.

సగంమారం ఎక్కి, బూటుకాలు జారి, బరువుగా క్రిందికి జారిపోయాడు భోలా—

మోకాళ్ళమీద పడిఉన్న భోలా, ప్రక్కగా, గంభీరంగా నిల్చొని ఉన్న సికిందర్, చేతిలోని రైఫిల్ మడమ రివ్వున గాలిలోకి లేచింది....

గుహలోనుంచి విష మేఘం బయటికివచ్చి వారిద్దర్నీ కమ్మేసింది....

* * *

రాణా అప్పుడే కళ్ళు తెరిచి, సీలింగ్ వైపు తదేకంగా చూడసాగాడు. అతని మస్తిష్కం, తిరిగి మామూలుగా పనిచేయడానికి కొన్ని క్షణాలు పట్టింది.

తర్వాత బెడ్ మీద, తన ప్రక్కగా పడుకున్న లూసీ వైపు తలతిప్పి చూసాడు.

కర్టెన్ గుండా ఉదయకాంతి ఫిల్టర్ అవుతూ, ఆమె ముఖంమీద పడి, ప్రశాంతంగా కనబడుతోంది.

భౌతికమైన గాయం మానుతుంది. కాని మనసులో లోతుగా నాటుకున్న గాయంనుండి ఆమె తిరిగి కోలుకో గలుగుతుందా?

డాక్టర్ జులేఖా, తనకి పూర్తి హామీని యిచ్చింది. తనలాగే ఆమె పూర్తిగా కోలుకొన్నదనీ, ప్రాణాంతరమైన ఆ వ్యాధి తిరిగి ప్రకోపించే అవకాశం ఎంతమాత్రం లేదనీ.

(ఇంకా వుంది)

## "ముఖచిత్ర వాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి. సభ్యులుకాని వారు తమ వ్యాఖ్యలతో 50 పైసల స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 25/- నగదు బహుమతి పంపుతాము.

## "హోమ్ డెలివరీ

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 8/- లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారాగాని మీ యింటి దగ్గర అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీలకోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగాల్సిన అవసరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టుతో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు ఏడాది పైకము రు. 90/-లు ముందుగా పంపవచ్చును. •



## ప్రేమలో న్యూసెన్సు

[ఈ శీర్షికలో ప్రచురింపబడే ప్రతి రచనకు రు. 5 లు పారితోషికం ఇవ్వబడును—ఎడిటర్]

# అపాయం లేని ఉపాయం ?

నాదోపాసకులు నారాయణరావుగారు తన శిష్య బృందంతో కచేరీ చెయ్యడానికి రాజమండ్రి బయలుదేరారు.

వాల్తేర్ స్టేషన్‌నుంచే బండి బయలుదేరాలి. ఆయన స్టేషన్ చేరేసరికి బండిని ప్లాట్‌ఫారం మీద పెట్టేయడం జరిగింది.

ఏ కంపార్టుమెంట్ చూపినా ఇసుకవేస్తే రాలని జనం! ఇంత జనంలో తనూ, శిష్యబృందం వీరందరినీ మింగేసే సామానులు, ఎలా వెళ్ళడమా అని ఆయన తీవ్రంగా ఆలోచిస్తున్నారు.

అందరిలో చురుకైన శిష్యుడు అవతారం "గురూజీ! నాకో ఉపాయం తోచింది మీరందరూ ఎలాగోలా అవస్తపడి నన్ను ఆ చివరి పెట్టెలోనికి తోసేయండి. మిగతాది నేను చూసుకుంటాను" అన్నాడు.

శిష్యుడి ప్రతిభమీద అంత నమ్మకం లేకపోయినా ప్రయత్నించడంలో తప్పులేదని గురువుగారు 'ఊ' కొట్టారు. ఆయన సిగ్నల్ ఇవ్వడం ఆలస్యం, నలుగురూ అవతారంని చీకటి గుహ్వారంలా వున్న ఆ కంపార్టుమెంట్ లోనికి కిటికీద్వారా రవాణా చేసారు.

కంపార్టుమెంట్‌లో లైట్లు లేవు. ప్లాట్‌ఫారంమీద లైట్లు చిన్నగా తమ కాంతిని యధాశక్తి ఆ కంపార్టు మెంటుకు దానం చేస్తున్నాయి.

లోపలికి ప్రవేశించిన అవతారంకి తోటి ప్రయాణికుల తిట్లు పుష్కలంగా లభించాయి. అన్నీ దులిపేసుకొని ఒక మూల కొద్దిగా స్థలం ఆక్రమించాడు. ఐదు నిముషాలు పూరుకుని "పాము! పాము!" అని అరవడం ప్రారంభించాడు. అందరూ కంగారుగా "ఎక్కడ? ఎక్కడ?" అని గాభరాపడసాగారు. చీకట్లో స్పష్టంగా ఏమీ తెలియటంలేదు. అందరూ కంగారుగా పెట్టే బేడాలతో క్రిందకు పరుగెట్టారు.

ఐదు నిముషాలలో కంపార్టుమెంట్ ఖాళీ! అవతారం గర్వంగా గుండు తడుముకున్నాడు.

గురువుగారితో సహా శిష్యబృందం అంతా కంపార్టు మెంట్‌లోనికి వచ్చేరు. ఒక్కొక్కరూ ఒక్కొక్క బల్ల మీద కాళ్ళు చాచి పడుకున్నారు. సామాన్లు సర్దేశారు.

ట్రైన్ బయలు దేరడానికి ఇంకా నలభై అయిదు నిము షాలు టైము వుంది. అందరూ కునుకుతీయడం ప్రారం భించి, నిద్రలోనికి జారుకున్నారు.

ఉదయాన్నే బాలభానుడు తన అరుణకిరణాలతో అంద రికీ మేలుకొలుపు పాడాడు. కళ్లు నులుపుకుంటూ కిటికీలోంచి పోర్టర్‌ను కేకేసి "ఇదే స్టేషన్?" అని అడిగాడు అవతారం.

"వాల్తేర్!" అన్నాడు. ఏం ట్రైన్ ఇంకా బయలుదేర లేదా? అని బయటకు వచ్చి విషయం కనుక్కున్నాడు. జరి గింది వినగానే అవతారంకి కళ్లు తిరిగినంత పనయింది.

రాత్రి ప్రయాణికులు చాలామంది పాము కంపార్టు

మెంట్‌లో వుందని, లైట్లు లేవని ఫిర్యాదు చేయడంవలన, ఆ పెట్టెను తోసేసి వేరే కంపార్టుమెంటు తగిలించారు. ట్రైన్ యెప్పుడో వెళ్ళిపోయింది.

పాపం! అవతారం ప్లాన్ ఎదురు తిరిగింది.

—డా॥ ప్రభాకర్, కలకత్తా-73

## పుచ్చకాయల్లో వైన్!

పుచ్చకాయలతోట వున్న ఒక ధనవంతుడు తన స్నేహితుల్ని కుటుంబ సమేతంగా పిలిచి తన తోటలో పార్టీ చేసాడు. పుచ్చకాయలలో రంధ్రం చేసి స్ట్రా పెట్టి వుంచారు ముందుగా.

అందులో మగవారికని వుంచిన కాయలు పొరపాటున ఆడవాళ్ళకు యిచ్చేసాడు తోటమాలి. యజమాని కంగారు పడిపోయి అక్కడ నిలువకుండ జారుకున్నాడు. పార్టీ కాగానే తోటమాలిని పిలిచి

"ఏరా పార్టీలో ఏదన్నా గొడవ జరిగిందా?" అడిగాడు.

"లేదండీ. అంతా బాగానే జరిగింది. మన పుచ్చకాయలు చాలా బాగున్నాయని వచ్చిన ఆడవాళ్ళంతా తోలుతోకూడ తినేసారు గింజలుకూడ పొట్లంకట్టి తీసుకుపోయారు తమ తోటలో పండిస్తామని" అన్నాడు అమాయకంగా.

మగవారికుంచిన కాయలలో 'వైన్' నింపిన సంగతి అతనికేం తెలుసు.

—దామెర్ల కృష్ణమూర్తి, నెల్లూరు.

